శ్రీ మద్భాగవతము - సప్తమస్కంధము

# అశ్వీన మహాత్మ్యము









కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి
పుట్టి లక్ష్మీనరసింహశాస్త్రి









ప్రథమ ముద్రణం

1942

సవ్యాఖ్యా సంవలితం

రు 2-0-0

# విషయసూచిక

ప్రథమాశ్వాసము



ద్వితీయాశ్వాసము

చతుర్థాశ్వాసము



పంచమాశ్వాసము

శ్రీరామ

## కాలభాగవతము - సప్తమస్కంధము

# ఆశ్వీస మాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

శ్రీకల్యాణగుణాకరమ్ములు, కలాస్థేమాభిరామమ్ము, ల
స్తోకప్రాభవభావితమ్ములు, శ్రుతిస్తోమానిశస్తూయమా
నాకారమ్ము, లుదారకారుణికతావ్యాపారముల్, శ్రీశివా
లోకాలోకనముల్, త్రిలోకముల కెప్డుం గూర్చి పేర్చుం
దముల్. ౧

శా. నిత్యానందమయమ్ము, నిర్మలము, నిర్నిద్రప్రకాశమ్ము, నీ
శత్యక్తమ్ము, నిరీశ్వరమ్ము, నిఖిలేశానమ్ము, నిర్మూలమున్,
శ్రుత్యంతప్రవిచింత్యవైభవము, సంశుద్ధమ్ము, బుద్ధమ్ము, ని
ష్ప్రత్యూహమ్ము, త్రిసత్యమై తవు శివబ్రహ్మమ్ముఁ
జింతించెదన్. ౨

చ. అమరిన యాస్య నెంతొ లఘికాంతశరీరం డటు పుట్ట గిట్ట మూ
లమ యవ్వరీల జాలుకొన లక్షితమై పవడాలడాలుతో
సమరథమో పల్లవమహో ప్రభ నప్రతిమమ్ము చిద్ఘన
మ్ము మహిత మౌచు నాడుమగపోఁడుములన్ వెల
యించు తత్త్వమున్. 3

ఉ. అంబురుహాసనాదు లమృతాశననాయకు లెల్లరుం బ్రమో
దం బివురింప నొందినపదంబులు కంబిన యత్ప్రసాదపూ
రం బనునంబుధిం బొదలి క్రాలునభంగతరంగముల్ పదా
లంబన మెప్ప నచ్చిదుపలక్షిత మంగళదేవి వేఁడెదన్. ౪

మ. తలఁతుం బాయనిరూఢి ప్రౌఢిఁ గన వక్త్రమ్ముల్ నివా
సమ్ములౌ కలనల్ చాటఁగఁ దేటపల్కుబడి-వాక్కాటమ్ము
బాహాట మౌ చెలువమ్ముం బొదలించి మించి పతి
సంస్తుతిం గడున్ సార్థతన్ నలువారించు వినీలవేణి
వరవీణాపాణి వాణిన్ మదిన్. ౫

క. తమకము నిండ మధుప్రపము
క్షమాసమాహాత్మ్యరచనకలనమునకుఁ జే
రిమి శంకువ్రఁ బొఁతిన యా
గమవిదుఁ డవ్వేంకటప్పకవిగురుఁ దెలఁతున్. ౬

క. అని ముఖ్యదేవతావం
దనమును గురువర్యచింతనమ్మును నిమ్మల్

గాన శ్రీజననిచరిత్ర
మ్ము నిబంధాకృతిని గూర్చు మురు విరవుకొనఁగ— ౭

వ. నిండారు తమద్యోగమ్మునన యుండి యొకనాఁడు
బ్రాహ్మముహూర్తమ్మున కయడియ మొదలిటి గడియ
యనఁ జను నయ్యదనున నుప్పరిగపయి నొ ప్పొలయించు
నలవున నిదురించుచున్న యవ్వేళఁ గలలోన— ౮

తే. పొరిఁ ద్రయీమూర్తి యరుణుఁడు పొడుపుచక్కిఁ
బొడిచి పొడువనినెత్తఁ దోఁచి ముందు వెనుక
లరయు గృహమేధివిధ మొప్ప నడుగుపైపొ
లములఁ బంచి యిచ్చినమొయి నముటతటిని, ౯

సీ. కడఁగి తనూలతాకాంతి యప్పద్మినీ
కాంతునికాంతితోఁ బంతగింప
రంగారు రవణాల పొంగారు మెఱుఁగులు
చెక్కుటద్దమ్ములఁ జిందు వైంద
జాల్కొను కరుణారసము దొనుకుచూడ్కులు
భువనపాలనకలాస్ఫూర్తిఁ బరఁగ
నడుగు వట్టినవారి కడరు నే యెడ రను
నందెలరవళి మి న్నంది కులుకఁ

గడుపు చల్లగ సీతమఁ గన్నతల్లి
యిల ననుగ్రహించుచు నించునలసవృత్తి

నిరుపమ నటనంగు నెత్తిపద్మల నేగుదెంచి
యొక మహాతల్లి దరిసెన మొసఁగి యెసఁగి. ౧౦

క. అల వాణీవీణాతం
త్రులకుం బలుకున్నాలపుసిరి నొగి నేర్పుతీ
ర్పులయించి నించు సుమధుర
గలమున వత్సా! యని శుభగతిఁ బిలుచుటయున్. ౧౧

క. పరమాదరమును దరమును
దరలని వెలి సంతసము వినయ మయము సుని
ర్భరభక్తియు నప్పుడ ము
ప్పిరిఁ గొన నే లేచి తోఁచు విమలినవృత్తిన్. ౧౨

సీ. కొనకొని యెద రేగుపని కూర్చునంజలి
బంధ మయ్యాది సమావాహనముగ
నమ్మ! దేవి! కొనుమమ్మ నమస్కార
మన్న యంతర్వాణి ధ్యానకలగఁ
గనుకొలంకుల జాలు కొనుహర్షరసబిందు
లర్ఘ్యపాద్యాచమనాంబువులుగ
నిండారు హృత్పుటపుండరీక మ్మది
హాయి వొందు పుండరీకాసనముగ

నాదృతిస్ఫూర్తు లర్చోపహారములుగ
నలరుమూడ్కులు కపురంపు టారతులుగఁ

బదియు నా ఉపచారముల్ వరుసఁ దీర్చి
పేర్చు నెఱి మీఱి దరిఁ జేరి వెలయుటయును. ౧౩

సీ. చెవి సోఁకుమాత్ర మచ్చిత్తగహ్వర మిర
వుగ డాఁగి యున్న యెఱుఁగమి యన్న
మాయచీఁకటికిం బలాయనమంత్రమ్ము
జెప్పించి నను సిద్ధుఁ జేయఁ దివురు
నమృతమయోక్తులు కొమరారఁ గొను మని
తనచంక నిడుకొన్న యనుఁగుకూఁతు
సీతామహాలక్ష్మిఁ జెలఁగి జగన్మంగ
ళకరములు కరపల్లవము లల్లఁ
జాఁచి యేచినకూర్మి యొసంగ నపుడొ
సంగి చెంగున వచ్చినచాయఁ జనియె;
నాఁటి యద్భుత మాఘటనమ్ము గరిమ
రాదు మఱపున కేనాఁడు రవ్వయంత. ౧౪

ఉ. భవ్యు లవార్యవాగ్విభవభావ్యులు మాగురువర్యులంత లై
నవ్యనిబంధబృందరచనాకలనాచణు లౌ మహామహుల్
భవ్యము దృశ్య మద్ది గన వ్రాయరె భారత మంత
గ్రంథముఁ దివ్యపదానుభూతినిరతిం బ్రతిపాదరసో
దయమ్ముగాఁ. ౧౫

క. ఆ ముల్లోకము లేలెడు
కామేశిమహామహిమము కౌతుక మెచ్చం

గా మొగకొంటిమి కూర్పం
గా మేకసనుగ్రహమ్ముఁ గాంక్షించు నెఱిన్. ౧౬

మ. తనకుం గూరుచు దేవిపావనచరిత్రమ్ముల్ సుధీశ్రోత్రజీ
వనముల్ నోళులు వేలుగాఁ బ్రతిపదవ్యాలీఢతారూఢ మా
నను చెప్పం బ్రకటించు మాదు కృతికన్యల్ ధన్య సమ్మా
న్యఁ గామన నాశీఃశివకల్పఁ జల్వ శివుఁడే మా యండ
యుల్ దండయుల్. ౧౭

కృతిపతిప్రశంస

శా. శ్రీకామేశ్వరసంజ్ఞిత మ్ముపనిషత్సీమంతినీస్తోమభూ
షాకారప్రచురశ్రవోమహిత మర్ధాంగాప్తకామేశ్వరీ
శ్రీకారుణ్యకటాక్ష మక్షతమహస్స్మేమాభిరామమ్ము త
త్వాకారిప్రముఖస్తుతమ్ము శివతత్త్వ మ్మెంతు
నశ్రాంతము౯. ౧౮

శా. దాసత్రాణపరాయణ౯ శుభదచింతారత్నసౌధాంతరా
వాసోల్లాసరసాలసం ద్రిదశసేవాభావితాంఘ్రిద్వయి౯
వ్యాసాదిస్తుత సర్వమంగళ నెదం బ్రార్థింతు నేతత్కృతి
శ్రీసాహిత్యముఁ గోరుకొన్నకృతిదా క్షేమమ్ము
హేమింపఁగా౯. ౧౯

శా. లేరా లోకములందు ధీరులు కలాలీలావిహారాదృతిం
బేరుల్ గూరినవారు వేవురు, నెఱి౯ మేకొన్న మోదంబుసం

భారం బింబులు నూలొక్కనం గృతికి సంభావించి చేయూఁత లీ సారెల్ సారతరస్థితిం దిప్పరు సుస్వాంతుల్ గదా శంతముల్. ౨౦

శా. పలుకంబలుకనఁ దేనెసోనలు, నడల్ భాసిల్లునొయ్యార పుంగులుకల్, దళుకలు బెళుకలుం గలల, నిగ్గు ల్నించు మేల్జగ్గు లొప్పోలికం, జిలుకరసమ్మునల్ స్మృతులు నౌపొత్తమ్ముముత్తో నెఱుల్ గీలొక్క భావన సేయు భావితుఁడె సద్గేయప్రమేయుండు సూ. ౨౧

శా. సంతానమ్ములలో గణింతు రది యిష్టంబే కృతిశ్రేష్ఠకుల్ స్వాంత మ్మొప్ప సహాయ మాట, సుయశస్సంతానసంధానతాసాంతత్యమ్మన నిమ్మ రెమ్మకొను నాచాయం గృతిశ్రేష్ఠతాక్రాంతత్వమ్మన భూరిలాభమ యవుంగాదా ప్రమోదాప్తియుల్. ౨౨

మ. కృతి నీ కిత్తుము కొమ్ము కొమ్మనుచు నంగీకారసాకారసత్కృతికిం జేతులు సాఁచి వె న్దవిలి సంకీర్తించి కీర్తించి యంచితుఁడై వేఁడినఁ బొమ్ము పొమ్మనుచు నిస్సీయంచు మాయించు నక్కతయే యొక్కటు లుక్కువుండు నరుఁ డీకాలంబ యట్లాయెఁగా. ౨౩

మ. రసికత్వమ్ము సముత్సుకత్వము నుదారత్వమ్ము ధీరత్వముం బస యందం దిరవొందు, నొక్కనియెడల్ భాసిల్లు

శుభ్రాక విహాయసమానం బన్న; నన్ని నేర్పునోడయం
డైనచ్చి తానే కృతిక వెనఁ జిత్రింపుఁడ యంచుఁ గోరినఁ
గవ్వల్ సి టోంది మి న్నందరే? ౨౪

క. ఆయనుపమభాగ్యము మా
కీయుడ రాజేశ్వరీమహితతరకరుణా
మేయప్రసారసరణిం
బాయక నైవచ్చి హెచ్చెఁ బాణితలమునన్. ౨౫

చ. నవనవతాలనద్వికసనంబుల నింబులు వంబ సంబుసం
భవములు మానసమ్ముల నను మాలిమి నైనవి, పూని
యానెఱిక మిప్పులుతకీయ నాయకతమెల్పునఁ గొల్పినపొ
ల్పునల్పమై తవిలితి మేము నామెయిని దత్పరిపాటికి నైన
మాటకున్. ౨౬

వ. కవితావనితారత్నమ్మున కపునపుయత్నమ్మున నయత్న
మ్మునఁ గూరినకారణమ్మునఁ బ్రేరణమ్మున నవునవసర
మ్ములు దరు లోరసికొని రా నెట్టికవియు నిబంధరూప
మ్ముల రూపమ్ముల నోపమమ్ముల నలుపమ్ములు గాని
మేలియలంకారమ్ము లోనగూరుపక యూరునం దూఱునం
బాఱులు వెట్టఁడ. ఇంక వంక లేవంకలం బోరయనిపోర
యిక మాకుం బోరసినసదవకాశమ్ము నసికాశమ్ము వాసి
యాదృశ మ్మున— ౨౭

తే. అమరు గోదావరీమహాప్రవాహసీదరి
శ్రీసమృద్ధిఁ బెంపారు పురీవరమ్ము
పెంపవేర నింపారు, నిలింపకోటి
కందరానిద యన దానియతిశయమ్ము. ౨౮

క. రాజితమూర్తిస్ఫూర్తులు
రాజబిడౌజసు లచోట రాజిల నవ్వా
రోజుం దేజును దమకై
మోజున రాజీవభవుఁడు మొనసి సృజింపన్. ౨౯

మ. వసుధాకంఠగతారహారతరలవ్యాహారతాహారితా
ప్రసితశ్రీమహనీయవేంగివిషయప్రఖ్యాతవేంపాపురీ
ప్రసవాంగీనిరతప్రియంకృతికృతిప్రారంభశుంభద్యశ
స్సుసమగ్రుల్ పెను మెచ్చువంశమున నచ్చుం గొన్న
రాజోత్తముల్. 3౦

వ. రవికులకలశజీవననిధిజైవాతృకులు, ధనంజయగోత్ర పవి
త్రులు నవ్వు నయ్యుత్తము చరితులలో— 3౧

తే. రంగవుఁ గృపారసతరంగసంగతిం బా
సంగునంతరంగమున నెసంగుజోదు
మేదురాదరకలనాసమాదృతార్థి
మంగళప్రసంగుఁ డల శ్రీరంగరాజు. 3౨

మహాస్రగ్ధర—
అను వెచ్చుక్ మెచ్చు నౌచాయన మునుకొని
ధన్యాత్ము రాజన్యమాన్యుక్
ఘన తేజుక్ రంగరాజుం గవిసిన సముపా
ఖ్యాన మన్యాన్వయార్థిం
బెనుమచ్చుం గూర్చి పేర్చెం బెరసిన పెటిమక్
విశ్వవిశ్వప్రశస్తిం
బెనుమచ్చుం బోనిపేరక్ విమలినకలనాఽఽ
వేల్లితప్రౌఢిరూఢిక్. 33

సీ. అభిభవ మెసయని విభుతకు నయివచ్చు
విభవమ్ము విబుధులవిభునివలనఁ,
దనవార యవ్వంగాక తనరుధర్మపథాను
వర్తన మల సమవర్తివలనఁ,
జేతమ్మునం గూర్చు చేతల గంభీర
తానిరూఢిం బ్రచేతసునివలన,
నిధిపతిత్వముతోడి నిర్మలస్నేహావి
స్తారమ్మునను కుబేరువలన,

శుచిత శుచివలన, సుశోభనబుుతము ని
ర్ఋతునివలనఁ, బ్రాణివితతిప్రాణ
నము జగమ్ముప్రాణునలి, సీశత మహేశు
రాణ నేర్చి పేర్చె రంగరాజు. 34

తే. సత్య వంతుఁడు మాఱట సత్యనిష్ఠ
సత్యవతిమానసము పేరి సారసముద
రమున సారంగరాజ మా రంగరాజు
సారమతి నుండి యొక మేలిసమయమందు, 31

క. తనకుం దన నేస్తులకుం
దనరం దలలోని నాల్క తగవు నగవు నా
లోఁ జను తాయి వేంకటేశ్వర
ఘనమతి మే లర్థిసేసి కడకొను పెరిమ౯, 32

మ. అనురక్తి౯ నేర్పుంలు పేర్మిల౯ విరచితం బైనట్టి వైశాఖ
మాసముమాహాత్మ్యము నస్మదీయమును మెచ్చం జూచి
మేల్దోఁచిరో, యమూల్యం బైన పురాణధోరణి నమేయం బైన
యాయింబునం గ్రమముం బంబియొ పిల్వఁబంచి మము
నాఁకంగొన్న మేల్పొకడ౯. 32

వ. అయివచ్చుమిత్రరత్నమ్ములతో నిమ్ములం గూరుచు స్వీయ
జనమ్ములతో నిష్టకథావినోదంబుల నొక కొంత యాసు
వుచ్చి, కవితాప్రసంగంబుల నొక కొంత హారంగుం
బొసంగించి నించి మించిన కెలసమ్మున మా కి ట్లనియె.

క. మీరలు రసవత్కవితా
పారంగతు లింగితజ్ఞభవ్యవిచారో

దారులు దారితకలుషా
కారవ్యాపారులు భవికవ్యవహారుల్. ౩౯

క. కూరిచినారలు కావ్యము
లారూఢిం జెప్పుపెరిమ హాని విరవుకొనన్
వారలు దేశికవర్యుల
భూరిదయారసమునందు మునుక లిడఁగన్. ౪౦

క. శ్రీదేవీమహిమము సు
శ్రీదము నవయామినీపరిమితము మదిన
త్యాదరమున నాదరమున
మేదురమున మొనసి కూర్చు మెలపుం గనుఁడా. ౪౧

క. పొందిక జాతీయము లల
వందిన సామెతలు నందు నందుం జంద
మ్మొందము దఱుఁగని మెఱుఁగులు
క్రందుకొనం జెప్ప నొప్పుఁ గవిత మృదూక్తిన్. ౪౨

వ. సన్నుతులారా ! మన్ననమెయి నా యున్న మనోరథ మ్మవితథమ్ముగఁ గొనసాగించు నంచితగతి నలరారు సాహన స్మిర లౌరహిఁ మీఱుట సర్వథా సర్వదా నాకుం గావలసినయది. మంగళాంబికామంగళచరిత్రప్రకారమ్మ నడుగుట, నొడువుటయు కదా యుభయఫలప్రాపణనిపుణంబు. ౪౩

క. అన మును పూ మునుకొనియు
న్న నెఱికి నయివచ్చి మెచ్చున మహోత్సాహం
బెనయించు నయ్యుదంచిత
మనీషియీషితమునకు సుమహితాధృతికిన్, ౨౨

వ. ఉల్లసిల్లుచు హేమమ్మున కామోదవిశేషముం బోలిన
తద్భాషితమ్ముం గడుంగడుం గొనియాడుచు నేమును నో
మని యనుననువున మొనసి, యమ్మోజనఁ బ్రథితౌజుండు
శ్రీరంగరాజబిడౌజుం డొసంగిన కప్పురపుఁదమ్మల మ్మందు
కొని ముదమ్మున మి న్నందితి; ముత్తమోత్తమచరితుం
డన్నృపోత్తమునాయకత్వమ్మునం బ్రవర్తిలిన మా యాశ్వి
నమాహాత్మ్యము మహాత్ములసమాదరణమ్మునకున్ భాజ
నంబ కానేర్చు టొక్క లెక్కయా? ఇంక నారవికులజరాజ
కులాలంకారు పవిత్రవంశక్రమకథాంశప్రశంస లెట్టి వన—

### కృతిపతివంశవర్ణనము

సీ. మొనయ నాయోగమ్ము భోగిభోగాంకిత
పర్యంకమందుఁ జిద్భావపరమ
రమత్తోడ నానందరమ ముఱు విరవొంద
నారాయణుఁడు సర్వకారణుండు
పవళించి నిహరించు ఫణితి మేలిమి నూపె,
నేగుడు నటు కొన్ని యేండ్లుఁ బూండ్లుఁ

గనుదామరల్ విప్పి కాంచనకంజాత
గర్భుఁ డీక్షణదీక్షఁ గాంతుఁ బెనచి
ననుచు క్రమముఁ బెరిమ నలువొంద నవనవ
స్థితినిఁ బృథివి రసము తేజ మనిల
మంబరంబు డంబు వంబ బ్రహ్మాండభాం
డంబు నొక్కఁడే కడఁక సృజించె. ౪౬

మ. వనధిద్వీపమహామహీధరవనీప్రాంతోర్వరాతారకా
గణవిద్యుద్గ్రహసంపదూర్జితము రక్షస్సంఘయక్షాధినా
ధనరాడిత్యదివాకరేంద్వజపరీతమ్ము ప్రమేయమ్ము లో
కనికాయమ్ము చతుర్దశాత్మకము స్వాంగశ్రేణిఁ
గల్పించెం దాన్. ౪౭

చ. అదిని త్రయీమయుండు ఖరదీధితి బ్రహ్మపదమ్ము లోకచ
క్షువు తద్దక్షిణాంశమున, సోముఁడు శూన్యయుతర్త్తుదిష్ట
పుష్టవిమలిసాషడీశ్వరుఁడు సవ్యమునందునఁ జెంది రొంది
కన్ మివిలినపేరిమిం గనులమేలిమి నోలిమి
నయ్యనంతుకున్. ౪౮

శా. ఆజ్యోతిస్సులు రెండఖండములు మేయంబైన మేల్పాయు
నై రాజ్యమండలి మూలకారణమహార్థస్ఫూర్తి నర్థ్య
శ్రీసుప్రాజ్యప్రాభవభావితాత్ములునృపుల్ రాజిల్లి రేపొంది
సామ్రాజ్యశ్రీపరరంభసంభృతజగన్మాన్యత్వధన్యాత్మతన్.

సీ. మెఱయు మిత్త్రత మేలిమెలపునఁ గెలసమ్ముఁ
గూర్చుమిత్త్రములకుఁ గూర్చువేర్మి,
నయివచ్చు సుమనశ్చయమ్ముల నుతివాక్చ
యమ్ముల కెల్లయగా నలవుకలిమి,
నరులమూఁకల కోపి యరిది దోఁప దరమ్ము
భరముఁ దాపమ్ము నమరుచు సరణిఁ,
బోరి సకలాశానుపూరణ కారణ
గుణమున గొన బేలఁ జనుచనవున,
మహీభృదాక్రమక్రమమ్మున నేరిమి
సిరి నరుణులు రాజు లరయ నల్ల
యరుణరాజకులజు లారాజరాజులు
పుట్టఁబోదు పిల్లి పులికడుపున. ౧౦

ఉ. ఏపులు సూపు నా పసువు లేల నవక్రపరాక్రమక్రమా
టోపము లాపురుశ్రవులు డొంకని బింకము పేర్మి లా
ముకో నాపురుహూతునంతదొర కన్నము వెట్టిరి చకట-
డంచి తా ర్పాపులఁ బూర్వదేవుల దురంబుల స్వర్విభుత
న్నయింప నై. ౧౧

తే. ప్రస్తుతేక్ష్వాకుమాంధాతృరంతిదేవ
శిబికకుత్స్థనాభాగనిమిబహులాశ్వ
రఘుదిలీపనహుషాదిధరావరాగ్ర్యు
లానరుసామ్ములు పై మూఁడు యుగములకును. ౧౨

వ. ప్రకృతమ్మగుం గలి నఘుపుత్రుల నృపకులతిలకుల
నూరురు బిరుదుం గూర్చి వ్రాసి వన్నె లున్నతస్థితికిం గా
నస్ఫుటంబఁ జెటికిన కెకిళ యూయూయి యన్వయంబుల నా
యాయి మర్యాదలఁ బను వేడి గల దొరలొకకొందఱు.
ఆంధ్ర సన్నుతిం గన్నాకులు గోదావరీసరిత్తీరాఖండవేంగీ
మండలక్షితిపాలాసోదారు లాదివివంశాభరణంబుల. వా
రల నెన్నందగు తగవున మిగులు సిరికి సరి యగు మగ
లల వేంపాపురి యునికిపట్టుగఁ బట్టంబు గట్టుకొన్న సన్ను
తౌజులు రాజులు పెన్మెచ్చ యుపనామమ్మున రాజిలు
వారల యన నతిశయంబ కా నోపమి విచక్షణాగ్రామ
ణుల కెల్లరకుం దమతమయుల్లంబుల సాక్షిపక్షంబు లాన
యుంపంగలయవి. అనుపమగుణమణిగణాకరు లారాజ
శేఖరులలో— ౧౩

చ. చెనసినసుప్రశస్తి మెఱసెన్, దొరసెం గవిపుంగవానువ
ర్ణనమున కెల్లలౌ కళల రాజిలునోజుల, రాజరాజు శ్రీ
చినరసింహరాట్; ఉతేఁడు పింహామ, జిహ్మగతుల్
ద్విజిహ్వులౌ మనుజులపేరి క్షుద్రమృగమండలి కెండని
సత్త్వసంపదన్. ౧౪

శా. శీతాక్షయ్యకటాక్షవీక్షణదరస్మేరస్ఫురాంకూరసం
స్ఫీతప్రేమరసప్రసారవలితశ్రీనిర్మలాస్యాంబుసం

జాతాధఃకృతపూర్ణిమాంబుభవ, సుస్వాదుప్రియాలాప, శ్రీ
సీతాయమ్మ నృసింహరాజుసతి శ్రీచెల్వొందు మేల్పొందికన్

తే. హేమ మామోదకలన హేమించినట్టు
లమృతకరునందుఁ గళిడాలు సమసినట్టు
లామహామతి కామహిళామణి యవు
వావి నర్ధాంగలక్ష్మి యై శివిఁ గొనుట. ౫౬

సీ. ఏనిరవద్య నహీనతరశ్రీప్రా
వల్లికల్ వలఁకుల నల్లుకొనియె,
నేకలాలలిత లాలించి యొడి గడించె
సదమలదృక్కులఁ జల్లనిసిరి,
నేనీలకుంతల హేమించుచక్కంద
నము వర్ణనముత్రోవ నమరికఁ గొన,
దేశీలవతి మేలి యీలువు లలనాజ
గమున కలంకారగరిమఁ గూర్చె,

నే మహామహోదయకనన్నామవర్ణ
సమితి వాపు వాతప్పు లుచ్చారణమ్ము
మాత్రఁ బరమపవిత్రచరిత్ర సీత
మాంబ మాఱుటసీతమ యలరుకలన. ౫౭

ఉ. శ్రీనరసింహరాజు చెలి సీతమయందుఁ బ్రపూతయందు విం
దా నెఱి పూనికం బొరసి రాత్మజతామహితానుభూతి సు

ప్రసిద్ధ రంగరాజు, ధృతసేతువు వేంకటరామరాజు, దేవే
నుఁడు వాసితమ్ముఁడును నెట్టులు కశ్యపుజాయయం దటుల్.

ఆ. వేంకటపతిరాజు వెలఁది సుబ్బాయమ్మ
పుత్త్రిపుత్త్రి లా పవిత్త్రిల కల
లక్ష్మినరసమాంబ, లలి సుభద్రయమ, సా
విత్రి, తోడియాడుబిడ్డ లయిరి. ౫౯

తే. ఖర్వముల కుద్దియై యెందు ఖర్వతం బొ
రయని సుతనిధానముల దొరసి నృసింహ
నృపతి కిం పిత్ర్యాణవినిర్మలత్వ
సంపదం బెనుపొందె నిస్తంద్రవృత్తి. ౬౦

ఉ. రాముఁడు కృష్ణుఁ డట్టు లభిరామవిహారవిచారపూరసు
స్థేములు నారసింహపతిశేఖరుసూనులు రంగరామరా
ణ్ణాము లనామయుల్ కనిననంద్యాలవంశము నా సుధాబ్ధి
కిన్ నేమము మీఱఁ గూరుపన నేర్చిరి మోదము రాజు
తేజునన్. ౬౧

తే. కలసి మెలసి కల్యాణయుక్కలనల నలి
నొక్క కుత్తుక, యెఱుఁగఁబో రొక్కయింత
రట్టు రవ్వయు గిజగిజ రొట్టెవద్ద
రంగరా జల్ల వేంకటరామరాజు. ౬౨

ఆ. అన్న-చొప్పుఁ దప్పనన్నిటి నెఱయించు
దారిఁ జనమి తప్పిదారి నే స్వ
వంశమునకు నుగ్గుఁ బాలత్రో నిడిన దక్ష
గోము నోము నడఁత రామరాజు. ౬౩

సీ. అమరిన యంద చందముల పసందునఁ
గంతువసంతజయంతముఖులఁ
గొనఁ డొక్క-లెక్క-కు, ననుపమానతమాభి
రామలక్ష్మిస్తోమరంజితుండు,
వక్రతం బోని పరాక్రమక్రమసంప
దం త్రివిక్రముఁడై నాఁ దవినజోదు,
దినమణియన్వయ మను నన్వయమురస
వీచికిఁ బీయూషవిపులరోచి,
ప్రథిత పెన్మెచ్చు శ్రీరంగరాజసార్వ
భౌముతమ్ముఁడు వేంకటరామరాజు
రామరాజై సాక్షాత్తనరా మహిజను,
లతివ భద్రరూప సుభద్రయమ్మ గాని. ౬౪

క. చినరామకృష్ణరాజా
గ్రణికిం బినతాతకుం దరంబు కరం బై
తనరారెం బంబిన నెఱిఁ
గొని వేంకటరామరాజు కులరత్నము నాఁ. ౬౫

ఉ. మానక యాచమానజనమానసపూరణకారణమ్మునౌ స
మ్మానితవృత్తియుం దనుపమానుఁడు మాన్యుఁడు రంగ
రాజు వెం పూనిన స్వాతివర్షమున నొయ్యన నిండెఁ
గవీంద్రసత్కవీశానులహస్తశుక్తిపుటజాలము లోలిమి
నేలుమేలిమిన్. ౬౬

ఉ. ఆతతభోగభాగ్యముల నందిన గౌరవసంపదన్ సువి
ఖ్యాతులు కొండలంతలు మహామహు లీమహి నుండ,
రంగభూనేతఁ బరార్థ్యసత్క్రమము నెక్కొనఁ జల్పెను
రంగదుదగ్రశుం బ్రీతి దదీయజాతకము వైభవ మొప్ప
సుశోభన స్థితుల్. ౬౭

మందాక్రాంత—

శ్రీసీతాజానిమృదుపదరాజీవసూనంధయ మ్మౌ
శ్రీసీతాయమ్మసుతుని గుణస్ఫీతునిన్ రంగరాజున్
వాసిం జేకొన్నసుదతి సతీవ్రాతరత్నోత్తమ మ్మై
భాసిల్లెన్ సత్యవతి, త్రిదశస్వామి దేవేరిపోలెన్. ౬౮

ఆ. రాజవర్ణనము గరాగరిఁ దూఁగు స
రాసరిఁ బొనరుపఁ దరంబ కాని
యదియ యన్న నవుతదర్ధాంగలక్ష్మి సౌ
భాగ్యలక్ష్మి యొక్కపాటి దొక్కొ? ౬౯

శా. సింగారం బమరంగ నల్లనికురుల్, శ్రీ మించు హేమం
బుత్తో నంగౌఘంబు, దయారసాప్తి నవరా నాస్యాంబు
జంబుల్, సుధాసాంగత్యంబున సత్యరూఢము వచస్సంద
ర్భముం గూర శ్రీరంగత్మాధిపు నన్నుమిన్న ననువారం
గూర్చె నా ధాత తాన్. ౨౦

తే. కులమునన్ గారవమున నకుంఠనియతి
నేదుమర్యాదలన కాక యెందుఁ బోదు
రాజుపోకడ లా మహిళాజనాగ్ర్య
రంగనృపతిపాణిగృహీతి రమ్యరీతి. ౨౧

సీ. విలసిలుపోఁడిమి వెలితిఁ బడక హృద
యేశు నత మనువర్తించుచాయ,
గట్టురాపట్టియై పుట్టక మగనిప్రే
మనిధాన మవు సర్వమంగళాంబ,
తరిత్రాఁటినిడుపరాయొరపిడిం బాడమక
యిలఁ గల్గ్రజడి ముంచుకలిమికలికి,
వినువీది నుడు వయి మినుకులాడక జగ
ద్వినుతిఁ గాంచు నరుంధతీమతల్లి,

యత్తపొత్తన మది రోఁత హత్తి నలువు
రం బడ కపారమూ గారవం బెనయు స
రస్వతీదేవి శ్రీవలితస్వరూప
విభవ శ్రీసత్యవతి పేర్మి విబుధవినుత. ౨౨

తే. [illegible]బోని యే ప్రాఁట నాము కొన్న
[illegible]థలిరామమ్మ వపదమహితపూజ
నావిధానమ్మునం దనూనమ్మునందు
నోము కొనునీమ మాసాధ్వి నోము నిచ్చు. ౨౩

ఆ. సత్య మెన్న కొన్న సత్యవతీసాధ్వి
శీలబల మమలమె మూల మల్ల
రంగరాజవరు నభంగతరార్థర్థి,
కట్టిద కద పురుష నర్థ్యనియతి. ౨౪

సీ. అడరిన నెజ్జి నమ్మహాసాధ్వికడుపు నా
శుక్తిపుటమ్మున మౌక్తికముల
మేలిపంటలు వరహాలమూటలు; యందుఁ
దొలిపూస వరహాలమ లలితాంగి,
రెండవ ముత్తెమ్ము శ్రీసీతరామమ్మ,
యావలిఫలము నారాయణమ్మ;
యాయప్ప సెల్లెంద్ర కాముువ్వురకు నద్దు
ముద్దును మురిపెమ్ము మురువు గూర్చి

పేర్చు తమ్ముఁడు వేంకటసత్యనా
రాయణాఖ్యరాజు, కాయ మండు
సౌకుమార్యకలన, శస్త్రపెన్మెచ్చవం
శాభరణము, పరమశోభనుండు. ౨౫

తే. సరవి శ్రీరంగరాజాంగసంభవుండు
రాజవేంకటసత్యనారాయణుండు
వన్నె కెక్కుత మన్నిటఁ గన్నతండ్రి
యంతలై స్మృతిసూక్తి యన్వర్థ గాఁగ. ౭౬

ఆ. సదమలవ్యవహృతిచతురుండు సత్యవ
తీమనఃప్రియుండు శ్రీమహితుఁడు
ప్రథితుఁడు పెనుమెచ్చ రంగరాజాగ్రణి
యెనసె నాయకత్వ మీ కృతి కిటు. ౭౭

క. పాయక నాయకులం గవి
నాయకనానాప్రకారనవనవగేయో
ద్దేయులఁ గూరిచి చెప్పిన
నే యింపున్ నింపుఁ గృతి యహీనకలాప్తిన్. ౭౮

చ. దొరసినపేరిమిన్ మొగలి
తుఱ్ఱును దోరపు వానభూమిగాఁ
బొరసి పరార్థ్యవైభవము
ప్రోఁతలు నీఁతలు గాఁ దలిర్చు రా
డ్వరుఁ డల రంగరాజువరవంశము
సోముఁ డినుండు తారలుం
దరలక యొప్పుదాఁక ధరఁ
దామరతంపర మై పరంగుతన్. ౭౯

మత్స్యాంతములు

క. ఏతాదృశగుణగణసం
స్థితునకు సకలకలావిశేషరసపరి
స్నాతునకుఁ బూరితార్థి
వ్రాతస్వాంతునకు రంగరాజాగ్రణికిన్. ౧౦

క. మదనాజనమండలసవ
మదనాయితచారుమూర్తిమహితునకు రమా
సదనాయితస్వకోన్నత
సదనమహోదయమహోత్సవరసరసునకున్. ౧౧

క. వేంపాఖ్యాకలితపురీ
శంపాలతికాతనూకుచపరిష్వంగాఽఽ
సంపాదితసమ్మోదా
పాంపతిలహరీవిహారపరమాదృతికిన్. ౧౨

క. కరుణావరుణాలయ దృ
గ్వరణీయప్రసరణానుభవున కినకులా
భరణమునకు సత్యవతీ
తరుణీహృత్పద్మసద్మతతవాసునకున్. ౧౩

వ. అంకితంబుగా మా యొనర్పం బూనిన యాశ్వీనమాహాత్మ్యమునకుం గథాప్రారంభంబుసంవిధానం బెవిధానం బున నన— ౧౪

కథాప్రారంభము

సీ. శ్రీమంతమై సురస్తోమనిషేవితం
బైన నైమిశపుణ్యకాననమునఁ
దవులుకూరిమిమెయిఁ గవియ డెందము జగ
న్మంగళప్రాపణమహితవృత్తిఁ
గడముట్ట బహువార్షికము సత్రయాగమ్ము
జరుపుచు హరిదధిశ్రాంతయశులు
శౌనకాదులు మహామౌనిపురందరు
లతులితకాలమాహాత్మ్య మాము
కొనినకుతుక మోముఁగొనఁగ నాకర్ణించు
నట్టిరు గని రోమహర్షణాత్మ
జాతు ధీసమేతు సూతునిఁ గథకాగ్ర్యుఁ
బలికి రివ్విధమున బత్తి హత్తి. ౨౧

క. సారమతిం జెవులకుఁ జవు
లూరక యూరఁగ నుడివితి వుత్తమతమ యె
వ్వారు నెనాఁ డెఱుఁగని వి
స్తారకథాతతి పురాణసారస్నాతా! ౨౨

ఉ. మేదురమాదరమ్ము సుసమృద్ధిగఁ బాదుకొనన్ వచించి తీ
వాదిమమాసరాజ మది యాదిగ నాఠ్నెలలన్ సరిత్తులన్
శ్రీదయితున్ సుదిష్టతనునిర్మలుఁ గొల్చిన కేవలత్వ భాగ్యో
దయభావితుల్ ఘనులయొప్పుకతల్ విన నేఁడుమాకిటుల్

చ. తనలి భవన్ముఖాబ్జగలితమ్మయి కాలువగట్టు కాలభా
గవతకథాసుధారసముఁ గ్రాలు నిరూఢిని శ్రోత్రపాత్రలం
బవఘులు రేలు నాఁ జనక వారక గ్రోలిన నించుకేని కాం
చవు తనివుం బురాణమునిచంద్రమ! డెందము లస్మదీయ
ముల్. ౮౮

సీ. లండుఁబోఁతులు సముద్దండకామపురోగ
బలవద్విరోధుల గలముత్రాఁడు,
కను మూసి గంతలం గట్టు నెఱుంగమి
పేరి పెంజీఁకటి వేరువిత్తు,
కడవ సత్ప్వను దెప్ప్వ నడరని మాయనా
మారికి మారణమంత్రశక్తి,
తాపత్రితయసంజ్ఞితము దవానలముసం
రంభంబునకుఁ బోని కుంభవృష్టి,
ప్రబలపాపంబు లక్ద్రాఁచు పాఁపదోరల
కల్ల తెల్లయీశ్వరివేరు, సల్లలితపు
రాణవారాశి నచ్చుగఁ ద్రచ్చి కొన్న
వెన్న కాలభాగవతం బటన్న నసదె! ౮౯

సీ. కాంచి జ్ఞానధనంబు కైవల్యలక్ష్మికి
నఱుత సూత్రముఁ గట్టు నవనిసురుఁడు,
రత్నాకరోద్దామరశనాధరాధురం
ధరతఁ దనర్చు బో ధరణిభర్త,

కోటికిఁ బడగెత్తి మాటికిఁ బసిఁడిరా
తలఁ దన్ను మాడవుకొలపుదిట్ట,
మైనింటఁ బొరిఁ గురియంగ వల్లపుజడి
బ్రాహ్మణప్రియుఁ డవుఁ బాదజుండు,
కొడుకుకూఁతుంద్రత్తో నెందుఁ గొఱలు లేక
నిండ వేయేండ్లు ముత్తాటిపండు మెసవు
ముత్తొ, వేయేల? యుఱ చేత మొలిచి పొల్చుచుఁ
గల్పకము విన్నఁ గాలభాగవతగాథ. ౯౦

క. కావునఁ గాలోపపద
మ్మై విలసిలు భాగవతమునందున మే మి
మ్మై విన్న యాఱు స్కంధము
లావలికత తెలియ కెడఁద యాఱడిఁ బడదే? ౯౧

క. సప్తమివిభక్తిగతి కయి
సుప్తమనోవృత్తు లవుచు స్రుక్కుజనులకున్
సప్తమము స్కంధముగదా
క్లిప్తము లొనరింప నౌ నఖిలములు శుభముల్. ౯౨

వ. అట్టు లవుటఁ దివుట మొయి నిఁకఁ దత్సప్తమస్కంధసంబ
ద్ధంబుగ, ౯౩

క. అరమరలు లేని కూరిమి
కర మిర వొందఁగ వచింపఁ గదె యాశ్వినమా

వరగరిమను మాపీనులు
గరగరలై వినఁగఁ దొంటికరణి మహాత్మా! ౯౪

తే. తిపిరి శ్రీచక్రరాజమందిర కరుస మొ
సంగు ముత్తిగ రేలయుత్సవములఁ బొలు
పమరు నిషము మేలి ప్రశస్తి నాలకించు
నట్టి విధి లేని పుట్టువు పుట్టు వవునె? ౯౫

మ. అనినన్ గారవ మేదు నాదరము నత్యంతంబు స్వాంతంబు
నన్ గొనబై నెక్కొన రోమహర్షణుననుం గుంబట్టి పౌరా
ణికాగ్రణి వ్యాసాంతవసిత్వభావితుఁడు విఖ్యాతుండు సూ
తుండు వల్కెన్ నవానందమరందబిందువులు పల్కెంబ
ల్కెనం జిల్కుచున్. ౯౬

ఉ. ఆరనిభక్తిభావమున నట్టె స్మరించు నెడం బుమర్థముల్
గూరుచు పుణ్యతీర్థములఁ గోరిక లీరిక లెత్తఁ గ్రుంకి పైఁ
బేరిన యాజవంజవము పేరిఁటి పంకముఁ ద్రోవఁ దీర్థయా
త్రారతి నున్న నా కొద వె ధన్యము మీశుభసంగమం
బిచోన్. ౯౭

సీ. నలి నాటుకొను నీషణంబుల యను తుంగ
ముస్తల కున్మత్తపోత్రివరము,
పొద వెట్టు జడ్డిగముం దొట్టి విత్తుల
కిడుజడ్డిగము నన మిడుతపోటు,

విషయాధ్వముల్లఁ జేరి పేర్చెనువారు దు
ర్విషయాశ్వసమితికిఁ బేరుకోల,
కందినకందనగాయ నా తామ్రంపుఁ
జిలుముతలియకుఁ గ్రొంజింతగుంజు,

మోక్షమార్గప్రదర్శనమునకు మణిము
కురము, ముంగిటఁ గట్టినసురలయావు,
మహిత మాచారతరువుకు మంచి యెరువు
సాధుజనసంగతి యనంగ సైక మవునె! ౯౮

వ. అందును విరిసినయరుసమ్మున నే నిమ్మెయి నజవిష్టరమ్ము
న నుపవిష్టుండనై యాముకొనుతమిఁ బ్రాయినుకుల
తలల నలరి, యొరుల కెఱుఁగ నలవియ కాని రహస్యార్థం
బులు కరతలామలకంబులు గావించుకొనిన సముంచితమతి
మత్తల్లజులు మీ యెల్లర కిల్లీల, ౯౯

క. పోరి వివరింపం దివురుట
పరమబ్రహ్మార్థసిద్ధి వఱలించుమహా
త్తరపురాణసంహితఁ
బరకపయిం బాతి కొకఁడు పడినటు లాయెన్. ౧౦౦

మ. అరయన్ మీరలు నాచరించితిరి లోకానుగ్రహవ్యాపృతి
స్థిరచిత్తమ్మున నాశ్వినావసరసుస్ఫీతప్రభావమ్ముఁ దె
ల్పర యంచున్ నను వేఁడికో; లడరు నేడం జిత్కలా

మూర్తులార! రహోర్థంబులు మీయెఱుంగని? విటుల్
రాజిల్లె నాభాగ్యముల్. ౧౦౧

తే. తొడరి నాఁడునాఁడును గంట దుమ్ము ద్రొబ్బి
తఱుఁగువడుకప్పురమువాసి వఱలు నాయు
వెసని మిత్తిపీఁపుకుఁ గబు రనుపు పుణ్య
చరితములఁజోలిఁ ద్రవ్వని జనుఁడు జనుఁడె? ౧౦౨

క. మును పారాశర్యమహా
మునిసునిగదిత మయి యుల్లమున కెక్కి తలం
పున నున్నది తోఁచినతె
న్నున భవదాపృష్టగాథ నుడువుదు వినుఁడా. ౧౦౩

శా. శ్రీదేవీమహిమానువర్ణనగుణస్థేమాభిరామోక్తిసా
రోదార పి[illegible]షమాసవైభవము నా నొప్పారి యప్రత్నమ
ర్యాదం బొల్చు పులుంగురాగఱులయుద్యద్ధ్వాన మే
వీనులం బాదు ల్వెట్టక పాసిపోవు నఘసర్పంబుల్ తనూ
నాకువుల్? ౧౦౪

నారదుడు శ్రీమహావిష్ణునిదరి కరుగుట

ఉ. శారదనీరదోల్లసితచారుతనూజితపారదుండు దు
స్తారగభీరతాపపరితప్తమహీతలనారదుండు శ్రీ
నారదమౌనిరాట్టు మెయి నగ్గయి నుర్వులు గ్రక్క

వాయుధికాఁడిరిజవంబునం జని యఖండవికుంఠపురంబు
సేరఁగాఁ. ౧౦౫

సీ. తొలిపలుకుఁదలపేరి చెలువపాపటబొట్టు
సంతరించుపదరజంబువాని,
బారయ కేపారసులు భువనముల్ పదునాల్గు
మోవఁజాలిన మేలి బొజ్జవాని,
నరమరల్ లేని నెనరుపేరి యమృతంపు
సోన లొల్కించు నుజ్జూడికిఁవానిఁ,
ద్రోసి రా జని నిండుతొవవిందుఁ జెలువొందు
నగవు దచ్చనలాడు మొగమువాని,

మేల్మినిగనిగఁ దెగడు నెమ్మేనివాని,
జిలుగురవణాలవాని, దువ్వలువవాని,
మరు మరుల్ కొల్పు నిజరూపగరిమవాని,
నన్నెమెఱుఁగని భక్తులకైనవాని, ౧౦౬

తే. సురగరుడసిద్ధసాధ్యకింపురుషకిన్న
రోరగాదు లొనర్పఁగైవారములను
సింధునందనితో హేమసింహాపీఠి
నిండుకొలువున్న యన్నవనీరజాక్షు, ౧౦౭

తే. కాంచి వే సమీపించి సముచితగతి
నెఱఁగి సాష్టాంగ మిట్లను— నిందిరేశ!

మానవవే యొడ్లయాండులు కని కనుఁగవ
గోడు వడి నిన్ను శరణార్థి వేఁడు నన్ను. ౧౦౮

తే. నిగిడి నింగికి నేలకు నిస్తుల మయి
కదిసి కలిపేరి గోరపుకారుచిచ్చు
క్రమ్మె నలుగెలఁకుల నిలారామసీమ,
మంటఁ గలియుచున్న వవె ధర్మద్రుమములు. ౧౦౯

క. మహి మర్త్యలోకయాత్రా
రతి నెక్కన నడుగు వెట్టి రయమ యచో నో
పతగేంద్రస్యందన! యీ
గతి కయితిఁ గలిగ్రహమ్ముగతి వినఁ గన నై. ౧౧౦

క. అని చెనసినయుద్విగ్నత
నను మనుజవినోదువు లెల్ల నల్లన విని జీ
వనజదళాక్షుం డను నిటు
వనటం బడఁ జెల్లునె యలుపములకు ధీరా! ౧౧౧

ఆ. మొలుచుఁబో విసంపుమొక్క యొక్కడు తప్పి
దారి దారి గిల్లి దూరమునన
పారవైవ లేదొ గోడు? నీ వూరక
కుతిలపడెద వేల కూళఁ బోల? ౧౧౨

వ. అది యటు లుండె, ౧౧౩

శా. ఏయే దేశములందుఁ గ్రుమ్మరితి, వేయేచోటులన్ మెట్టి,
తీ వేయే క్షేత్రములందుఁ గాళ్లు లిడి, తేయేవింతలం గంటి,
వన్యాయం బాయెనె యింతగాఁ గలిఖలవ్యాపార మే
పారి? నా కాయాంచాయ లెఱుంగఁ దెల్పు మిఁక నా
నమ్మౌనిచంద్రుం డనున్. ౧౧౪

నారదుఁడు విష్ణువునకుఁ గలివిజృంభణము విన్నవించుట

క. ఏలా యది యిది యనఁ బోఁ?
గా లీచవడంగఁ బంగుకాలుఁడు కోలం
ద్రోలం ద్రిమ్మరి తెల్లెడ
నో లోకనికాయనాథ! యుర్వీస్థలిలోన్. ౧౧౫

క. పోవం బోవం ద్రోవం
ద్రోవం గోవింద! పోఢమి తుప్ప లయి కడుం
జేవఁ గొనిన కలిచేఁతలు
నా విసపున్ మొక్క లీవు నడ పాడిగింపన్. ౧౧౬

తే. మాటి కొకఁడుగ మూఁగాళ్ళ గాటఁ గలియఁ
డివిరి యొకకాలినడకన తిరుగుచున్న
దిపుడు ధర్మదేవత దేవురించి కూడు
నీరు దొరకక కల్లాడుచు నిఖిలమూల! ౧౧౭

క. పరమదురాచారంబుల
కిరవై పరు వేది కలిమహిమమున వడ్లుం

జెనుగుదు గల్పినయటు లరి
కర! వర్ణాశ్రమగణమ్ము కత్తిరిఁగలసెన్. ౧౧౮

క. వెఱువరు కలనే బొంకఁగ,
నెఱుఁగరు స్నానమ్ము సంధ్య నీశార్చనముల్,
దెఱవరు వాఁకిలి యతిథికిఁ,
దఱుఁగరు పొలదిండ్ల కెంపుఁ దథ్యము జనముల్. ౧౧౯

క. నారీపురుషదినవ్యా
పారము లవి వే. ఆవరికి వారే యమునా
తీరే, చెఱువ్రా దొఱువ్రా
పూరుషునకుఁ, జెట్టొ పుట్టొ పొత్తికి నయ్యెన్. ౧౨౦

చ. స్వపరవిచారముల్ వరుస వావియు నావల కొత్తి
హత్త మత్తు పువ్రజిరావజీరునిలుఁతొత్తతికంబునఁ గట్టి
కంకణం బిపుడు గతత్రపమ్ము జగ మెల్లఁ బ్రవర్తిలు
చున్నయద్ది; లేక పులుగు పెండ్లిధర్మ్మవు పొకాలె సమూ
లముగా జనార్దనా! ౧౨౧

క. ఉడుగక కపటమె కూడుగఁ
గుడువం దొడఁగి యునికిఁ గలుకులు మగలు నెదం
జెడి విశ్వాస మ్మొందొరు
లెడ స్వైరవిహారసరణికే డిగిరి హరీ! ౧౨౨

తే. జనపదము లన్నవిక్రయచణము లయ్యె,
ప్రతుకుచుండిరి ద్విజులు ప్రాఁబలుకు లమ్మి,
తాల్చి దుమ్ము ద్రొబ్బెను వనితాజనమ్ము.
పణ్యయోను లనోటఁ బాపంపుగలిని. ౧౨౩

చ. అను వపురూపసంపద నొయారము మీఱెడు కోడె
గాఁడు నందనుఁడో నిజానుజుండో పెరదంధనయో కన
నయ్యెఁ బో చెమర్చినమదనాలయం బెసఁగఁ జీఁకటి
తప్పులు తప్పి జంకు గొంకును బోనరింతు రొడ్డి తమ
కొంగు లనంగుఁడు వేఁప నంగనల్. ౧౨౪

తే. అంకురింప బ్రహ్మద్వేష మాగడమునఁ
బంగనామము లునిచి పైవారికెల్లఁ
గొల్లగొట్టినముల్లెతోఁ గుడిచి కూరు
చుండి పద్యాలు యజనించుచుండి రిపుడు. ౧౨౫

తే. అఱుతఁ దాలిచి దారము లగ్గివేల్మి
ప్రాఁతమినుకులమినుకుడు వార్పు బూతి
పూఁతలఁ జగదుద్ధృతిచేఁత కట్టు
సాఁచుచున్నారు ధరఁ గ్రిందిజాతివారు. ౧౨౬

సీ. కలదె దయ్యేమ యేల కడుగ అా లని గుళ్లు
గోపురమ్ములఁ గూయు గో పొకండు,

త్రోలి లేని తగ్గు మొక్కలి వేల యని ప్రువ్వ
జాతులఁ దిట్టు దుర్జాతియొకఁడు,
పని లేని పాటగా బాపలు కూర్చి ర
ని పురాణముల నమ్మని ఖలుఁ డొకఁడు,
పుట్టని బిడ్డకుఁ బెట్టె పేరులు జుట్టు
జుట్టును ముడి వెట్టు చెట్ట యొకఁడు,

పండితులుఁ, బూజ్యులును, సభాపతులుఁ, దగవ
రులు నయిరి; పలుకులం జెయువులన వారిఁ
గూడిమాడి జో లొక తెప్పకొయ్యఁ జేసి
కడవ నున్నది కడలి జగమ్ము దేవ! ౧౨౭

సీ. రచ్చలకె నొడువుఁ బురాణరహస్యమ్ము
తెలుఁ గెత్తి తాఁ గడకొలమునాతఁ,
డవ్వానియార్భటి కట్టు ని ట్టయి తేప
తేపకుఁ దల యూఁపు బాపనయ్య,
నెలకొల్పి గరిడీలు కొలమువారల కెల్లఁ
బ్రాఁబలుకులం దెల్పుఁ బాదజుండు,
కిమ్మనఁబో కెప్పుడమ్మెప్పికనుసన్న
ల మెలంగవలయు నిలాసురుండు,

కటకటా! కలిమహిమమ్ము కాటఁ గలియు,
జనపదమ్ములు పాడూరిసంత లయ్యెఁ

గాని పిడుగువాటినడొంక లౌనయేని
నాఁటితోఁ జెల్లుఁగద పీడ నలినయన! ౧౨౮

తే. నే నిఁ కేమని వివరింప నేర్చువాఁడఁ?
బొసఁగ నీఁగకు నిసురు పామునకు బలియు
నిడరు తప్పిదారినయేని యిచ్చి పుచ్చు
కొన్న యీలగ్రద్దలు సూ ముకుంద! ప్రజలు. ౧౨౯

క. కడఁగుదురు గా కొకొకప్పుడు
పుడుకఁగ నది యడరు దంభమూలము లై, తా
రిడి కుడువఁగఁ గంచము నా
ఱడిఁ గొను పని నెల్లరుం గఱకఱులు నృహరీ! ౧౩౦

క. తిలలుం దోటాకాదిగఁ
గల యవి పెరబీదబక్కగమికి; బసిఁడి, వ
ల్వలు, రొక్కము, డొక్కము, తమ
కలసినచుట్టలకు వింటిగా యీయీఁగుల్. ౧౩౧

సీ. పొనరిచి కొండగాఁ బొఁగడు పొగడ్తకు
సింగఁడు బూరఁడై పొంగువారు,
నడుమంతరపుఁగల్మిఁ దొడరి జడ్డిగ మెడ్డఁ
గనుల గంతలు గట్టుకొనినవారు,
మామిడిక్రింది సోమరు లయి విహితధ
ర్మములజోలియె త్రవ్వ మఱచువారు,

విరాజితముకులున మాఱుమము ఱ్ఱోత్తోత్తు
లలకిలు ముడుచుచుఁ గులుకువారు,

వారు వీరు ననుచు సారె సారెకు వ్రేళ్ళు
ముడువనేల నేఁడు పుడమి తాఱు
మాఱి యయ్యె నయ్యె మాదిగమంచమై
పొరసి తఱియురానిసరణి మాకు. ౧౩౨

వ. అని వెండియు, ౧౩౩

క. సిరిగలయతఁడు కులీనుఁడు,
సిరిగలయాతండె బుధుఁడు, సిరిగలవాఁడే
సరసుఁడు వెరవరి; గోజులు
సిరిగలవారలవె యువని సిరిచెలికాఁడా! ౧౩౪

క. కుడువక తా మిడ కొల్లకుఁ
బుడమిం బాతుదురు వల్లము గడించి తమిం,
గడ కది ప్రముచ్చులపాలో
పుడమిదొరలపాలొ యగును బొందక వారిన్. ౧౩౫

చ. కొడుకులఁ గూఁతులన్ మగలఁ గూరుచుతల్లిని దండ్రినిన్
సఖుం దోడరినపెన్పగం బొదివి దుమ్మునఁ గల్పుచు
నున్నవారు తా రొడమెకునై చెనంటులు పయోరుహా
లోచన! రే ల్బవస్సినున్ గడన యొకండె కా వలయు
నిజ్జము వారికి నేల వేలిఁకన్? ౧౩౬

సీ. ఉల్లమ్ము నత్తెర బెల్లమ్ము నాలుకగాఁ
దడిపాతఁ గుత్తుకల్ దఱుగువారు,
నిఱికించి యొరుతల మఱలఱంపమ్మున
నరుసాన నట్టువ మాడువారు,
నిండు రమ్మన్న ని ల్లెల్లఁ గైకొని వెడ
లించి చేతులు దల నిడెడువారు,
బుడగలంబో ల్తనువుల భవవార్నిధి
మునిఁగి తేలుచుఁ గొట్టుకొనెడువారు,

స్వస్వకర్మసూత్రము త్రెస్సి నమసి కొలము
త్రన్నఁ బాతాళమునఁ బడనున్నవారు,
మేఁ గొనిన పాపముల నాఁగ మెలఁగువారుఁ
గనులఁ గననైరి హరి! నేఁడు క్ష్మాతలమున. ౧౩౨

క. అలముకొను కలిమలమహా
నలమున మలమలన మాడు నరశలభములం
దలఁచితలఁపమి నుల్లము
నిలువున నీ రవుచు జాఱు నీరజనాభా! ౧౩౩

తే. కట్టి కుడుపు దుష్కృతులఁ గా ల్పెట్టి చెట్ట
తనమె కడుపుకూడఁగఁ దీర్పఁ జననియెడరు
పేరిచీఁకటినూతఁ బేర్చెడఁద లందు
కలిజనములకుఁ గలుగు మోక్షంబ దెట్లు? ౧౩౪

క. లలి నెనుబదినాలుగుల
క్షల యోనుల నుత్తమ మనఁ జను నరదేహ
మ్మొలసియు నధోగతిం బడు
కలిజనముల వెలికిఁ దిగువఁ గల వెర వున్నే? ౧౪౦

ఉ. చల్లన నీదు నుల్లము, లసత్కరుణారసపూరవృష్టిసం
పల్లసితంబు కన్గవ, సమస్తజగంబుల మాయ నిచ్చలోఁ
జల్ల గలంగకుండఁ గడుఁ జల్లనిపొట్ట, హరీ! నృలోకముం
జల్లగ నేలవే కలికృశానుశిఖాపరిదహ్యమానముల్.

తే. పడి కలిమల మన్ దలబంటి పాడుబొంపి
నంతు పట్టక కొట్టుమిట్టాడు జనని
కరము దరిఁ జేర్చి హరు వవు వెరవు తెరువు
దివ్యకరుణారసావాప్తిఁ దెల్పఁగదవె. ౧౪౨

క. అన మధ్యమలోకముపయిఁ
గొనకొనిన యనుగ్రహమ్ము కుదుర శతానం
దునినందనునకు మంగళ
గుణగణుఁ డమ్మంగళాంబకూర్చుమగండుల్, ౧౪౩

నారదునకు శ్రీహరి కలినివారణోపాయముం దెలుపుట

మ. "త్రిపుటం బాసి కలిగ్రహమ్ము వెత ముక్తిం గాంచు భూ
లోక ముక్తవిధిన్ భాసిలి స్నానదానవిధులం గావించి

"శ్రీచక్రరాజవిహారోత్సుకపాదసేవ" యని తూచా తప్ప
కుండఁ వచించె వరిష్ఠ మ్మిషమామహత్త్వము సుధం
జిలికించుచున్నబలుకులన్. ౧౪౪

చ. గలితవిచారుఁ డా ద్రుహిణుఁగాదిలిబిడ్డఁడు నంత నాత్మ
ముత్కలితముగా జనార్దన! విదారితదారుణవైరివార! ని
ర్మలకరుణాకరా! భువనమంగళ! మంగళనామధేయ
ధ్యేయలలితమూర్తి! కూర్తు నిదె యంజలి నీదగునంజ
దోయికిన్. ౧౪౫

శా. అంచుం గుంచియ వీచుచుం గొని తదీయాజ్ఞావిధిన్
యోగమార్గాంచదధ్యానమునన్ ధరాతలము నొయ్యం
జేరి బోధించె వేయంచుల్ గైదువుజోదుమాఱుమెయి
బ్రహ్మణ్యుండు పృథ్వీవ్యాయప్రాంచద్భూమిపపాళి
కవ్వితము బ్రహ్మానంద మేపొందఁగాన్. ౧౪౬

శా. పూత మ్మాకతలోన మేలికలనం బొల్పారి శ్రీమాతకుం
జేతః ప్రీతి ఘటించి మించు వ్రత మజ్ఞేయప్రభావమ్ము
సుస్ఫీతమ్మున్ నవరాత్రసమ్మితము; తద్వృత్తస్మృతిం జేసి
నిర్ధూతంబై యఘపాళి పాళి జనుఁ డొందున్ దైవ
వంద్యత్వమున్. ౧౪౭

వ. అని వినిచిన. ౧౪౮

మ. నవరాత్రోపపదవ్రతంబు నెవఁ డేనాఁ డెట్లైచోఁ జేయఁ
గా నవు నాఁ డీనవు నీవి యేవితమునన్ హర్షోందు,

నేదేవతం దవ్వులన్ భక్తి భజింప నోప్పఁ, గరుణన్
వాఁత్రుప్పావె యంచు వేఁడువరిష్ఠాత్ములు శౌనకాదులకు
నిట్టుల్ వ్యాసశిష్యుం డనున్. ౧౪౯

## నవరాత్రకృత్యవర్ణనము

సీ. ఎనక మెసంగె నరుసము తాపసులార!
మీ రొనరించిన మేలిప్రశ్న
మున, వినుఁ డమ్మాని యినునకుఁ దెల్పె న
ద్వ్రతము నిట్టులు; వఱువాత మేలు
కని యపామార్గముఖ్యమ్ములఁ బలు దోమి
తిలలు నామలకముల్ గలిపి నూరి
కొనిన చల్లని కల్కమునఁ దల యంటి నీ
రాడి వేడుకమై శుభాహావాచ

నములు దీరుప నవు; ననంతరము నేఁటి
సుత నవాహ్నికదీక్ష దైవతనుతాంఘ్రి
వనజ శ్రీదేవి నర్చింతు నని మునుకొన
వలయు నిషమాస్సితప్రతిపత్తునందు. ౧౫౦

తే. తొడరి బ్రహ్మచర్యాదృతిఁ దొడిఁబడ కెడ
గలిగి కామాదులకు సత్యగరిమ మెఱయ
మెసవ నవు నొకపరి నిసి దోసఁ గెఱుఁగని
సాదము నుదాహృతవ్రతాచరణపరుఁడు. ౧౫౧

తే. ఉత్తమోత్తమగాథల నూసు వుచ్చి
తామరసలోచనలజోలిఁ ద్రవ్వఁబోక
కోరిక శ్రీమాతపేరిఁటికూర నంజు
చుం జలుపనోఁ దదర్చనముం జనుండు. ౧౫౨

మ. అను వౌతావున నూరిలోనయిన గేహంబందునైనన్
వనంబునయందైన మఠోండుచో నియతి విప్రుల్
భూమిపార్యాంఘ్రిసంజనితుల్ నెల్తలు వారు వీరు నన
కంచద్భక్తియుక్తాత్ము లెల్లనరుల్ కామకలాపదార్చన
మనల్పం బాచరింపం దవ్వున్. ౧౫౩

తే. పష్పులోఁ గాలు వైవక వ్రతము నియత
నియమములు కొనసాగించునియతి నుండి
నిండుకొనునాస్థఁ జిన్నికన్నెల వటువుల
నవనిసురుల నర్చింపనౌ నహరహంబు. ౧౫౪

క. హాత్తినబత్తిన్ దినదిన
మాత్రాలంకారనూతనాంబరుఁ డవుచున్
ముత్తోరతనమ్ముల నా
యత్తత ముప్ప్రొద్దులందు నర్చింపఁదగున్. ౧౫౫

క. తొలఁగని నిరూఢి భూత
మ్ముల కొసఁగుచు నన్నబలులు ముప్పేళల ము
త్కలితహృదిందీవర చి
త్కలికఁ గొలుచునతఁడు చిద్వికారతఁ బరఁగున్. ౧౫౬

క. అని దివ్యక్షేత్రమ్ముగ నొడి
  విన విని తెలుపఁగదె యిది సవిస్తరముగ నా
  కని వేఁడు పృథుమహీంద్రున
  కను నిట్టులు నాభికంజజాత్మజుఁ డెలమిన్.        ౧౫౭

సీ. వినుము, తోడ్తోత్రఁ బవిత్రస్థలానీత
        మృత్తికచే వినిర్మించి యొకరుఁ
  దరుగు, గోధూమసమన్వితమ్ములు యవ
        లటఁ జల్లఁగాఁ జెల్లు, హైమ మొండె
  రాజత మ్మొండెఁ దామ్రము నొండె మృన్మయ
        మొండెఁ గాక మఱొండు నొండె నొండు
  కలశమ్ము విధిపూర్వకమ్ము సమంత్రక
        మ్ముగఁ బ్రతిష్ఠింపఁగాఁ దగు నచోట;
  దచ్చియుం బంతి బుజములఁ దావలమ్ము
  ముమ్మొనలవాలు విరితమ్మిపూవు సంకు
  వును జిరాదరాదులు పోలు పెనయ శ్రీమ
  నోహరాకృతి నెలకొల్ప నా హరువున.        ౧౫౮

క. హరి మోవన్ మూఁపుల భీ
  కరములు సింగములు నాల్గు కమనీయంబై
  తనరారుణాంబురుహామి
  త్రిరుచిర మరదం బమర్పఁ దగు నాయమకున్.        ౧౫౯

క. నిండినతమి నవ్వైదిక
మండలమున స్రుక్కు స్రువము మహితతరంబుల్
దండము శక్తియు వెలుఁగుచు
నుండం జేయ నవు వీతిహోత్రుఁ బవిత్రున్. ౧౬౦

తే. నూనెచేనైన గమగమ లీను క్రొత్త
నేతిచేనైన వెలిగించి నిర్మలమ్ము
దీప మూర్ధ్వఘటోపరిస్థితముగా నొ
కయెడ నిడ నవు నటు నిటు కదపకుండ. ౧౬౧

తే. భూరితామ్రరజతమృద్వికార మొండె
దారవము నొండె నవనాళికేరకృతము
నొండెఁ బ్రతిమము తత్కలశోపరితల
మున నునిచి యర్చనము సేయఁ జనును విధిని. ౧౬౨

తే. పార్వతి, జయంతి, మంగళ, భద్రకాళి,
కాళి, శివ, కపాలిని, దుర్గ, క్షమ, మహేశి,
ధాత్రి, స్వాహా, స్వధా, యివె దండములను
మనువునను జపహోమాదు లొనరుపఁ జను. ౧౬౩

వ. ఇదియ కాక శ్రీకరీపర్యవసానంబు లభిరామంబులు తక్కంగల వైదికమంత్రంబుల విధిపూర్వకంబుగ దేవిం గొలువవలయు; నవల, ౧౬౪

శా. కోర్కుల్ దీర మనోజ్ఞనిమహిమముం గూలంకషప్ర
క్రియం జెప్పఁగా నొప్పు పురాణసంహితఁ బఠింపం
బఠింపం దగుఁ; మార్కండేయకథావిధానము ప్రధానం
బందు; లే కెట్టి సంపర్కంబుల్ ప్రతి మేలిశౌచ
మొలయన్ వర్తించి లగ్నుం గొనున్. ౧౬౫

సీ. ఒనరిననియతి నేకోత్తరవృద్ధిగ
నవమిపర్యంత మనువు సిపుర్పఁ
జలుపనౌఁ జండికాజపపాఠనము, లందు
నిర్మలాత్మ్ముం డవనీనిలింపుఁ
డధికృతి గలయట్టిఁ; డతఁ డనన్యాసక్త
మనమునఁ దనపనిఁ గొనఁగఁ జనును;
గాక విద్వజ్ఞులు కడఁగి చేఁజే లిఖిం
చినపొత్త మాధారమునన యునిచి
చదువఁ దొడరుట లెస్స సూ; మొదలిడిన న
వీనమధ్యాయము ముగియ నైనవెనుక
నుడువ నవు స్వస్తి, కూడదు నడుమ; నిడఁగ
వలయుఁ గదిద ధూపదీపముల్ లలిత కెలమి. ౧౬౬

ఆ. కడఁగి తుదము మొదలుగా దేవతాసమ
ర్చనముదనుక నెల్లపనులు దేవి
కప్పనంబు సేయ నొప్పు; నిష్కామక
ర్మమ్ము కేవలత్వదమ్ము సుమ్ము. ౧౬౭

గూడుగ మను వసబుగ్గల
జో డాఁకునిచ్చు నటంద్రు సూరులు కొలువ౯.        ౧౭౧

ఆ. ఊరు మొదలు బంతియేఁడులపరువమ్ము
సౌరు మీఱ సౌకుమారికలను
బువ్వుల మేల్తొడవులఁ బూజించునంచితు
పున్నె మెన్న నేండ్లుఁ బూండ్లుఁ బట్టు.        ౧౭౨

సీ. మహి రహి మీఱుఁ గుమారి, త్రిమూర్తిని,
కల్యాణి, రోహిణి, కాళి, చండి,
శాంభవి, దుర్గాఖ్య, సరవి సుభద్ర నా
నీర్మొదలుగఁ బదియేండ్లపరువ
మలరుబాలామణి; యవల రజస్వలా
కల్ప. కావున సర్వకర్మసమితి
నాపైఁ గైకొనఁబోల దంద్రు విధిజ్ఞులు.
వ్యాధు లాధులును నిప్పచ్చరంబు
దుర్భరంబులు దుఃఖముల్ తొలఁచి త్రోసి
రాజు లనిపింపఁ బెకలింప నాజవంజ
వద్రుబీజముల్ గట్టఁ గైవల్యరమకు
దార మఱుతఁ జేయ నవుఁ గుమారిపూజ.        ౧౭౩

సీ. కానికాలపుమిత్తికంచంబులోపల
ఊ గ్రొట్టి, కడ ముట్టి తాపు లేక

యాటుపోటును లేని యాయువు వేయేండ్లు
నెవరాని వైభవ మనుభవించి
కొంగున ముడిచిన క్రొమ్మానికమ్మై త్రి
వర్గఫల మ్మవాప్తమ్ము గాఁగ
మూర్తిత్రితయదయాస్ఫూర్తిసంసిద్ధికి
నై త్రిమూర్తినిఁ గొల్వ నవును భక్తిఁ;
బండి కోటి కొండలు గాఁగఁ బైరుపచ్చ
పంట పాడి దొఱంగక పాడి యిరవు
వఱల నిత్యకల్యాణమ్ము పచ్చతోర
ణముగఁ గల్గఁ గల్యాణికొల్వమరుపఁబడె. ౧౭౪

తే. హరువుమెయి రోహిణీమనోహరునికండు
వెన్నెలల వన్నియలతోడ వియ్య మంది
కొని కొనకొనిన పేరస మెనయ రోహి
ణీసమర్చావిధానమ్ము నియమితమ్ము. ౧౭౫

సీ. చదువుసంధ్యల నందియ దవిలించినచెయి
యయి జయ మర్థించునతఁడు కాళిఁ;
దగులు దాఁకును లేని మగఁటిమిఁ జిచ్చుఱ
పిడు గయి పగతుఱపీచ మడఁచి
రాజ్యలక్ష్మీపరిరంభసంభావన
కెదురుసూచు జనేశితృండు చండిఁ;

కను గట్టి లోకనికాయంబు పిడికిట
జంబువు గావింప శాంభవిఁ; జెల
రేఁగి దుర్గమదుర్గముల్ లోఁగొనంగఁ
జాలుగండరగండఁడై క్రాల దుర్గఁ;
జేపడ నద్రిభద్రముల్ స్థిరకృపాస
ముద్ర శ్రీసుభద్రఁ దగును బూజసేయ. ౧౭౬

వ. ఇఁకఁ గుమార్యాదిదేవీమతల్లుల సమావాహనవిధాన మ్మవ
ధానమ్మున నవధరింపుము. ౧౭౭

క. జగములు నైజము ననామయ
ముగ నిలువ లయాబ్ధినీరమునన మునిఁగి మా
యాఁగఁ గారణ మగు లోకా
తిగ! మత్పూజనముఁ గొనఁగదే కౌమారీ! ౧౭౮

తే. త్రిపుర, త్రిపురమాలిని, పురత్రితయవినుత
చరణవనజ, త్రివర్గవిజ్ఞానరూపి
ణి, త్రిపురాధార, దయ వార నెమ్మనమున
రాఁగదె త్రిమూర్తినీ! సపర్యం గొనంగ. ౧౭౯

తే. కూర్మి పేరిటి యమృతమ్ముఁ గురిసి కూర్చు
వారిభవతాప మడఁచు చిత్పూరితాంత
రంగ, కల్యాణధాత్రి, కల్యాణి, జనని!
త్వత్పదాబ్జసేవారతి వఱల నిమ్ము. ౧౮౦

క. స్మరియింతు నకారాద్య
క్షరమయ యై సతము జీవగణమువదనగ
హ్వారమునఁ బాతరలాడెడు
చరాచరజగన్నివాసచణ రోహిణినిన్. ౧౮౧

తే. కాళి, కాలచక్రాత్మిక, కామరూప,
కామదాయిని, సతసురగణకిరీట
రత్ననీరాజితాంఘ్రి దూర మ్మొనర్చుఁ
గాత కాలాహిముఖబిలకబలభీతి. ౧౮౨

క. చండున్ ముండున్ బటుదో
ర్దండనటద్భిండివాలతాడనముల మేన్
పిండిలివండు లొనర్చిన
చండిన్ నిండారుభక్తి సత మర్చింతున్. ౧౮౩

శా. ఓజస్తేజములన్ ద్యుతింగొని యనుస్యూతత్వవిఖ్యాతిమైఁ
దా జాగ్రత్తున నిద్దరం గలల నొందం బోల్కి భల్లాతకీ
బీజన్యాయ ముపాధితోడితవు లెవ్వేళం లవంబేని లే
కోజన్ రాజిలు శాంభవిన్ భువనరక్షోద్యుక్తఁ గీర్తించెదన్.

తే. అడుగు లన్నియు నేనుఁగునడుగునందు
నడఁగువడువున నడరుఁబో యఖిలశక్తు
లేమహాశక్తియందు దా జితామరారి
వర్గ దుర్గ నెంచెద నపవర్గవాంఛ. ౧౮౫

మ. పదిగూర్వ్రశ్మికసింపినిండు మొఱుఁగుల్ పాదంబులందాఁకి
మించఁ దనూవల్లి పొలమ్ము లెల్ల సుకలాంచత్స్ఫూర్తి
వర్తిలఁ జేయుదయాసారసుపూరితాంతర మహాయోగీశ్వ
రోన్నిద్రభద్రద భద్రాసనసంస్థ కైకొను సుభద్రాదేవి
సుపూజలన్. ౧౮౬

క. అను పావనతనువు లనో
మనువులఁ గన్యల వటువుల మహితతరావా
హనముఖములు షోడశవిధు
లనువుగఁ బూజించి మించునతఁ డజితుం డౌ. ౧౮౭

వ. అది యటు లుండె, ౧౮౮

ఉ. ఒక్కఁడు చుక్కలం, గుతల మొక్కఁడు, నిక్కుచు
రోయఁ బోయి చైతక్కలనాడు కన్నుగవదానిని, ముక్కుఁ
డీఁ, జెంకు, మూఁగెతన్, దక్కువ లెక్కువల్ కరపదం
బులదానిని, బక్కచిక్కి చాఁ దక్కినదాని, గుజ్జయిన
దానిసిఁ, బోల దౌనర్ప నర్చితన్. ౧౮౯

క. తమతమకోరికకోరుకు
లమర సఫలము లయి తీతిసురాంగనఁ, బూజా
ర్థము వృషలిన్, దారుణక
ర్మములన్ మాతంగకన్య రహిఁ గొల్వ నవున్. ౧౯౦

వేదపారాయణ ప్రభావము

క. పారయక ప్రత్యూహ మ్మొది
తిరముగ నియమమ్ము తొమ్మిది నిశల వ్రతముఁ
జరుపుద్విజుం డహరహముఁ
వరుసఁ బొనరుప నవు వేదపారాయణముఁ. ౧౯౧

తే. తొడరి చేఁజేతఁ జేసినదోసఁగు లెల్ల
సోదెలోనికినే రాక సురియు, మఱ
యై యెనయుమికి, వేదపారాయణమ్ము
పెట్టినదిపేరు, మఱి నొడుల్ వేయు నేల? ౧౯౨

వ. ఇందుఁ బురాణకథానక మొకఁ డెసక మెసఁగు; నద్దాని
తెఱం గెఱింగింతు; నవహితమతి నాకర్ణింపుము. ౧౯౩

రాఘవోపాఖ్యానము

సీ. చక్కనిపొక్కిలిజాళువావిరితమ్మి
పూపాపమేల్కొలమునకుఁ దిలక
మవు మేటి పేర నారాయణుఁ డన్వార
ధర్మువు తెరువున మార్మ్రోగ మ్మ
డమిఁ, దగుల్ దాఁకు నడరనిమగంటిమి,
నెనరుకల్మిని జిటికెనకు నెక్కి
యేలె నాలుగు కడ ల్నెల్లలుగాఁ బండ
బంగారపుంబంట పంటవలఁతి;

వలఁతి యవ్వానియేల్బడి కలికమునకు
నేని మ్రుచ్చులు ప్రుచ్చులు నీల్గువారు
లేమిఁ, బట్టి లేసట్టిరు, లేక రామ
రాజ్యముం జులుకనసేయురాణ మెఱసె. ౧౯౪

తే. చండవిక్రమస్ఫురణ నాఖండలుం డ
తంపు నిజభుజాదండమ్మునండ నిండ
ననము పూను నా రామరాజ్యమ్మునందు
భరతుపట్టముమాట కన్పడని దయ్యె. ౧౯౫

తే. విత్తువీసమ్ములో సాము, పెరిగి మ్రాను
గట్టు చెట్టొకవటమంత, కాయ లేన్గు
తలలు ననునట్లు; వేలుఁ గోటులును బండి
క్షమ సుభిక్షమ యయ్యె నాకాలమందు. ౧౯౬

తే. తులసివనమున గంజాయిపిలక వ్రాలె
నాముకొన్ననైచ్య మవాచ్య మై శిరమ్ము
కంటకితమ్ముగా రాఘవాఖ్యానుఁ డోదవెఁ
జెడఁగఁ నా మేలిమేలికకడుపు కొడుకు. ౧౯౭

తే. విక్రమక్రమసరణి గంభీరతాప్తిఁ
జెఱకు సెదరనికేవిఁ గాంచినయనుంగు
తండ్రితో వానిఁ గలిపి యతండు నడఁతఁ
బుణికి పుచ్చుకొనియె వేనగుణగణమ్ము. ౧౯౮

సీ. పుడుకు తోడవుగఁ జొప్పడువలంతికి నెవ్వ,
పేరిలగ్గద్దకుఁ బెద్దకలిమి,
కలుగనే కలుగరు కలవారలకుఁ, గుచే
లునియన్నలకు నోసి యనిన సుతులు,
సిలవోలె నిల నిల్చుఁ గలకాలము గరాసు,
నీల్గు సామునన పున్నెములమూట,
యొనరుఁబో రసికున కినుపగజ్జెలతల్లి,
చవట కూర్వశి గెల్వఁ జాలునాలు,

కుంపటిం దమ్మి మొలచినజంపు గులుకఁ
గించుకడుపున గొనముల మించుమేటి,
కులమునకు గొప్పగుద్దలి గోపుకొడుకు
వాడము సుమతికి; విధిచేఁత నొడువఁ దరమె? ౧౯౯

క. ఆరాఘవుని వెనుక సుకు
మారాకారుల ముగురఁ గుమారుల సాతా
చారవిచారవిశారదుఁ
డా రాజేంద్రుండు వడసె నరుస మ్మోసఁగఁగ. ౨౦౦

తే. పురిటిలోనన యెన్నెమ మొత్తినట్లు
చెరుకు మీటిన వస వల్చు చిఱుతతనము
నాఁడె యమ్మూర్మపురం బెద్దవాఁడు మిత్తి
పేరినిడుపని పేర్వాత భేక మయ్యె. ౨౦౧

ఉ. [illegible] ప్రేమమున నేటన పెంచఁగలానిఁ బూఁటలోఁ
[illegible] కనుపు వర్థిలఁ గాంచిన తల్లి దండ్రి
[illegible] బొమ్మఁ దన్న నవు చిన్ని నిసుంగుల
నిచ్వరన్ సుగ మ్మెన్నుచుఁ బెంచి మించి రల యేనిక
కొమ్మన దాదిజొమ్మనన్. ౨౦౨

ఉ. తోరపుఁబిల్లకూఁకటులు దువ్వి సమంచితనూత్నరత్న
కోటీరము దాల్చునోఁదలన కీవిఁ దలిర్పఁగ నెమ్మి
యీఁక లక్ష్మారె యనం జిరా దొడిగి చాపమునన్
గుఱి సేయఁబూను నవ్వారలఁగంటఁ జూచువిధిఁ బాసియ
దోఁకిరి కన్నవారలున్. ౨౦౩

వ. అనంతరంబ, ౨౦౪

సీ. కడకొను రాచటికముకీవి మెఱయించు
నూనూఁగుమీసలనునుపు గాంచి,
తమ్మిపూఁ జేకులతమ్మునై భువనమ్ము
లేలఁ జాలినకనులింపు నెంచి,
కూరుచు రాలచ్చికూరిమికౌఁగిటి
ససిఁ గోరు వెడదవచ్చముఁ దలంచి,
వేలుపుదొరకునే వెఱ పొడమించు బీ
రమ్ము లావును నంతరమున నుంచి,
కనులు గుట్టి, గుండెలు గూడు గట్టి, రాజ్య
కాంక్ష పట్టి, యుకిపుఁడు రాఘవుఁ డనుంగు

తమ్ముగ్రుక్కుల్లాల వల దను తనసచివుల
తోడఁ జెబుఁ బెట్టె నీరును గూడు నిడక. ౨౦౫

క. ఎండఁగ నెప్పేచులు నీ
ర్పండిన లేవంగలట్లు బెండాబెడగై
గం డడఁగువారల నుసుఱు
నిండి యొకం డట్టె పెద్దనిప్పుర వోయెన్. ౨౦౬

క. రెం డవ్వుత్తోఁబుట్టుం బాల
దిండీఁడై రాఘవ్వుఁడు తిన నిడి విషపుం
బిండంబు ప్రెగ్గడలతో
దండధరునివీడుఁ జూడఁ ద్వర నంపించెన్. ౨౦౭

శా. అంతం గుండియఁ జిక్కఁబట్టి యిది మే లౌఁ గాదు నీ
కింత నాఁ జింతాకంతగ సాహసింప నవ్వవాసిం బొంద
నీ కేరి నగ్రశాంతం బెంతయు జాగరూకతఁ బ్రజాప్రాతంబు
నయ్యుర్వరాకాంతుం డొప్పఁ గసిండికోఁత నదుమంగాఁ
గాలఁ జొచ్చెన్ మదిన్. ౨౦౮

క. ఆ తెరువునఁ బెనుపారిన
చేఁతటికములం దొలంగి చేతోవీథిం
బ్రీతియు భీతియు నీఁతలు
మోఁతలు నై రాజు విడువఁ బూని కడంకన్. ౨౦౯

సీ. పాలఁబోలిన తమ్మిచూలివంశపు మేలి
పూఁదోఁట నీ విషముష్టి చెఱచెఁ,
గొదకొని యాదవకులమునకుం గొప్ప
ముసల మిా పొలదిండిపొలుపులాఁడు,
తోఁడఁబుట్టినవారి దోరించె రాలచ్చి
కొనుచిచ్చు నీ చెడుగొఱుకుడొకటి,
కన్నవారలకన్న గారామునం జూచు
మంత్రుల నీ మెప్పు మంటఁ గలిపెఁ,
దొడరి త్రోఁపనంగొఱవిమై తోడిఁబడంగఁ
బెట్టె రోజులు నిండి యీ వెఱ్ఱిమొఱ్ఱి
పనుల నడు గీ జడుం డని పౌరు లెల్లఁ
బ్రువ్వఁ దిట్టఁ దొడంగిరి మూఁక గట్టి. ౨౧౦

వ. అంతియుకాక, ౨౧౧

చ. ప్రిదులఁగఁబోని పూనిక మెయిఁ బిండిలివండులు
సేయువారమై చిదుముద మేపడంత మఱచేఁ గొని
గద్దియ నంచు రేఁగు పౌరదలము తోడుగా నెదిరి రాఘవుఁ
బ్రెగ్గడ లగ్గలించి తా రద నిడ యంచు ద్రొబ్బిరి
రయమ్మ మహోగ్రవనమ్మపాలు గాఁ. ౨౧౨

ఉ. అంత నిరాయుధుండు నసహాయుఁడు నై తల దాఁచుకొం
చు దుర్గాంతవనాంతరస్థలులఁ బ్రాజ్యము రాజ్యముఁ
గ్రమ్మఱం గొనఁ స్వాంతమునందు నాస రవయుంతయు

లేక నృపుండు నెంతయును వంత నడంగఁ జొచ్చెఁ గృత
పాపము వాయునె కట్టి కుడ్వకే. ౨౧౩

ఉ. ఆకలిచిచ్చు పెచ్చునకు నాకు నల మ్మొకరుండు, పండుకోల్
పోఁకినయంతమాత్ర మెయి నుగ్గును నూచ మొనర్చు
బండ, లా యాకడలందుఁ బాలుమలినాంబువు దూఁపకుఁ
గాకమించురాకాఁకకుఁ జేతు లడ్డముగఁ గానలఁ
గ్రుమ్మరె నాతఁ డొంటిమై. ౨౧౪

చ. నిలిచినచో నిమేషమును నిల్వక, పండినచోటఁ బండకే,
వెలవెల నైన మోముపయి విన్నఁదన మ్మది యండ
నట్టువ, మ్మలసి కలంత వాటె హృదయమ్మును నిల్కడ
దప్పి తప్పుచొప్పుల కెలయించి యీడ్వ నృపపుత్త్రుఁడు
వెంబరవిత్తు నాఁ దగెన్. ౨౧౫

సీ. కటకటీ వై రేఁగి కడుపుచిచ్చిడియెదే
కాచుకొ మ్మని తండ్రి తాఁచినట్లు,
ముప్పూఁటిప్పులు వెట్టి మూడూళ్ళనీ ళ్ళింకఁ
ద్రావింతు నని మంత్రి దవిలినట్లు,
కూడు నీ రిడకుండ కొనెదె నాయును అని
పెద్దతమ్ముఁడు గొంతు పిసికినట్లు,
మొసవెదు పీనుంగుమీఁదిపిండము లలం
తీ! యని తుదివాఁడు దెగడినట్లు,

తలఁచు మది, నెదో తిలకించుఁ, గళవళపడుఁ,
గనులు మూయఁగ విప్పఁ గంగారువడును,
ద్రిమ్మరీఁ డయి కెలఁకులఁ దిరుగు నతఁడు;
ఘాతుకులగుట్టు లిట్టివకద ధరిత్రి. ౨౧౬

చ. అటులు పరిభ్రమించుచు మహాటవులందు వనాటుఁడట్టు
లా కుటిలుఁడు బ్రహ్మవంశమునకుం బెదగుద్దలి, ముని
పట్టు ప్రస్ఫుటసుతపోధనాఢ్యమునిపుంగవకోటికి, దూరి
తాఘసంకట మవు గోమతీతటముఁ గ్రన్ననఁ జేరి
యదృచ్ఛ వారఁగాన్. ౨౧౭

క. తటరుహబహువిధవిటపి
ఛ్ఛటపచటులవాతధూతవివిధశ్రముఁడై
దిటవుపఱచి మన మొకయటు
లట శాద్వలతీరభూమి నాసీనుండై. ౨౧౮

వ. ఉండె, నంతఁ గొంతవడికి, ౨౧౯

శా. ఏనాఁడో పొనరించికొన్న సుకృతం బేకొద్దియో
గొప్పయో కానన్ రాక నిగూఢమై యడఁగి లోఁ
గాఁపుండి యై కాలమున్ రా నీ మేలిఫలమ్ముఁ బూనె
నన ఘోరమహా తపోవహ్నిలో నేనఃకాష్ఠము లెల్లఁ
గాల్చుమతి దీపించెన్ ధరాజానికిన్. ౨౨౦

వ. అవ్వడువునఁ బొడమిన యీ సంకల్పంబు జలబుద్బుద కల్పంబు గానీక యట్టిద కర్జంబునకుఁ సమకట్టి గట్టిపట్టున.

క. కాయో పండో మఱి యే
మో యెఱుఁగముగాని వానియూహా, పౌనర్భిం
గాయో పండో యొకఁ డా
కో యలమో మెసవి యాతఁ డుగ్రతపమ్మున్. ౨౨౨

తే. పౌరిఁ దపఃపరితప్త మాంతరికకలుష
మెల్ల వెలియయ్యె నిటు లన నల్లజడలు
గట్టి పాడవులై మీసలు గడ్డములు శి
రోజములుఁ బెచ్చుపెరిగె నారాజమణికి. ౨౨౩

ఉ. ఆపయి నొక్కనాఁడు హృదయాంబుజపీఠి వసించి మించు పూజోపహృతుల్ తగం గొను సముద్యదినప్రభ మిష్టదైవ మీ రూపు ధరించెఁ బాపములు రూపఱి పో నన సోమ శర్మయున్ తాపసివర్యుఁ డొక్కరుఁ డుదారత నయ్యెడ కేగుదేరుడున్. ౨౨౪

చ. కనుఁగొని రాఘవుం డెదురుగాఁ జనిఁ తోడ్కొనివచ్చి, పాదవందన మొనరించి, కప్పి నయనమ్ముల, సన్నుతి యించి యంచితప్రణుతుల, సమ్మదమ్మునన వాఁ డడుగం దనవృత్త మెల్ల నిట్లని వినిపించె నొచు రచితాంజలి పూసలు గ్రుచ్చుచున్నన్. ౨౨౫

క. దేవా! దైవవిలాసము
నేవా రెఱుఁగంగలార? లేర్పడఁ బేదన్
భూవిభు, భూవిభుఁ బేదం
గావించెడు నెత్తికోలు గల దది కాదే? ౨౨౬

ఉ. పుట్టువు గంటి బ్రహ్మకులభూషణమై, కలశాబ్ధిపట్టిఁ జేప
ట్టినజెట్టికిన్ సవతు వచ్చు నభిఖ్య నసమ్మగాంచు సామ్రా
ట్టుకుఁ బట్టినై; ప్రథితరాజ్యభరంబు తిరంబు మోవఁగాఁ
బట్టము గట్టుకొంటిఁ; బగవారలనోళుల దుమ్ము గొట్టితిన్.

శా. అంతం బోవక రాజ్యలోభ మనపాయం బాచు రాపాడఁ
గాసంతేఁ గొంకును డొంకు లేక కుటిలవ్యాపార మేపారి
దుర్దాంతుల్ బాహుపరాక్రమక్రమసముద్దండుల్ ఘనుల్
నిర్మలస్వాంతుల్ తమ్ముల నంపితిన్ జమునిదా నాతి
థ్యముం గుడ్వఁగాన్. ౨౨౮

వ. ఆపనికిం జూపోపునోపికం బోరయక. ౨౨౯

తే. లేనికన్నకు మం దిడఁ బూనునంత
నున్నక న్నూడె నన్నటు లుగ్రవనుల
కడఁచి వెడలించి రయ్యొ! రాజ్యంబు సర్వ
మంగళము సేసి నన్ను నమాత్యమణులు. ౨౩౦

మ. కడతేరం దపియించువాఁడఁ దడవంగాఁ గూడ దాగోడు;
కాఱడవిం గూడును నీరు నోచుకొన కాయాసంబు రెట్టింప

నేఁ గుడువం బొల్పడినట్టి యిక్కము లెఱుంగుం దైవమే
యెంచుకోఁ బడుఁబో కంద సగాయ గాయ మయి యాపా
తంబ ప్రాపింప నా. ౨3౧

వ. అది యటు లుండె, ౨3౨

ఉ. అచ్చుగ నెన్నియెన్నొ తగుయత్నములం బొనరింపనైన
రాలచ్చికవుంగిటన్ సుఖములబ్ధి యటుల్ కలలోనివాగ్ర
హ్యై పొచ్చెముఁ గోరఁ గాఱఁసివిఁ బోటుతనం బఱి నే
బికారినై చచ్చినచావుగా వెతలసందడి డిందఁగ నేల
యయ్యెనో? ౨33

మ. ఎఱుఁగన్ నేరక యున్నవాఁడ మును పేయేమపక్రుతుల్
చేతులన్ మొఱటుం గాదనిపించి చేసితి, నెయేపున్నెంపు
గర్జంబులం దఱుఁగుంగూర్చితినో, విమానితుల నేధన్యా
త్మలం జేసితో, యుఱ కింకన్ మునివర్య! నీ వరసి మో
క్షోపాయముం దెల్పవే. ౨3౪

మ. అన నెకోల్లొనుకూర్మిపేర్మి మది రంగారం ద్రికాలజ్ఞుఁ
డమ్మునివంశాభరణమ్ము వల్కె నిటు; లొప్పన్ ధర్మ
సూక్ష్మమ్మెఱుంగ నశక్యమ్మయి, కూర్చు నాచరితమై
కాలమ్మునం దింతయే యనువై కొండను మించనా
ఫలము పుణ్యం, బట్ల పాపం బగున్. ౨3౫

సీ. సరవి నూఱులు వేలుసంఖ్యల చండికా
మనురాడ్జపములు, కుమారికావ

టుసమర్చనమ్ము లుడుగని సువాసినీ
నికరసంసేవననియమములును,
భాగతకథా ప్రవచనవిధానముల్,
ప్రాంబలుఁగములపారాయణములు,
ననుదిన మేకోత్తరాభివృద్ధిగ మూఁడు
సంజలఁ గుంకుమార్చనము విధులు,

నామసంకీర్తనమ్ములు, కామలతిక
కూరుచునసమ్ములవినుకలి, కొమరు మివుల
నెఱపి రంబికోత్సవములు నీదువీట
ద్విజకులాగ్రణు లొకపూఁట దేవలమున. ౨౩౬

క. ఉడుగని రాజ్యమదమ్మునఁ
బొడమిన యెడలెఱుఁగమి నటు వోయి వ్రతమ్మం
జెడ నడఁచితి వత్తఱి నీ,
వుడిగి మడుగవలసె దాన నొకరుఁడ వడవిన్. ౨౩౭

క. అడుకులు తిన్నట్లగు నే
కడుపునఁ గుట్టిత్తి యుఱక కలఁచెడునపు? డ
య్యెడ నాఁ డొనరించినయొడు
దుడుకులు కుడుపక యె కట్టి తొడిఁబడునొక్కో? ౨౩౮

వ. కావున, ౨౩౯

క. అడపొడ గనరా కెట దొసఁ
గడఁగి పులు గడిగినము త్తియమ్మటు లలరన్

వడి శ్రుతిపారాయణముం
గడునిష్ఠ నొనర్పుమయ్య క్ష్మాతలనాథా! ౨౮౦

ఉ. చల్లనినీడ కాసవడి సాఁకినబాలరసాలసాల మ
ల్లల్లన విస్తరించి గుబురై మధురమ్ములు పండ్లుకోటులుం
గొల్లలుగా నొసంగు తెఱఁగుం దలపించి కృతోక్తకృత్య
మో సల్లలితా! త్వదీయము విశాలము రాజ్యముఁ
గూర్చుఁ దోడుతన్. ౨౮౧

ఉ. ఆదటఁ జేసికొన్న విపులాఘుజగమ్మునకున్ బుధప్రకాశో
దయమై యభీష్టముల నొయ్యనఁ గూరుచుకల్పవల్లి య
వ్వేదము వల్లెవెట్టుపని పేరొ-ననయ్యె గయాదితీర్థసం
పాదిత మా మహాఫలము వాసిని మించున దంచు నంచితా!

క. హరినిన్ హరునిన్ విరితా
మరచూలిం గనులకఱవు మటుమాయమ్మై
పరఁగం బరికించుటె గర
గర లా వేదాక్షరములకనుకలి యధిపా! ౨౮౩

తే. బ్రహ్మహత్యాదిపాపాతిపాపము లను
కాకిమూఁకల కల్ల తుపాకిదెబ్బ
వేదపారాయణమ్ము నాశ్వినమునం బొ
నర్చుప్రోడ శ్రీమాతకుఁ గూర్చువాఁడ. ౨౮౪

కాని ద్వైతపుంబోకడ లెన్నఁ; డన్యమతముల్ తలకెక్కఁగ
నీఁడు; రేఁగి చార్వాకమతమ్ముమాట వినవచ్చిన భగ్గున
మండు నిల్వనక. ౨౧౨

తే. తనకుఁ దనయాలికిం గడగానినివరవు
డమున ముంచి తేల్చుచు కాని రవళి నొకఁ
డకరమ్ము సెప్పినపాప మంద లేద
వాఁడు శిష్యులకుం దొలిపలుకులందు. ౨౧౩

ఉ. నాలుకఁ బీఁకికొందు ననినం బెరవారలఁ జూడనీయ కిల్లా
లిసగమ్ముకోకఁ బదిలమ్ముగఁ జుట్టియ మందసమ్ములోఁ
దాల మమర్చి యాఘనుఁడు దాఁచిన శాస్త్రరహస్యార్థ
దీపముల్ తాలదలాకృతుల్ కృతు లిలం గలిపెం దిని
వ్రమికీటముల్. ౨౧౪

క. అంతం గొన్నేఁడులకు న
నంతానిర్జరుఁ డతండు నంతకునానక
గంతుం గొని చేసినదు
ర్దాంతమఘముకతన బమ్మరకసి యయ్యెక. ౨౧౫

సీ. హత్తుప్రేముడి నొక్క కుత్తుకమై మను
నాలుమగలలో కయ్యాలు వెనిచి,
కానక కానక కన్నదిసుంగులఁ
బురిటిలోనన యమపురికి ననిపి,

వైచినతాళముల్ వైచినట్టుల యుండ
సాగి లోలో నిలు చక్కఁబఱిచి,
కుడిచి కురుల్ దువ్వి కూరుచుండినక్రొత్త
కోడలి నటు నేలఁ గూలఁద్రొబ్బి,
కాఁపుర మ్మున్నవారల కంటఁ బిడుక
గొట్టి నడికప్పులన్ నిప్పు బెట్టి నట్లు
బసుమ మొనరించెఁ, గారించెఁ బల్లెపల్లె
జనులఁ దుండిలబ్రహ్మరక్షస్సు రేఁగి. ౨౯౬

క. ఒకకాలును నొకడొక్కయు
నొకకన్నును దోఁక లీరు నొనరినకుక్కల్
కృకవాకువు లోతులుగ ధ
నికులింప్లఁ దిరిగె నది వెఱనెఱయింపఁగనై. ౨౯౭

శా. చాలన్ జాలము పీట వెట్టి కుదురై చద్రారుక్కలం
దాఁక నొసాలాగ్రమ్ముల, వచ్చుపోవుమనుజుల్ సంత్రస్తు
లై పాఱఁగాన్ ఊలన్ అప్పలు కుప్పగూరలు వడన్
దా ఉప్పుచున్ నవ్వుచున్ సీలామాలపు జేఁతలన్ మిపులఁ
బేర్చెన్ బ్రహ్మరక్ష స్సాగిన్. ౨౯౮

తే. పల్లెపక్కణములఁ గల యెల్లమలముఁ
గాల్మడియు నొక్కగుటకన కడఁగి కలిపి

క్రోలి గబ్బునఁ ద్రేఁచి పూఃపాలకాళి
కంచమున ఱాయి యయ్యె రక్కసి రసేశ! ౨౫౯

తే. ఎట్టి గట్టిమంతరములపుట్టపొట్ట
చేఁతలం గట్టువడఁబోక చెలఁగఁ జలము
నాడునది యాట పాట తాఁ బాడునదియు
గాఁ బరిభ్రమించుచు వచ్చికడల నటులు. ౨౬౦

వ. జక్కులరాచక్కిం బెక్కుయోజనమ్ముల దూరమ్మునం దనర్చు గహనగహనమ్మగు అకుపిసాసిరక్కసి క్రక్కునఁ జేరి, యందు, ౨౬౧

సీ. చేఁజేత మును వొనర్చిన చేఁతలకముల
కడరుఫలమ్ములు కుడిచి మగుడ
జముప్రోలినుండి పిసాసులై మివిలిన
యంటుతో భూస్థలి కరుగుదెంచు
పాపులకొఱకమర్పఁబడిన రహదారు
లనఁ జని దశదిశావ్యాప్తము లయి
దూరిపోఁ దెరు వీక దోమకేఁ గొమ్మలు
దిటవులై కాఱుచీఁకటులు గ్రమ్మ
నిట్టనిలువునఁ బాతినయట్టి గట్టి
దూలము లవునాడలపూనిగఁ దొఱట లునికి
పట్టుగా భయంకరమ్ముగ ప్రకరమునకు
రాణ మెఱయు నొక్కఁడు మఱ్ఱిమ్రాను పైని. ౨౬౨

సీ. తెరువున నొకరుండ యరుగు పాంథుల వెంటఁ
జని తోడునీడగాఁ జమరుటయును,
మోయుచుఁ బల్లకీల్ వోయి బోయీలట్లు
తఱియువ్వారలఁ గాటఁ దార్చుటయును,
రాజునుబలగమార్భాటమ్ముమయి నెత్తి
యూళులపై వచ్చు వేడబములు,
నేలకు నింగికిఁ దాళముల్ వేయించి
నేలమాలెలు ద్రవ్వ నేర్చుపనులు,
వెట్టి గరిడీలు నేర్పుచుఁ జుట్టుప్రక్క-
ల నెసఁగుపిసాసులకు నెల్ల లావు మెఱసి
పీటఁ బెట్టె నాటును బోటుఁ బెరయ కెందుఁ
దుందిలునిబమ్మరక్కసిదొరలమిన్న. ౧౬౩

వ. ఒక్కనాఁడు, ౧౬౪

ఉ. నేరిచి యేండ్లుఁ బూండ్లు మది నెక్కొనుదీక్షఁ బిశాచ
శిక్షణద్వారము యక్షిణిం జలిపి పాణితలమ్మున నల్లొనే
రెడుం బేసను గీరితిం గొనినవిప్రకులాగ్ర్యుఁ డొకండు
తీర్థయాత్రారతి నేగువాఁ డినరథం బపరాంబుధిఁ జేరఁ
బాఱుటన్. ౧౬౫

వ. ఆ రేయి నటఁ గడపుమతి వాడముడు నమ్మఱ్ఱిక్రింద విడిసి
విశ్రమించి యద్దమరేప్రొద్దున, ౧౬౬

చ. కహకహ నవ్వుచుం బిశితఖండని వేదన మారగింపుచున్
మహిరుహశాఖ లెల్లఁ బలుమాఱు గదల్చుచు గ్రుడ్లు
ద్రిప్పుచున్ వహవ నెబా ననంగ భటవర్గము వెంచుచు
మేను చూచి తన్ దహదహఁ గొట్టుమిట్టడర డాఁగుఘరా
సురరాట్పిశాచమున్. ౨౬౭

చ. కనుఁగొని మంత్రగాఁ డతఁడు కాళులు చేతులు శుద్ధిచేసి
నిండిన జపనిష్ఠ మంతరపునీళులు చల్లగఁ జల్ల నశ్రువుల్
గనుఁగవ నింపఁ బేర్చదనికం గనుఁగొన్న సరీసృపంబుచా
డ్పునఁ దలవాంచి చేరితటి డుల్లనిభక్తిఘటించి దోయిలిన్.

క. అను భూత మ్మిమ్మెయి నవ
నినిలింపాగ్రణి! త్వదీయనిర్మలచరణా
రుణవనజద్వయిఁ గనుఁగవఁ
గనుకలి నాపుట్టు సార్థకతఁ గొన నమ్యోన్. ౨౬౮

తే. తొడరి యాచరించిన నాదుదొసఁగు లన్న
మంచు తెరువాటు లెడలించి మించి కంచు
మించు గావించె భవదీయమృదులదృక్ప్రి
సార మను కాకమించులసామి వెలుఁగు. ౨౭౦

క. దేవా! అంతర్వేది సు
ఖావహావృత్తిన్ వసించునట్టిడ, నవనీ

దేవుఁడఁ, దుందిలనాయకుఁడ,
నీవితపుగతిఁ దవ్వులువడి తేయఘమునసో. ౨౭౧

ఉ. పాయనికూర్మిపేర్మి దయవార విచారణసేసి నెమ్మదిన్
నాయఘపద్ధతిం దెలిసి నంద్యతరశ్రవ! తద్విమోచనో
పాయ మెఱుంగఁ జెప్పి మలవారిధిపారగు నన్ బొనర్పు
మయ్యా యన నాధరామరకులాగ్రణి యల్లనఁ బల్కె-
నిమ్మెయిన్. ౨౭౨

సీ. అకట! తుందిల! ధర్మమధ్వ మెఱుంగక
మెలఁగితి వెంత వెంగలివ యవుచుఁ
దొంటిపుట్టువ నేర్చి తొలిమినుకుల నందె
వేసిన చేయివై విలసిలితివ;
కాని, బోధింపఁగా మానితి వనుఁగునం
కసదుల, కొనరితి గడన యొకఁడ
కూడును నీరు గా; గొడవ లింతింతలు
పొడమెఁ బైచేఁతలు మూలములుగ;
నేరికిం దీర్పరాని యియ్యెడరు నెడము
సేయ నడరినపూనికిఁ జెవులు దోర
వెట్టి ప్రాఁబలుకులగముల్ వినికి యోపు,
ముల్లు వెలిబుచ్చు మఱియొండు ముల్లెవలయు. ౨౭౩

వ. సర్వథా శ్రుతిపారాయణంబ లగ్గు లగ్గలంబుగఁ గూర్చి
పేర్చు ననుట యభిజ్ఞజనసమ్మతమ్ము. కాని, పిశాచతం

గుతిలపడు నీ కయ్యది పెదగంగయుదకం బగుట నవ్వాని వినికియ నొడువంబడియెఁ; గావున నిట కొక యోజనద్వయ దూరమ్మున నీశాను దెస నెసఁగు నసురకంటకసంజ్ఞక మ్మగ్రహారమ్ము నీ వెఱింగినదియకదా. అందుం గల త్రిపురసుందరీమందిరమున నాముకొనుభక్తివిశ్వాసమ్ము లోముకొన నవనీనిలింపప్రవరులు రానున్నయాశ్వీనమ్మున నవరాత్రవ్రత మాచరించి భవవారిధిం దరింప నున్నవారు. అమ్మహమ్మున నిమ్ముగ నొనరింపంబడుకుమారీవటుసువాసినీసమర్చనమ్ము లన్నియుఁ గన్నులకఱవు దీఱఁ దిలకించుచు శ్రుతిపారాయణం బాలింపఁ జాలునియతికిం గమ్మ మే లొండెదు. బ్రహ్మతేజఃసంపన్నులా బ్రహ్మణ్యాగణ్యుల పరిషదంతరంబున భూతంబునకు నాకుం బ్రవేశం బందని ప్రమానిపం డందువయేని – సర్వసంశయవిచ్ఛేదనచణంబుగఁ గామకలావిలాసాభిజ్ఞుండు విపశ్చిత్రి కాండునిచేఁ గల్యాణమంటపంబున నొడువంబడు భాగవతపురాణధోరణి నవధరింపుము. దాన శ్రుతిశ్రవణఫలంబ యవికలంబుగఁ బెరయం గలుగుదు, పొమ్మనం దుండిలబ్రహ్మరక్షస్సి ట్లనియె. ౧౭౮

క. తొలివిత్తు లెల్లకలలకుఁ
దొలిపలుకులగములతోడఁ దులదూఁగంగాఁ
గలవు పురాణమ్ములు నే
పొలుపున నెఱిఁగింపు మనుడు భూసురుఁ డనియెన్.

సీ. వినుము, తొల్లిట శంఖుఁ డనువాఁడు తెక్కలి
రక్కసుఁ డొక్కరుఁ డుక్కు వెంచి
కనుమూసి గంతులు గట్టి చౌమొగముల
వలఁతిచేతిద యైన ప్రాఁబలుకులు
కొనకొని మ్రుచ్చిలిగొని చని వనధిగ
ర్భమ్మున దాఁగె; విప్రప్రవరులు
దానఁ దేజము దక్కి దైన్య మాననమునఁ
దచ్చనలాడఁ బాదజులఁ బోలి,

పిచ్చలించినపిచ్చ పేర్వెచ్చెముగ ఘ
టింపఁ, దల గుల్లయై ప్రస్ఫురింపమి మను
కోటు లల్లడ తల్లడ గుడిచి కుతిల
పడఁ దొడంగిరి కంగారు పొడవడంప. ౧౭౬

వ. అప్పట్టున, ౧౭౭

సీ. "చాలుఁ జాలుఁ బుడమివేలుపులార! మీ
పొనుగుపాటున కింకఁ బనియ లేదు;
కనుచు వేయంచులకైదువుజోదు తా
నుఱఁ డిట్టి తెఱఁగు, చిచ్చఱపిడుగుహొ
రంగున మ్రుక్కడిరక్కసిఁ బయిఁ బడి
సదమద మొనరించి చంక నిడుక
కొనివచ్చు నఱకాల గ్రుచ్చుకొనం బోక
ములు తొలిపలుకులమూట లెల్ల

మేలిమిానురూపునఁ దోఁచి మెలఁకువఁ గను
మిాఁద; నాలోన మిా రోలి వేదమూర్తి
బాదరాయణమౌనీంద్రు పాలి కరిగి
వినుఁడు భక్తి భాగవతంబు వనట లణఁగు. ౨౭౮

క. భాగవతము పూతము కొన
సాగుతమి వినినఁ జదివినఁ జదివించిన నా
ల్గాగమములు సాంగము లగు
వే గరగతము" లనునాడువు విన నయ్యో నచోణ. ౨౭౯

క. అంతం బారాశర్యుని
యంతికమున కరిగి వార లాతెఱఁ గెల్లన్
సాంతమ్ముగ నొడివి వినిరి
వంతల్ రూపఱఁగ భాగవతకథవిధమున్. ౨౮౦

వ. కావున, ౨౮౧

క. పావన మిా భాగవతము
హావైభవ మంత యింత యనఁ బూనఁ గలాఁ
డేవాఁ డిడి తూఁచినఁ దుల
లో వేదము లిది యొకఁడ పొలుపునఁ దనర్చున్. ౨౮౨

చ. అరసియ కాదె యీ తెఱఁగు నాదల మిత్తి జిరా విదిర్చి
హుంకరణ మొనర్చుచుండ మహికాంతుఁడు పార్థునిమన్మఁ
డున్ మునీశ్వరుఁడు శుకాభిధానునికృపన్ విని భాగవ

తమ్ముఁ సప్తవాసరముల సంస్కృతిం గడచి శాశ్వతముం
గొనె విష్ణుధిష్ణ్యమున్. ౨౮౩

తే. అట్లు లోటనోఁ గాదన కంబికాల
యమున నానోడివినవిత మాచరించి
కాంచుమా సేమ మీ వని కాంచనాబ్జ
భవకులాభరణంబు తాఁ బనినివినియె. ౨౮౪

శా. ఆభూతంబును బ్రాప్తమాశ్వినమునం దాదేవలంబందు
నెంతే భక్తిం గని యంబికన్, విని ద్విజోద్గీతమ్ము పూతమ్ము
మత్తేభేట్ప్రత్తిధృగిష్టభాగవతమున్, హేమించి దీప్యత్త
నూలాభస్ఫూర్తిఁ దోలంగి కశ్మలము లీలం గాంచెఁ
గైవల్యమున్. ౨౮౫

క. మనుజాధిప! భాగవతము
నెవరునఁ గూర్పంగ నోపనిది యొకఁ డున్నే?
అనిమిషులకు నే నాకత
వినుకలి కనుకలి దొరకదు వేబాములకున్. ౨౮౬

క. వినుమా, నిజదేశమునకుఁ
జనుమా, భాగవతము వినఁ జాలినసరిణిన్
మనుమా యుషమాసమ్మున,
ననుమానము వలదు రాజ్య మఱచేఁ జిక్కున్. ౨౮౭

క. అని సోమశర్మ తనయు
చ్చన చనియెఁ రాఘవుండు జనితము కుతుక
మ్మున నవరాత్రవ్రతముఁ
ఘనభాగవతమ్మువినికి కదురఁ బొనరుపఁ. ౨౮౮

వ. దీక్షం గైకొని నెక్కొనుభక్తిభావమ్ము తిరమ్ముగ రాజ
త్కృపారసతరంగితకమనీయనయనరాజీవ, రాజపీఠనివేశిత
నిజాశ్రితవ్రాత, రాజరాజేశ్వరిపదాంభోజమ్ములం గొలువం
దొడంగె; నట్లు కొన్నియేండ్లేగినయావల, ౨౮౯

మ. తమకుం దామ యెఱింగికొం చునికిఁ గాంతారాంతరమ్ముల్
సహస్రము లల్లల్లన దాఁటి మేటికరు లశ్వంబుల్ రథం
బుల్ దగఁ సమతం గూరనిపోటుబంటు లనుఁగుల్
సాయమ్ము సేయంగలారము కైకోఁగదవయ్య యొయ్యన
భవద్రాజ్యంబు పూజ్యం బినా! ౨౯౦

తే. క్రమ్మ రాజ్యగర్వాంధ్యమ్ము కన్నుమిన్ను
గనక కారించుచున్నారు జనగణమ్ము
మొఱటులై ప్రెగ్గడ లనుచు మొఱ్ఱ యిడుచు
వచ్చినఁ హెచ్చు నరుసమ్ము వారిఁ గూడి. ౨౯౧

వ. ఒకనాఁటియుషస్సున, ౨౯౨

తే. ఎంచి శుభముహూర్తమ్ము మ్రోయించి భేరి,
బలము నడిపించి, బలమును జలము నెంచి,

నెగడి దుర్గము దుర్గముల్ నిస్తరించి,
కాంచి పురి, పగతుఱ నెదిరించి, మించి, ౺౩

వ. ఆటు పోటుం దాఁకని వీఁక సంగరరంగమ్మునం గండర
గండండై పొలికలను పీనుంగుపెంటలు గావించుచు వీరవి
హారంబున ధీరత్వమ్ము మెఱయించుచు ననువవు నదనున,

క. బ్రాఁతిగఁ జేఁజేఁ దనకుం
జేఁతటికము లొనరిచిన సచివవర్యుల ని
ష్కాతరవృత్తిం బొరిగొని
యీఁతలు మ్రోఁతలతో రాజ్య మెల్లం గొనియెన్.

సీ. శుభద భువననాటకరంగసూత్రధారి
తాలసిత త్రిపురాంబ డెందమున నమరి
యుండి నడిపించుపనిఁ బూన నొనరు నోర
పార లేలలి వానిమేల్వాలనమున? ౺౬

తే. శ్రీశివాప్రసాదము పేర్మిఁ జెలువు గనిన
కొడుకుకూఁతుండ్రతోడుతఁ గూడిమాడి
యేండ్లుఁ బూండ్లను గుడిచి రాజ్యేందిరాస్వ
యంగ్రహాశ్లేషసుఖము లయ్యవనిభర్త, ౺౭

వ. తుదిఁ దిరిగి తాక యుడరనిపరమపద మైననె; నట్లుకావున
నాగమ భాగవతపారాయణశ్రవణప్రభావం బభివర్ణింప
వేయి మొగమ్ములనిడుపదొరకేఁ దరము గాకుండు. ౺౮

క. శ్రీనరస నేత్రసీతామానవతీసూను తానమంచితరంగ
క్షోణీనాయకపుంగవమానసపుల్లాంబుజాతమధుకర నేతా!

శా. శ్రీమత్తత్పదలక్ష్యతాలసితనిస్సీమప్రమోదాఢ్యా! నా
నామానీశ్వరచిత్తపద్మకనకాంతస్సద్మసత్కర్ణికా
సీమాకల్పితవేదికావిహృతిసంస్ఫీతానుభూతిస్ఫుర
త్సామేశీసఖితాకలానుకలనాకల్యాణవల్ల్యంచితా! 300

మాలిని— చరణశరణరక్షాసత్కృతిప్రేష్ఠనిష్ఠా!
విరమచరమభావావిర్భవాతీతభూతీ!
కరణభరణకల్పాకల్పితానల్పశిల్పా!
ద్విరదవరదముఖ్యాదిత్యపాలానుకూలా! 301

మ. వరణీయస్పృహణీయగేయగుణసంభావ్యానుభావ్యేందిరా
పరమోదారకటాక్షవీక్షణకలావాప్తస్థిరామండలీ
వరతాభాసురరంగరాజరసశుంభత్కావ్యకన్యామణీ
కరకంజగ్రహణమ్ము నీనొసఁగుఁ గసత్కల్యాణమాంగల్యమా.

గద్య— ఇది శ్రీ శ్రీవత్ససగోత్రపవిత్ర, చిదంబరపౌత్త్రి
నాగభూషణసుధీవరపుత్త్రి, శ్రీబాలాత్రిపురసున్దరీ
గర్భశుక్తిముక్తాఫలాయమాన, ప్రభాకర, లక్ష్మీ
నరసింహశాస్త్రిసమాఖ్యానప్రణీతంబైన
కాలభాగవతము సప్తమస్కంధమున
నాశ్వీనమాహాత్మ్యము
ప్రథమాశ్వాసము.

శ్రీరామ

## కాలభాగవతము - సప్తమస్కంధము

# ఆశ్విన మాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

శ్రీరమ్యానిషద్యోషా
సారతరగవీనుతాంఘ్రిసారసయుగలీ
సారంగాయితవిదిత
శ్రీరంగాఖ్యానరాజచింతితతేజా! ౧

వ. అవధరింపు మకాంచనకంజసూతిసూతి వెండియుఁ బృథు మహీపతి కిట్లు లని వినిపింపం గడంగె. ౨

తే. అవనిపా! విను నొడువుదు నాశ్విననవ
రాత్రమహామహిమ మింకఁ, బ్రతిపదాది
గ నిగదితచండికాసమర్చనము బుధుఁడు
పెరయు లగ్గు నేకోత్తరవృద్ధిఁ జలిపి. 3

## నవదుర్గార్చాక్రమము

సీ. శైలనందని, బ్రహ్మచారిణి, కుముదాప్త,
ఘంటిక, కూష్మాండ, స్కందమాత,
కాత్యాయనీదేవి, కాళయామిని, గౌరి,
యను పేళ్ళఁ గ్రమమున దిననవకము
నం దేజు గాంతురు నవదుర్గలు, సువర్గ
లాభాభిలాషఁ గొల్వంగ నొప్పు
నాజగన్మాతల నావాహనధ్యాన
విధులు పదాఱు వేర్వేఱ మెఱయ;

నవల, నవలీల మహిషాఖ్యుఁ డసురునుసుఱు
త్రావి తవిలినయెడరు దూరమ్ము సేసి
ముజ్జగములఁ బ్రోచిన జగత్పూజ్యవార్వ
మా హారిం దన్ను మహిషు ముదాప్తిఁ గొలువ. ౪

క. వారక వెలయొనుఁగురా
వారువపుంజోదు మొదలు పదిదెసలను బా
దారుల నవావరణములఁ
గోరిక లీరికల నెత్తఁ గూడుం గొల్వన్. ౫

క. ఆవరణసమావాహితు
లావేలుపుదొరలనడుమ నాకారితు ఛా
యావిభు 'నతిబుద్ధే'ముఖ
పావనమనుసమితిఁ గొలుచుపని విహితము సూ. ౬

అశ్వపూజావిధి

తే. నవమిపర్యంతమును నవనవము ఘణితిఁ
జివురు దొడిగినభక్తి నర్చింప నొప్పు
వారువములఁ; దద్వ్రముఖతఁ బరఁగువాఁడు
వాహనము లటె నెటె నెటె బడలుపడును. ౭

క. హేరంబజనిత్రి, మహా
హేరంబమదాపహర్త్రి, హ్రీం శ్రీం ప్రముఖా
ణ్ణారాధిత కొంగున బం
గారు తురంగమగణార్చకజనమ్ములకున్. ౮

వీరబాహుని చారిత్రము

తే. విను, మవంధ్యము వంద్యము వింధ్య మన్న
మేటి గట్టురా పెట్టనికోటగా నొ
కండుదెస నొప్పు రైవతకమ్ము పురము,
త్రిదివమును నెందు నది నోరు మెదపనీదు. ౯

ఉ. ఆపురిమేలియేలుగడ నైె హరువారు నవక్రవిక్రమా
టోపము నైప కేపు నెడి డొంకలఁ ద్రోవలఁ బట్టి
వెన్నులం జూపు నరాతిభూపతులు శూరులడెందములోని
కొట్టు గా నొపిన వీరబాహుమహీపోత్తముఁడాత్తయశస్స
మగ్రతన్. ౧౦

చ. సడలనిశౌర్యసంపదలు, జాలనిబీరము, లోటు పోటు నే
యెడఁ గసరాని పోటరిక, మెండనిలావు, దలంగఁబోని
తెం, పడరెడునుక్కుతునక్కలు నృపాగ్రణి యాతని యుద్ధ
టుల్ భటుల్ దొడిఁబడి చేయ రాజి నయిదుం బది
తొంబది సెప్పఁ బూనిన్. ౧౧

ఉ. విఘ్నహతిం బడల్పడక వే యని కెత్తియ వచ్చి రేని ర
క్షోఘ్నునిఁ గాసువీసమునకుం గొనఁబోనిమగంటుముల్
శిరోదఘ్నత నొప్పఁ బోటునకు దాయలఁ బట్టి శతఘ్ను
లున్ సహస్రఘ్నులు వారి గాడ్పులుపఁ జాలునె వేలు
శతఘ్ను లేనియున్ ? ౧౨

చ. రయమున విస్ఫులింగములు గ్రక్కుచు గ్రక్కదలన్
ధరిత్రి పైఁ బయి తల రాయుచున్ బిఱుగు వాఱిన నింత
తలంగనట్టి మేల్హయములు వేలుకోటులును న్నర్బుదముల్
గల వమ్మహీధవాన్వయమణి వీరబాహునకు; న ల్పతఁ
డుం బగవారికంటిలోన్. ౧౩

ఉ. అమ్మనుజేశ్వరేశ్వరుఁడు నాయితముం బొనరించి వే సమీ
కమ్మునఁ గాలు ద్రవ్వ తనకాలుబలమ్ము, ద్విపాళి, మేలివా
ర్వమ్ముల, స్యందనమ్ములను, బ్రస్థితుఁడై యఱచేతిలోని
బెల్లమ్ముల యెల్లదేశములు లావుమెయిం బొనరించి
మించుచున్. ౧౪

మ. విదితంబుల్ విని మజ్జదున్మదకకుబ్భేదండగండస్థలీ
మదిరామోదభరాలసశ్వసనసంస్పర్శోల్లలత్ఫుల్లకం
జదలస్యందిమరందపానవివశస్వాంతద్విరేఫావలీ
మృదుసంగీతతరంగితమ్ము రజనీమిత్రాత్మజాప్రాంతముల్.

తే. చేరి విని యటఁ జరియించువారివలనఁ
దదధిపతి దివోదాసభూధవుననల్ప
దర్ప మతని లోఁగొనునిచ్చఁ దరలెఁ బెడచె
వుల నిడి వలదను ననుంగుజెలులనోడులు. ౧౬

వీరబాహుఁడు కాంతిపురిం జుట్టు ముట్టుట

చ. కొనకొని చుట్టుముట్టి వెలి గూరనిమూఁకతో కాంతిమం
తమై తనరుస్వకాంతిపూర్వరముఁ ద్రవ్వుచుఁ గా లని
కార్చు వీరబాహునివిత మాలకించి సమయోచితవర్తను
లా దివోదాసభూపుననుగుప్రెగ్గడల్ పనుపఁ బోయిన
దూతలు మీఱుచాతురిల్. ౧౭

మ. అని రీతీరున వీరబాహున కవార్యమ్మైన శౌర్యమ్మునె
చ్చిన వజ్రాయుధుఁ జీరికింగొనని మే ల్జో దాదివోదాసనా
మనరాధీశ్వరశేఖరుం డిపు డసామాన్యాజరాత్రవ్రతమ్మున
నర్చించుచున్న వాఁడు త్రిపురాపూతాంఘ్రికంజాతముల్.

క. మిపులుకుమారీభూసుర
సువాసినీవటుసమర్చ చూడిక కి విందుల్

మివిలింపఁ బ్రతియేఁ డే
డవ్వనెలఁ జితకలికఁ గొలుచు టవ్విభువిధి సూ. ౧౯

క. తలఁ బడిన బ్రవయ్యాలై మిను,
కులగిరు లూటాడి జలధికులము కలంగన్
బ్రలయానిలములు వీఁచినఁ,
గులేశిఁ గొలుచుతటి నతఁడు గొనఁడు వికలతన్. ౨౦

క. ఏయంతరము లొదవిన న
మేయవ్రతరతి సినుఁడు న మే దహ్యాతి దీ
ప్తాయాం నిఖిలాయాం మిథి
లాయా మ్మనుచాయ వికృతులం గొనఁ డెడఁదన్. ౨౧

వ. అది యటు లుండె, ౨౨

సీ. విదితజవాదుల వేల్పుఱావారువ
మ్మును చారవమ్మును బొనరిచి యొక
కాసువీసముఁనకుఁ గైకోని తన కల
మెలిగుఱ్ఱమ్ములు వేలు కోట్లు
కల్పించి శ్రీమాతృకావాహనమ్ములు
గాఁ జల్పు నాశ్వినఘనతరవ్ర
తమునఁ బాయనివిధిఁ దనరి కొల్చుచునున్న
వాఁడు మాకూర్చినవాఁడు; నదియు
నింక నైదవునాఁ డకలంకవృత్తిఁ
బూర్తి నొందు, నాలో వానిఁ బోలదు పనిఁ

గొనఁగఁ; దాలిమి నెలయు మాదనుక; నవలఁ
బెనఁగవచ్చుఁ జేతులతీట యణఁగి మణఁగ. ౨౩

చ. నలి నలి సేయుచున్ ద్విపగణమ్ములయెమ్ములు, వాజి
జాతి ప్రేవులు వెలిదీయుచున్, విఱిచి ప్రోవులు వెట్టుచు
స్యందనమ్ములన్, గొలఁదికి మీఱుబీరమునఁ గూటువ
మూఁకలఁ బూరి మేపుచున్ దలపడుఁ బోరఁ బోటుతఁడు
నాఁడు కరమ్ములు కాటి నిల్వనై. ౨౪

క. ఓయవనిప! లేనపుడు హు
మాయులు మాఱేని గెలుచుమాటక చనును
మ్మాయలు జగ్గాయలు పో
రా యమునాగ్రజునివీటి కతిథుల యవుచున్? ౨౫

మ. అనఁ గన్నుంగవ నిప్పుకల్ గురియఁ బొం డాయోధన
ప్రాంగణమ్మున కేతెంచుట యొండె, నోటమి ననుం
బూజించు టొండెన్, ద్యుదాసున కొప్పంగలకర్జ; మిట్టి
నోడువుల్ శూరాగ్రణుల్ మెత్తురే? యనుచున్ వారల
నంపి పుచ్చి సమరాహంకార మేపారఁగాన్. ౨౬

ఉ. ఢమ్మని యుద్ధదుందుభి కడల్గొనుభీతి దిగంతవారణేం
ద్రమ్ములు దిద్దరం బిరిగి రాపడ మ్రోయఁ దొడంగ స్వీయ
సైన్యమ్ము లపారముల్ ధర వణంకునటుల్ నడిపించి

మించుదర్పమ్మునఁ గాంతిపూర్వరము రైవతకేశుఁడు
చుట్టుముట్టెఁ దాన. ౨౭

క. కని యయ్యుద్ధతునాయో
ధనయత్నముపద్ధతిం బ్రధానులు సువిచా
రనిధుల్ తెలియం జెప్పినఁ
బొనరనివైకల్యమున దివోదాసుండున్, ౨౮

ఉ. ఆగమవార్ధిమృగ్యచరణారుణనూత్నసరోరుహం, బురో
భాగలసత్సువర్ణమయభవ్యసుపీఠనివేశితన్, శివన్ జాగిలి
మ్రొక్కి లేచి వివశత్వముఁ గూర్చ ననల్పభక్తి తా నీగతి
వేగ మంజలి ఘటించి నుతించె సమంచితస్థితిన్. ౨౯

దివోదాసుఁడు శ్రీదేవిని స్తుతించుట

శా. అంబా! లోకములన్ సృజింప, ననపాయప్రక్రియం
బెంప, భీమంబౌ కాలపయోధి ముంచి పులుఁగున్ మా
యింప నీదృగ్విలాసంబె కాదా కా హేతుభూత; మడఁ
గున్ సత్యంబు నీయంద పాదంబుల్ హస్తిపదంబునందటు
సమస్తంబుల్ మహాశక్తులున్. 30

చ. కలితము పాద్మకల్పమునఁ గర్వలిమేఁతరిపాన్పువేల్పుపొ
క్కిలివిరితమ్మిదుద్దున నొగిన్ జగముల్ ప్రొడమించు నిచ్చ
మోములు నలుదిక్కులం దనరఁ బుట్టినజెట్టికలంత

వాపవే తొలి 'తప' యన్నమేల్పులుకు దోఁచునటుల్
వొనరించి చిత్కళా! 3౧

చ. శివునకుఁ బ్రాణనాడి వయి జీవముభావము తేజునోజు
గూర్తువు; ప్రథితుం డతండు కన దొడ్డను మంచపుకోడె
గాని, నీసవిధము లేనిపూఁటన నిజ స్మరకాసును జేయఁ
డాతనిం దవిలి భజించు టీ జగము త్వత్సఖితాప్తిఁ దలి
ర్చుటన్ శివా! 3౨

మ. భయదాయోధనభూమి నాముకొనుకోపజ్వాల లుద్వేల
తం బయిపై మూఁకలు మూఁకలై కవియుక్రవ్యాద్వీరులం
గ్రమ్మ నీరయిమల్ గోళ్ళులు మీటి తోఁచినపతంగాశ్వావ
తారంబులన్ జయముం గొంటి జగమ్ము లొందఁ సుక
మర్చ్యా! చండముండాదినీ! 33

క. మ్రుక్కుడిమూఁకలు తోడుగ
నిక్కుటిలుఁడు వీరబాహుఁ డిదె వీటికి న
ల్దిక్కులఁ దానై నిలిచెన్
లెక్కగొనఁడు నీసమర్చ లేశమ్మేనిన్. 3౪

తే. అంతు పంతును గనరాని యాజవంజ
వాబ్ధికిం దెప్పకొయ్య నీయడుగుదోయి
కొలువు డది దొరకిన నాకకూళవలన
నడరు నెడరు పేరిటికాల్వ యనఁగ నెంత? 3౫

వ. అని సన్నుతించి విన్నవించిన, ౩౬

శ్రీమాత భూతముల సృజించుట

తే. కూర్చుకొలువుడుకాంద్రకొంగున ముడిచిన
మేలిక్రొమ్మానికమ్ము శ్రీకాళి పనిచె
వేనవేలు భూతములఁ గల్పించి వీర
బాహుగుఱిసేసి కాంతిపూర్వరరిరక్ష. ౩౭

సీ. నేలకు నింగికిఁ దాలముల్ వైచుచు,
హుంకరించుచు బయ లూడి పడఁగ,
నఱిముఱి నిప్పుక లుఱులించుచుఁ గనుల,
నడు గిడు చిలదాల్పునిడుఁపఁ డదర,
శూలమ్ములున్ భిండివాలమ్ము లాభీల
ములు జళిపించుచు లలిఁ గరముల,
గుటుకున బ్రహ్మాండకోటులు మ్రింగ నో
ర్రెఱచుచు, మొగి మల్లఁ జఱచికొనుచుఁ,
గసిమసఁగి మహాప్రళయమవసరమునఁ గృ
తాంతులెంకలఁబోలి భయంకరార్భ
టులు సెలఁగఁ బగఱఁ జదను జలుపుచుఁ బయిఁ
బడియె బూచులు చిచ్చఱపిడుగులట్లు. ౩౮

ఉ. కొందఱిప్రక్కలెమ్ము, లొకకొందఱికందనగాయలుం,
దలల్ గొందఱి, వూరువుల్ మఱియుఁ గొందఱి, వుర్వడి
నుగ్గు నూచగా నందఱ మోఁది తాఁచి మెయి నంజలి

గుంజలి యూర్చి పెంచి తా గ్రిందఱ వందఱె చదియఁ
జేసెఁ బిసాసులు శత్రుసేనలన్. ౩౯

చ. విఱిగిన కేతుదండములుఁ, బిండిగ మాఱిన తేరులుం, బులుం
గఱచి నుఱుంగు గ్రక్కు తురగమ్ములు, డొక్కలు కాళ్లు
తొండముల్, దఱుఁగుడు వడ్డ యేనుఁగులు, లా వఱి
రాముని తమ్ముఁ బిల్చుచుం బఱుగులువాఱు రౌతులుగ
ధ్వస్తము లయ్యె మహీపువాహినుల్. ౪౦

క. బెగ్గడిలి నుగ్గునూచై
సిగ్గిలి బండాబెడ గయి చీకాకును నై
గగ్గులకాఁడై బూచుల
బగ్గనుకోల్తలకు వీరబాహుఁడు సిక్కెన్. ౪౧

భూతములు త్రిదివముపైఁ గవియుట

శా. అంతం బోవక భూతసృష్టి యది శౌర్యాటోప మేపార
నాశాంతప్రాంతము ద్రొక్కి చూచి కనఁబోకాఁయన్న
వారిం బోరిన్ అంతుల్ పంతము లుల్లసిల్ల బయలన్ అం
పిల్లి యూపై శచీకాంతుం డేలు సువర్గపట్టణముప్రాకారమ్ము
సేరం జనెన్. ౪౨

తే. అంత నార్చి పేర్చుచు దెస లద్రువ నెదిరి
పదరి యుంపవానలు పయిపయిని గురియఁ

గడఁగు కాఁపువారలఁ బులికాపు వెట్టి
పట్టి పాలార్చె నా భూతపరమసృష్టి. ౪౩

క. ఏయెడఁ జూచిన నెత్తురు
లై యేఱులు పాఱఁ బంతు నంతింతయు లే
కాయోధన మాయెడ న
త్యాయత మాయె సురభటుల కా బూఁచులకున్. ౪౪

వ. కొండొకవడికి, ౪౫

సీ. చిందర వందరై, చిక్కచీద రయి, బె
గ్గడిలి బికారులై, కలలు దప్పి
కకవికలై, పాఱఁ గాళ్ళు రామిఁ బలప
ల నయి, మతిసెడి మల్లామడి యయి,
లేక వాతన వాకు మూకలై, వాడి కూ
కులు వత్తులై వెలవెలనబాఱి,
యొరుగులై యే పఱి, యొడలిసంధులు క్రాస్సి
పిండిలివండులై బెండులు నయి,

చతికిలం బడి సెలవుల జాలువాఱ
లాల నుచ్చిలి యెచ్చుగ, నేల నొఱగి,
వచ్చుప్రాణంబు పోయెడుప్రాణమునుగఁ
బడిరి నాకముకావలివార లెల్ల. ౪౬

క. విధి విసువు లేక త్రావిన
సుధ గుటగుటలాడునుసులు సొరిదిం బోనీ

కధికవ్యథ గూర్చి యపుడు
సుధాంధసులు వారల కెద శోకము యయ్యెన్. ౮౭

తే. ఆంధ్రయువతులఁ గట్టినయట్టి త్రాళ్ళు
బల మయస్కాంతమై యీడ్వ వారిలోన
మూవురో ఇర్వురో బ్రతుకు జీవుఁడ యని
పోలికలనునఁ బడ కెటెటో పురము సేరి, ౮౮

క. బ్రాఁతిగ సభాంగణమునం
బాతరలాడెడు తిలోత్తమనునుదొడలపైఁ
బాతరలాడు వెయికనుల
మూఁతలు లేనట్టి వేలుపులయొడయనికిన్. ౮౯

వ. దండప్రణామపురస్సరంబుగ నాక్రొత్తభూతమ్ములవలనం
బొడమినయెడరు కడదాఁకఁ దూచా తప్పక చెవుల
కెక్కం జెప్పుటయు, నప్పురందరుండు దరంబున కిర వీని
మానసమ్మునఁ గను లెఱ్ఱజేసి కాలరుద్రుండో యన
బగ్గున మండుచుఁ గొఱుకంబడిన దంతంబుల పటపటా
రవంబులు దిక్తటంబుల మాఱు మ్రోయింప వాహినుల
నాయత్త పఱుప ముదల యిడి తానుఁ జౌదంతిపయిన్
వజ్రియై వజ్రకవచంబు దొడి తొడిఁబడని పూనికి నరాతి
భూతమ్ముల దుమ్మునం గలుప నలుపమ కాని రయమ్మున
నమరావతిన్ నిర్గమించి మించుగమిం గంచుమించు పొన
రించు కాకమించులవినుమానికపుదొర సురకానికిం గొనక

యేపు సూపిన ప్రతాపమ్మున నుదగ్రుండై సంగరాంగణ
మ్మునం గాలిడి. ౧౦

ఇంద్రుఁడు పోర మాఱుమొగము వెట్టుట

సీ. ఆటు పోటును లేని పోటుబంటుతనానఁ
గన్ను మి న్నరయక యున్నవారి,
నెత్తుటఁ దోఁగిన నెమ్మేనులం గుసు
మితకింశుకము లన మెఱయువారిఁ,
దాలిచి యఱుతల దండలుగాఁ బ్రేవు
లార్చి పేర్చుచు నాట్య మాడువారిఁ,
బాదువుఁడు చిదుముఁడు పు ర్వ్వడి వచ్చె వే
గ్గనులతో నని యట్లు కడఁగువారిఁ,

జూఱచుటుం జూచి బూచుల సురియుఁ డింక
ననుచు నైరావతాస్ఫాలనాతికర్క
శము కరమున గిర్గిరఁ ద్రిప్పి సరగ వైచె
స్ఫూర్జథువు నిండ దెసల దంభోళిఁ బాళి. ౧౧

ఉ. క్రక్కుచు విస్ఫులింగములు గంటకు నూఱులు వేలు
క్రోసులై యెక్కుడు పర్వ్వబర్వ్వనఁ బయిం బడు నప్పవి
నుక్కుతునుక యా నాకఁడు భూతనేత చెయి నోపికఁ
బట్టి సగమ్ము త్రోవఁ దా నెక్కటి దానితో నఱిమె నింద్రుని
నాతనితోడి మూఁకలన్. ౧౨

ఉ. అంతఁ గృతాంతుచందమున నంతయు నింత యనంగ రాని
దుర్దాంతము కిన్కఁ మండిపడి దానవమర్దనునగ్రజుండు
చౌదంతి నవారిపైఁ దఱిమె; దాయ యొకండట నడ్డమై
తగన్ ఱంతులు మేలితుండ మదఱం బిడిగ్రుద్దులు గ్రుద్దె
నుద్ధతిన్. ౧౩

ఆ. అదియు బెదరి తుండ మాకసమ్మున కెత్తి
పట్టి గీఁ యటంచు నట్టె మరలి
పాఱె బలగ మెల్లఁ బచ్చడి పచ్చడి
గాఁగఁ ద్రొక్కుచుఁ బురికడకుఁ జేర. ౧౪

క. అదియే యద నని భూతపు
లదరన్ భూతంబు లెల్ల నార్చుచు సురలం
బొదివి ప్రిదులని మగంటిమి
సదమద మొనరించి చొరిరి స్వర్గపురమ్మున్. ౧౫

చ. అటు కడు నొచ్చి చేసినప్రయత్నములం గొనఁబోక
లెక్కకుం బటురయ మొప్పఁ బర్వెడునిభంబువిధంబు
నవీనభూతరాట్చటులపరాక్రమక్రమము సంగరరంగసము
ద్ధతత్వముం దటతటఁ గొట్టుకొన్న యెడఁదం దలపోసి
సురాధినాథుఁడున్. ౧౬

క. ము న్నెన్నఁడుఁ గన్నుంగవఁ
గన్నది విన్నదియుఁ జెవులఁ గానిది యాక్రొం

బన్నము వేల్పుల కొదవె న
టన్నన్ శ్రీమాతమహిమ మనుకొనవలదే? ౫౭

క. అని చింతించి మనమ్మునఁ
గొనకొనిన యఖండభక్తిఁ గురుకుల్లాపా
వనపదజీవనజద్వయి
వినుతించె మహోర్మ్యాసూక్తివిస్తృతి వెలయన్. ౫౮

వ. అ ట్లంకించుడు, ౫౯

సీ. క్రొంకాఁగు మెయిఱుగులకొమరారుజిగి మీఱు
తనువుతోఁ, గరమున ధనువుతోడ,
నిండుచందురుగోము నిరసించు నెమ్మోము
తీరుతోఁ, బునుకలపేరుతోడ,
నగ్గికిఁ దావల మ్మైవు క న్నమరులలా
టంబుతో, మణికిరీటంబుతోడ,
దయవారు దయ నా సుధం గురియించు నే
త్రములతో, న స్త్రశ స్త్రములతోడ,
వఱలు తెఱనోటిమెగము వార్వమ్ముతోడఁ,
గన్నుసన్నల నెలయించుగతికి నయిన
మేలిసత్తులపిండుతో మెఱపు మెఱసి
నట్లు వేల్పులదొర కగ్గమయ్యెఁ గాళి. ౬౦

క. ప్రణమిలి తోడ్తో నాతం
డును గొని యాంతల్లిముదల నూల్కొను చింతన్

వినిపించెం దూచాత
ప్పని చెప్పనం జొప్పడినవిపత్తు తెలుంగుగ. ౯౧

కాళి భూతముల నుపశమింపం జేయుట

శా. అంతం గూరిమి పేరిమిం బొరయ నయ్యాదిత్యసంకాశ
నాకాంతస్వాంతముల్ జొరంబఱచి శంకాతంకముల్
సున్నయై ఱంతుల్ గంతులు పంతముల్ బలుపువాఱం
బేర్చి యేవారినిం జింతాకంతగం జూడంబోవని స్వసం
సృష్టమ్ములా బూచులగ. ౯౨

సీ. తలంపుమాత్రముననె తఱికి రావించి శా
సించెం గన్నులవేల్పు సేమ, మెల్ల
విష్టపమ్ములమహానిష్టముల్ నష్టతం
బొరయుట, స్వార్చావిముఖుల దర్ప
దళనమ్ము నెంచి యీాలలిం; బొందు మీా పాడ
మినపని కొనసాంగె, మేల యయ్యె;
మానసమ్ములం దలమానిక మ్మాశ్విన
మున విధిమెయి మదర్చనముజోలి

త్రవ్వబోవక గరువమ్ము తలముసుకలు
గాం జరించు కించుల తురంగమగణమ్ము
వారితోంగూడ మెసవి యప్పడములట్లు
నాశ మొనరించుచుండుం డీనాండునాంగ. ౯౩

తే. అనుచు బూదుల నచట మాయమ్ము సేసి
శక్ర! పాయక మత్పదజలజయుగళిఁ
గొలువుమా గల్గు లగ్గు లగ్గలముగ నని
పలికి పడసె నంతర్ధిఁ దా భద్రకాళి. ౬౪

తే. నాఁడు మొదలుగ హాయమారి నా నభిఖ్యఁ
దనరె నాభూతసృష్టి; యద్దానివాతఁ
బడి బడల్పడకునికికి నొడువఁ బడియె
శాంతికర్మము లవ్వానిచక్కి- వినుము. ౬౫

క. లలితాప్రీతికరమ్ముగ
లలిఁ గొలువఁగఁ దేఁబడెడు సులక్షణకలిత
మ్ములు వార్వమ్ముల యొడళులు
తలమవ్రు వేనీటఁ గడిగి తడి యొత్తఁ దవ్రుఁ. ౬౬

తే. పొలుపుగులుక నెమ్మొగమున బొట్టు వెట్టి
కుంకుమమ్మునఁ, జెంగల్వకోష్టు, జీడి
విత్తులుం, దెల్లనావాలు, వ్రీహి, వసల
పొడులు తునకలతోఁ బొత్తుఁ బొరసియున్న, ౬౭

తే. రంగు లొకనైదు మెఱయుసూత్రమ్ము వాని
యఱుతఁ గట్టనౌ; మాతృకాహర్షదమ్ము
శాక్తవాయవ్యవైష్ణవసౌరశైవ
దేవముఖమనువుల వేల్మి దినదినమ్ము. ౬౮

క. ఈ యోజం గొలువంబడి
యేయెడరుణ లేక వాజు లెక్కాల మన
ల్పాయోధనముల గెలుపు న
మేయస్థితిఁ గూర్చుఁ బుడమి మెలఁతమగనికిన్. ౭౯

వ. అని వెండియు నయ్యండజస్యందనునందనుండు పృథుధరా
వరున కి ట్లను. ౮౦

వీరబాహుఁ డాహవము వీడి కాలికి బుద్ధి సెప్పుట

తే. అటులు బూచులకో ల్తల కడ్డి కలన
నిలువ నేరమి ననదయ్యె నిట్టనిలువు
నీరు గాఱిన గుండెతో వీరబాహు
భూవరుం డప్డ కాలికి బుద్ధి సెప్పి, ౮౧

తే. కాకికేనియుఁ జొరరాని కాఱడవి నొ
కండు సేరి చరించుచుఁ గాయకసరు
లాకునలముల నాఁకలి నడఁచికొనుచు
నుండె మా పున్నచోట శే పునికి లేక. ౮౨

తే. కడఁగి పెద్దవ్వ తలఁ జేయి యిడుటె కాక
పంగుకాలుఁడు కాళ్ళకుఁ బట్టె యట్టు
లందు నిందును ద్రిమ్మరిఁ డైన యాతఁ
డిందునందనతటమున కేగుదెంచి. ౮౩

క. వచ్చినయిషమాసమ్ముల
నచ్చంద్రకలాకలాప నర్చించుచు నే
నొచ్చెము పొచ్చెము వారయక
యచ్చపునిష్ఠం బొనర్చె నతులతపస్వి. 24

వ. ఒకనాఁడు, 25

క. మున్ను తనపొనర్చిన మే
ల్పన్నెమ్ములమూట యిట్టి పొలుపునఁ దగె నాఁ
గన్నులపండువు గూర్చుచు
సన్నుతయశుఁ డొకతపస్వి సనుదెంచెఁ దమిన్. 26

తే. అంత దత్తోత్తమాసను నర్చ్యచరణు
మునిజనార్ఘ్యభు ఋషభనాముని నవాని
స్తుతివచస్సులఁ బొనరిచి సుప్రసన్ను
విన్నవించుడుఁ దనగోడు పృథివివిభుఁడు. 27

తే. అంతరంగమ్ము రంగద్దయాసుధాత
రంగితమ్ముగ నమ్మునిపుంగవుండు
చండికాపారపూజనాఖండవిధివి
ధాన మంగసంకలితమ యైనఫణితి, 28

తే. తెలిపి యవ్వాని కిటు లనుఁ దలకు మిగిలి
తాడి పొడవున నిగిడిన దర్పమునన

చండికార్చాంతరాయమ్ము జలిపి యుంటి
మున్ను; దాన నింతింతలు పొడమ నయ్యె. ౭౯

క. నాచెప్పినచొప్పున ధిష
ణాచటులతఁ బో నడఁచి యనవరతమును జం
డీచరణార్చారతిఁ దవు
మా, చేపడు రాజ్యవిభవ మఖిలము వెలుచన్. ౮౦

క. అని నిగదితచండీపా
వనమాహాత్మ్యప్రకారపరిభావితుఁ డ
మ్మునిలోకవిభుఁడు ఋషభుఁడు
చనెఁ జూడికిచొప్పు దప్పి శౌరిఁ దలఁచుచున్. ౮౧

వీరబాహుఁడు కైవల్య మెనయుట

సీ. చండికామనురాజజపములు, ముప్పొద్దు
లం గుంకుమార్చాకలాపములు, కు
మారికాసేవలు, మహితమార్కండేయ
పూర్వపురాణార్థబోధనములు,
నిగమపారాయణనియతులు, భగవతీ
సచ్చరితామృతాస్వాదనములు,
నావరణావాహితాఖిలదేవతా
సంపూజనము, లహస్కరునికొలువు,

బలులు, దోలఁగనివిధి మేలివార్వములకు
బాలతృణముఖవితరణపద్ధతులును,
వలుల నేఁటేఁట నవ్వీరబాహుఁ డాచ
రించె నవయామినీవ్రత మిషమునందు. ౮౨

తే. అన్నెఱిం గొన్ని యేఁడులు సన్నమీఁద
మెల్లమెల్లన కొని తన యెల్లరాజ్య
మాత్మజామాత్యహితగణ మాత్మ నలర
నేలెఁ గికురించి శత్రుస్వఃపాలన మిల. ౮౩

తే. వింటె విశ్వంభరేశ! నిష్కంటకముగ
నేలి నేల యజ్జనపాలమౌళి తుదిని
బాంచభౌతికదేహమ్ము వదలివైచి
కామకలయంద జ్యోతియై కలసి వెలసె. ౮౪

గజపూజ

తే. అవధరింపుము నీ వింక, నశ్వములకుఁ
బోలె దశమీదినమ్మున బుధులచేత
నొడువఁబడియె నేన్గులకును దొడరునిష్ఠ
నర్చ; తత్కర్త లలితకుఁ గూర్చువాఁడు. ౮౫

వ. కుముదమ్మును ఐరావణమ్మును పద్మమ్మును పుష్పదంత
మ్మును వామనమ్మును సుప్రతీకమ్మును అంజనమ్మును
నీలమ్మును నను నామమ్ముల నెలర్చుమహోద్దండంబులు

వేదండంబు లెన్నిదియు నెన్నిదిదిక్కుల నిలువంబడి
యున్న జ్యేష్ఠాయోగమ్మున నానానదీవిహగపాదపమం
డితమ్మును సుమేరుమేరుప్రముఖమహామహీంధరవరదుర్భ
రంబును ననేకయోజనాయామమ్మును, నతులితమ్మును
నవికలమ్మును నవు నిలాతలమ్ము నిమ్ముల మోవం దొడం
గిన వద్దాన జ్యేష్ఠాగతదివసం బాదిగ దశమిదనుక నిభ
నిషేవణం బఖిలసంపల్లాభకరంబు; మఱియు, నష్టమీ
పర్యంతమ్ము లోహాభిసారిక మ్మను కర్మ మ్మొకరుం
డవశ్య మ్మాచరింపం దగియుండు; నద్దాని తెఱం గెఱిం
గింతు; నూతనపతాకాలంకృతం బైన ప్రాగుదక్ప్రవణ
ప్రదేశంబునఁ జతుర్హాతుమిత మ్మతులితమ్ము మండప
మ్మొకండు నిర్మించి యందుఁ గృశానుకోణమ్మున హస్త
మాత్రప్రమాణము హోమకుండ మేరుపఱుపవలయు;
నస్త్రింబులు శస్త్రంబులు గదాసితోమరపరశ్వథమ్ములు
మున్నుగఁ గల నృపులయాయుధవిశేషమ్ము లన్నియు
నమ్మంటపాభ్యంతరమ్మున నిడం జను; నవల సమంత్రకం
బుగఁ దానమాడి శుచియై మడుగుపంచెలు దొడి పుడమి
వేలుపులనిండారినయాశీస్సులం గొని యవ్వారలతోడం
గూడి శుభముహూర్తమ్మున నియమితమంటపమ్మున కరు
దెంచి యనలుఁ బ్రతిష్ఠించి ఉకారపూర్వకంబులుఁ దల్లిగం
బులు నవు మనువుల నేయియు, శస్త్రాస్త్రమంత్రంబుల
ఘృతసమ్మిశ్రమ్ము పాయసమ్మును విధివిధానమ్మున హోమ

మ్మొనరింపవలయు; హుత శేష మ్మవ్యారువమ్ముల కిడ
నొప్పుంగాని చులుకదనంబున నర్మ్యేడన దిగవిడువ నని
ష్టంబు సేకూరు నంతియగాక ప్రత్యహమ్మును, ౮౬

తే. గొడువోనివి మేల్జాతిగుఱ్ఱములను
ద్వీపవరముల గొనెనల ముత్తెములసరులఁ
దివిరి కయిసేసి యూరేగఁ ద్రిప్పనొప్పు
నాట్యఘోషాన్వితమ్ముగ నగళులందు. ౮౭

వ. అని హోరోగిరఫుంజడదారి యరుదారిననెనరునం గ్రిక్కిఱి
సిన మనసున సావధానుండు వసుంధరావరునకుం దెలియ
నుపదేశించె. ౮౮

తే. అనుడు. శౌనకమౌని లోహాభిసారి
క మనఁగ నెది, యాపేరు కలిగె నెటులు
దాని, కెయ్యది విధి, సవిస్తరముగ నెఱిఁ
గింపు మని వేఁడుటః సూతుఁ డిటులు వలికె. ౮౯

ఉ. తొల్లిట లోహనామకుఁడు తుంటరిరక్కసి యొప్పు
వాఁడు; మేల్బల్లిదు నాతనిం బొదివిపట్టి వధించె ననిం
బులోమజావల్లభుఁ; డెల్లలోహ మిలపైఁ గలయయ్యది
పుట్టె వానిమేనవ్వల్లన; ప్రోక్తకర్మముఁ బ్రవర్తిలె వాని
యభిఖ్యమీఁదుగాఁ. ౯౦

చ. అనవుడు శౌనకుం డను మహామతి! యెట్టిఁడు లోహదా
నవుం,డనిమిషు లెట్టు లేమిటికి నాతనిఁ బోరన గీటడంచి, రే
యనువున లోహ ముష్పతిల నయ్యె, నతండ కతంబ యై
తగఁ జనితము లాయె నెట్టు లభిసారికకర్మము, లాకథా
విధిఁ, ౯౧

చ. విడువక మాకుఁ దెల్పు మని వేఁడుడు సత్యవతీతనూజు నే
ర్పడినకృపాబలమ్మునఁ బురాణరహస్యము లెల్ల నల్లొనే
రెడులుగఁ జే నెసంగుకృతి, ద్రైస్సిన సంస్కృతిపేరిపాశవుఁ
ముడులుగలాఁడు, ఖ్యాతుఁ, డతిపూతుఁడు సూతుఁడు
వల్కెఁ బ్రీతుఁడై. ౯౨

వ. మునీంద్రులారా! ము న్నయ్యాదియ వినం గోరిన పృథు
రాజన్యమణి కమ్మునితిలకుండు నారదుండు నొడివిన
తెఱంగు మీకుం గుతుకమ్మున వినుచువాఁడ వినుండు.

లోహాసుర వృత్తాంతము

సీ. చెలఁగి రాయంచవజీరు ము న్నొకతఱి
బ్రహ్మ మెఱుంగు తపసులు వేలు
కోటులును బలసి కొలువఁగఁ గొలు వుండి
యెఱుపులై వెఱ నెఱయించుకనులఁ
గఱకఱియై మేరు కఱిడాలు లీనంగఁ
గ్రైదుటం బొడకట్టినట్టి

ము న్నెన్నఁ డెఱుగని పురుషు నవ్వేడువానిఁ
బాడగని నివ్వేళ పాడము నెవఁడ

వీ వటంచు నడిగె; నెఱుఁగవో నీదు నె
మ్మేని చెమటవలన నీనిమేష
మునన యొదవినాఁడఁ బుత్త్రుఁడ నవుదు నీ
కే నిజ మ్మనుచు వచించె నతఁడు. ౯౪

క. అనఁ దోఁకొను నానంద
మ్మునన శతానందుఁ డాత్మఁ బొంగి పొరలుచుఁ
దనయా ర మ్మని దిగ్గనఁ
దనకౌఁగిటఁ గూర్చి పేర్చి తరలని ప్రీతిఁ. ౯౫

వ. పోరోగిరపుంజడదారిపుట్టువునకుం గారణంబైన తనతోడం గూర్చుండఁ నిడుకొని ద్వితీయ ర్తృతీయచరణంబునం జనిం గన్న యన్నల్లని మొయిళుల నిగనిగలతో మేల మాడు నోడులుగల బుడుతనికి లోహం డనుపే రిడియె; నంతఁ గొండొకవడికిఁ గొండికవాఁ డయ్యు నవ్వింతవాఁ డెల్లరు ససంభ్రమంబుగం గనుంగొనుచుండ నంతై యంతంత నింతింతై కొలందికి మీఱి వింజంబుం జీరికిం గొనక యనేకయోజనోచ్ఛ్రాయమ్ము కాయమ్మునం బెరిగి పెరిగి మోవం జాలక కలగుండువడు జగత్స్రష్టయుత్సంగం బునయుండి యల్ల నల్లన జాఱి సత్యలోకమ్ము పొలి మేరలం దాఁటి నాకమ్ముగుండ కొండలం బిండి పిండి

యొనర్చు ధాటిం బిడుగుపడువున నిలాతలమ్మున గుభా
లునం బడియె. ౯౬

క. లోహాశనికల్పుం డా
లోహునిపాటున నదరి కలుగుకలఁతన్ శే
షాహీంద్రుఁడు వ్రాలిచె ఫణ
సాహస్ర మస్పృక్కు గ్రక్కు సాహస మడరన్. ౯౭

వ. అవ్వడువునం బడి భీమరూపుం డా డింభకుండు కొండ
గుహంబోలిన తనవదనగుహం దెఱచి క్రక్కున వెక్కి
వెక్కి యేడువం దొడంగె, నప్పుడు, ౯౮

క. దిక్కులు పిక్కటిలెన్, వెఱ
బిక్కమొగ మ్మిడియె దెసల ద్వీపవరము, లిలం
జుక్కలు ఱాలెన్, సురలకు
రక్కని గడియలు వడియెఁ బొడముదడ గుండెల్. ౯౯

తే. కాంచి కాంచనకంజాతగర్భసూతి
తనతనూసూతిపాటు వాత్సల్య మెసక
మెసఁగఁ ద్రావించెఁ బీయూషరసము వాని
చే జరావ్యాధిముఖములు జెనకకుండ. ౧౦౦

తే. ఆ సుధానుపానమ్మునఁ జేసి లోహుఁ
డాతఁడై వజ్రకాయుఁ డే యాటు పోటు

దగులు దాఁకును నడరక మిగులుకడిమిఁ
దెచ్చె నొక్కకొలికికి జగచ్ఛయమ్ము. ౧౦౧

లోహుఁడు విజృంభించి సురపురిపైఁ దండెత్తుట

సీ. కోటపేటలనీటుమాట గీటునఁ బుచ్చి,
పల్లెపక్కణములపరువు సెఱచి,
వీరముఖ్యులు జేండ్ల బీర మాఱడిపుచ్చి,
పుడమివేల్పులపేరు బుగ్గిఁ గలిపి,
తబిసిజనమ్ములతపములు తుడిపించి,
పుణ్యకాననములపులుఁగు మాపి,
కలనేని దొరక కావులఁ బట్టి పాలార్చి,
యాగకర్మమ్ముల కడ్డు దవిలి,

కలఁచి నేలకు గోలకుఁ గాఁ గడళ్ళ
గతులు గొనివచ్చి, యతలమ్ము కుతల మతల
కుతలముం జేసి లోహుఁడు కోణపప్ర
భుండు సెలరేఁగె మితిమీఱుదుండగముల. ౧౦౨

చ. సురలకు గుండెతల్లడము, సూరులకాళులలోని ముల్లు,
ఖేచరులకుఁ బ్రక్కబల్లెమును, సాధ్యులడెందములోని
కొఱ్ఱు, కింపురుషులకొంపలోఁ జిలువ, భూతగణమ్ముల
కంట నలక, కిన్నరులాడినున్న చిచ్చతఁడు నా భువన
మ్ములు బూరి మేసెడుఁ. ౧౦౩

వ. ఒక్కతఱి నక్కఱకురక్కసి రక్కసిబలంబులు లెక్కకు మిక్కిలిగఁ గూర్చుకొని నిష్కారణమ్ముగఁ గొన్నవైరమ్మున సునాసీరుపేరు రూపుమాపుజతన మ్మనివార్యమ్ముగ నమరావతిం జుట్టుముట్టి రెట్టించినయాటోపమ్మున.

సీ. గోపురద్వారపంక్తులు గ్రొచ్చి గోరాడి,
గోడలపెనుబండ లూడఁ దన్ని,
వప్రమ్ము లగలించి, పరిఖలు పూడిచి,
బురుజులు తాఁకునఁ బొడులు సేసి,
మందిరమ్ములు నేలమట్టమ్ము లొనరించి,
నడికప్పులం జిచ్చు ముడిచి పెట్టి,
విరిదోఁటలఁ జెట్టి విఱిచి ప్రోవులు వెట్టి,
కాలువక్రంతలక్రం దడంచి,

కొట్టములఁ గూల్చి, యేన్గుల ఘోటకములఁ
జఱచి యఱచేతులం దప్పి చావు కనులు
లొట్ట వోయినవానిఁ జల్పుచు సువర్గ
ముం జమును సేయఁ గడఁగె నేపునఁ జెలంగి. ౧౦౫

వ. అట్లుఖర్వమ్మున భుజాబలగర్వమ్మునఁ గను మిను గానని యయ్యసురబలంబులయులబలంబును దొడరినదుడుకుఁదనంబును సమగ్రింబుగ నెఱింగి పురందరుసారథి మాతలి యరదంబుం దోలుకొనుచు నొకరుఁడ వడివడిం బఱతెంచి దూరమ్ముననుండియు ప్రముక్కడిరక్కసిమూఁక లొనరుచు నచ్చోటి పచ్చిబూతుం దిలకించుచు నున్ననన్న నెట్టెటో

పాడకట్టి యప్పట్టున రెట్టించిన కెలసమ్మున నాకసమ్మున
కెగరి గరుడుండు నిడుపనివడువున లోహదేహుండు లోహ
సురవరుం డాతనిమేఁ దొండిలివోవం దొడికిలి పట్టి
యిలకు లంఘించి కూబరంబు నుఱుమై చక్రమ్ములు చిదు
పలై పో నరదంబు గాలం దాఁచి యేచి యంజలి గుం
జలి యార్చి పేర్చుచు మాతలిం బయి కెత్తి గిరగిరం ద్రిప్పి
విసరి పురీమధ్యభాగంబునం బడం బాఱవైచిన, ౧౦౬

ఉ. నోరన క్రమ్మ నుచ్చిలి, కనుంగవ మూఁతలు విప్పు లొప్పు
టఁ దారలతీరు మీఱ, వదనంబు మెఱుంగు దొఱంగఁ,
జెమ్మటల్ దారలుగట్టఁ, బుట్టినవడంకున నెమ్ములు పిండిగా
సునాసీరుపదమ్ములం బడియె శీర్షము వ్రేలఁగ వైచి
యాతఁడుఁ. ౧౦౭

వ. అంత నెంతేఁ దత్తరమ్మున నుత్తలంపడుచు త్తమ్ముల బృందా
రకబృందంబులును బురందరుండును గజిబిజియై యడలి
హడావిడి పడుచు నట్టునిట్టయి యొకట్టులు దిటవుం బూని
మొగమ్మునఁ జల్లనినీళ్ళుం జల్లియుఁ జెవులు మూసియు
నమృతరసమ్మునం జాది యాశ్వీను లొసంగిన గుళికలు
నాలుకకుఁ రాచి నాకించియు విన్నవియుఁ గన్నవియు
నేర్చినవియు నుపచారంబులు వేనవే లొనరుచుడుఁ
గొండొకవడికిఁ గృత్యాద్యవస్థపయిఁ జావు దప్పి కనులు
లొట్టవడి తోఁకకుం దిగినప్రాణం బొయ్యన దయ్యము
నెత్తికోలునం జేసి మెల్లమెల్లనఁ దలకుం బ్రాఁకఁ గన్నులు

విచ్చి హెచ్చుగఁ బొంగి పొరలి వచ్చు దుఃఖం బాపు
కొనుచు లేచి కూర్చుండి వజ్రికిం బ్రణమిలి యతం డడు
గుడుఁ దనవడిసగోడు నడుమనడుమ నీళుల నాలుకఁ
దడుపుకొనుచుఁ దూచా తప్పక పూస గ్రుచ్చినమచ్చునఁ
దెలియం జెప్పిన విని. ౧౦౮

సీ. అనిమిషనాథుండు నక్షిగోళములనుం
డియు రాల జలజల నిప్పురవలు
కొనకొనుకినుకమైఁ గొఱుకుచుఁ బటపట
ద్విజపం క్తిఁ గరమున భిదుర మెత్తి
కత్తి కొక్కఁడు కండగాఁ గోసి కసి వ్రోవ
నక్కఁశరకసియుంగ మిడుదుఁ
గాకులకుం జీకుగ్రద్దల కని పలు
పోకలం బోవుచు వీఁక మెఱసి
యాహవోద్యోగ మతులమై యతిశయిల్లఁ
ద్రిదశవీరులు వేనవే లెదిరి లేని
కడిమి గలవారు వెంట రాఁ గదలె వెల్ల
యేన్గుపై నెక్కి లోహాక్ష్యు నెదురుపూనిక. ౧౦౯

దేవాసురసమరము

వ. అట్టు లాయోధనదుందుభిస్వనమ్ములు సెలరేఁగి చెవులకుం
జెవు డొదవింప సరభసంబుగ రక్కసిమూఁక లున్నెడకుం
గ్రన్ననం బఱతెంచి, ౧౧౦

మండుచు నిండి బ్రహ్మాండభాండ మ్మగ
లించుబెట్టిదపుటులివు సెలంగ
ఱివ్వునఁ బఱతెంచునవ్వజ్రివజ్రమ్ము
వజ్రదేహుం డస్పృశ్యప్రభుండు
శ్యేనమట్టులు మింట నెగిరి తాఁ దొడికిలి
పిడికిటఁ బట్టుక నడిమిత్రోవఁ
గడళులును దెసల్ గలగుండుపడఁగఁ గూఁత
లిడుచు నాయోధనోత్సాహ మడరఁ గేలఁ
బవియ మేలిసాధనముగ వఱల వేలు
పులెకిమీఁనిపై దుమికి యచ్చలము వెనిచి. ౧౧౬

సీ. పసరమ్మువడువున విసువక చామోది
విగతచేతనునిఁ గావించె, మిపుల
రక్తధారలు గ్రక్కుఁ వ్రణములమేనితో
గిరిభేది పూచినకింశుకమ్ము
ననుకరించుచుఁ దప్పి యను వప్పురు సప్పురై
చెడి నెఱి యొఱగెఁ జేడ్పడఁగ సురలు,
తొండమ్ము చేపట్టి త్రోచి రా దిగిచి మే
నంజలి గుంజలి యార్చి పెంచి
తఱుఁగువడనిమగంటిమి దనుజవిభుఁడు
సడల సంధులు సంధులుఁ బొడిచి పొడిచి
కాళ్ళు దొడలుఁ దఱిఁగి చీకాకువఱుప
వెల్లయేను గూడనిఁబాడె వేల్పుదొరతో. ౧౧౭

వ. అంతం బోవక పావకోద్గారిదారుణనేత్రవివరుండై గండడరి
గండరగండం డప్పాలదిండ్లదునీఁ డాత్మీయబలంబుల కుల్లా
సంబు దీపింప సింహనాదంబు సేయుచు నవ్వారిజయ
సూచకమ్ము లారావమ్ముల కొండ లుప్పొంగ నప్పట్టునఁ
గురంగంబులపయి సింగంబు తెఱంగున నాటోపంబు నిరా
ఘాటంబుగ వేల్పులకూటువమూఁకపయిం బడి పొడు
చుచుఁ జిదుముచు గఱచుచు విఱుచుచు నేలం బెట్టి
కాలన్ రాచుచుఁ బెక్కు తెఱంగుల నెక్కడివారి నక్కడన
యుక్కడఁచి ముక్కులు చెవులు కాళ్లు చేతులు నని
యేరుపరుపరాకుండం జెండాడి చేతులతీట ప్రోవన్ ఘోట
కమ్ములఁ గాటం గలిపి యేనుంగులఁ బీనుంగులఁ గావించి
మించినదర్పమ్మునఁ దమ్మికోలను మదపుటేనుంగుచాడ్పు
నం బగతుఱ సేనలఁ గలగుండువఱచి నేలకుం గోలకుం
దెచ్చినం బిచ్చలించి సుర లసురుస్సురై యవురుసవురై
యరవరలై గజరుగజరులై గగ్గోలై గగ్గులకాండ్రై
బెండాబెడగై చిందరవందరై చీకాకై పలపలనై వెల
వెలనై యల్లడతల్లడై పల్లటీలై మల్లామడియై తారు
మారై తక్కిరిబిక్కిరియై తక్కె, ౧౧౮

క. అలవు సెడి యడఁగి పోఁడిమి
తలబీకనకాయలై యథాయథలై కూ
కులు వత్తులు నై కూరా
కులు నై యని నిలువలేక కుతిలంపడనై. ౧౧౯

వ. ఎప్పటిటో యోపి యూడనింబాడినవారును నయ్యేడన పడి
బడల్పడువారును నై నొచ్చి చచ్చినచావుగ నగడు గుడు
వఁగనయి; రటు లైరావణమ్ము వారణమ్ము మాఱుమొగ
మ్మిడి పొలికలనిందాఁటి బ్రతుకు జీవుఁడా యనుచుం
బాఱి పాఱి తుండమ్మునం దడి యెండి వినువాకం బడి
యొక్కరెండు గ్రుక్కలు నీళులు పీలువం దొరంకొనునవస
రంబున, ౧౨౦

తే. ఒడ లెఱింగి యింద్రుఁడు తనయున్న యునికి
కిం గడుంగడుం ద్రప యంతరంగసీమఁ
దొగలింపఁగ డిగ్గి మాతంగమల్ల
మెల్ల నిదియా మహేశిమహిమము యనుచు. ౧౨౧

చ. మనమున నిశ్చయించి యసమానసుభక్తినిరూఢవృత్తిహ
త్త నయనకంజములు ముకులితమ్ములుగా భువనేశి నానమ
జ్జనగణగేహకల్పలతఁ జండకముండకముఖ్యదైత్యఖం
డనకలనాప్రవీణఁ గరుణావరుణావసథ న్నుతించెఁ దాఁ.

క. ఆపాకశాసనునుతి
వ్యాపారపరాయణతకు నరుస మెసఁగి స
త్తాపప్రశమని త్రిపుర మ
హాపంచాస్యాధిరూఢ యై యగ్గమ్మౌ. ౧౨౩

క. కొని జేజేదొర జేజే
ల్వొని యని మొన నిలువ లేమి వెలయేనుఁగుతో

డ నివృత్తిం గన్నవితం
బనియె దయం బొలుచునోడుల నతనికి నిమ్మే. ౧౨౪

మ. విను రాయంచవజీరుమేలి మెఱు దా స్వేదాంబుపూరంబు
పుట్టునకుం బెట్టినవిత్తుగా నడర వాఁడుం బల్పుఁ బొ ల్పేది
యొయ్యన మీఁబువ్వను ద్రావి క్రొవ్వి కొఱకచ్చె య
చ్చల మెచ్చ నెందు నవార్యమ్ములు శౌర్యధైర్యములఁ
గ్రిందుగా మీఁదు గానండు సూ. ౧౨౫

తే. అమృతముం ద్రావి కఱకటిమై ప్రమత్తుఁ
డైన వానికిఁ గూరిమి యడర నల్మో
గమ్ములదానిఁడు నురక వరమ్ము లీవి
యగ్గికం గాలి తోడ్పడినట్ల యయ్యె. ౧౨౬

తే. అది యెఱుఁగ కజయ్యుఁడ వాని నెదిరి పదరి
కడఁగి పెనఁగి తుదిగా ధృతి యుడిగి మడుగ
వలసె నీ విట్లు, కెడప నప్పొలసుదిండి
తేనిఁ గలదు వెర వొకండు నే నెఱుఁగుదు. ౧౨౭

శ్రీదేవిమోసమున లోహుం డుసుఱు దొఱఁగుట

వ. ర మ్మింక నకార్యమ్ము సాధింపం గలవార మని తన్మృదు
కరపల్లవస్పర్శమ్మునఁ దొంటివ్రణమ్ములమంట లడంగి
దెస లదురు భయంకరాట్భటిగా ఘీంకరించుచు నై రావణంబు
పయి నధిరోహించి యమ్మించులదొర తనవెనుకన రా

మేలిసింగంపుతత్తడిపయిం గులుకుచు భువనసమూహమ్ము
నొక్కపెట్ట మోహంపువలలం గట్టిపెట్టి యిట్టట్టు సేయ
నోపు మనోహరరూపరేఖాకలావిలాసమ్మున దెసలు వెలి
గించుచు నాజగన్మాత వాతమ్ము నతికరించునతిత్వరితగతిం
బాలికలను డాయం బోయె; నాయదనున, ౧౨౮

మ. కని యంతంతన పండువెన్నెలలచొక్కాటంపుమేల్నిగ్గు
నవ్వునవ్వోన్మేషముతోడినవ్వుమొలకల్ పొల్పారునెమ్మో
ము, చల్లనినుజ్జూడిక్క, పసిండితీవ యఱకాలం దన్ను మైవ
న్నెచెన్నెనయం జందురురేక యాదల రయం బేతెంచు
నయ్యంచితక్. ౧౨౯

తే. మఱచి సంగరరంగముమాట మంత
రంపునీళులు సల్లినరకము మెఱయ
వివశుండై లోహకోణపవిభుండు తలకు
మిగులుమోహసాగరమహోర్మికల మునింగె. ౧౩౦

వ. అచ్చోం గాల్నిలువక పరుంగువాఱుచు, ౧౩౧

చ. ఎదురుగం బోయి, దోయిలి ఘటించి, సముంచితస్థితిం
గుదురుకొనక్ వినీతగతి, కూళతన మ్మఱి, నమ్మం బల్కె ని
ట్లదితిసుతానుపాలనమహావ్రత! సువ్రతమృగ్యరూప! నీ
మృదుపదసేవకుండ, నను మేకొనుకూరిమి నేలు మంబికా!

క. పలుకులపొలఁతుక చెలువున
కల మలదొరకూఁతుమగనికైనం గనులం
దిలకింపరాని నీపద
ములు విమలములు గనుఁగొంటి ముక్తతఁ గంటిన్.

తే. విశ్వరక్షాధురీణ! పోవిడిచి కొంకు
కొసరు మది నియోగింపు మీకూర్చు సేవ
కప్రవరు నెంచి వచ్చినకర్జమం ది
తం డొసఁగువాఁడు కండలు దఱిఁగి యైన. ౧౩౪

వ. అన నమ్మాయామయోద్యోగిని భోగిని యిట్లనియె.

శా. వత్సా! లోహక! సాహసంపుబలుకుల్ వల్కంగ నేలా
యిటుల్? త్వత్సత్యవ్రతరూఢి ధర్మనిరతత్వమ్మన్యమే నా?
కెదన్ మాత్సర్యమ్మున కింక స్వస్తి యని సమ్మానమ్ముమై
నింద్రుతో నైక్యమ్మునఁ గల్పి చేయిచెయి సఖ్య
స్ఫూర్తి వర్తిల్లుమా. ౧౩౬

తే. అదియ నాకు నీవలనఁ గానయినకర్జ
మనుడు ధన్యుఁడ ననుచు నెక్కొనినయురుస
మున మునింగి లేఖర్షభ! జననియాన
నుండువార మిర్వుర మింక నొకకుతుకగ. ౧౩౭

క. కలదే నీనానడుమన్
నలుసంతే భేదభావన? మ్మొఱుఁగమి నీ

లలి దాపురించెం గా, కీ
తొలఁగనికలహమ్ము కాలు ద్రొక్కెకొను చనా! ౧౩౮

క. ఈనాసర్వస్వము త్వద
ధీనము, పులిపాలుఁ గొంచుంఁ దేఁ గొంక కెరఁ
నీ నొడువు చేఁతలం బడి
యే నిరతము మెలఁగునాతఁ డీతఁడు మఘవా! ౧౩౯

వ. అనుచు నుక్కవంపుసొక్కుం దక్క మిక్కటమ్మైన యక్కటికమ్మునఁ గక్కున నక్కునం గ్రుచ్చి యెత్తిన, మునిముచ్చు వేకన్నులవేలుపు మనసిచ్చు నెచ్చెలిమిచ్చున నొకకొంత ప్రసంగంబు సాగించి మాటలవరుసం బడి యడిగినవరం బిత్తుఁ గోరుకొమ్మని యమ్మానిసిదిండీనిచే నొడువంబడి యప్పటికప్పుడ, నాచే నిహతుండ వవునటు లభీష్టం బొసంగు మని వేఁడి, యటులన యనిపించుకొని, కించం బొరయక దాయచే నున్న వజ్రమ్మం గొని, మున్మొనవాలుదాలుపు వేలుపునకేనియు ననిమొనఁ దేటి పాఱఁ గనరాని వాని యుత్తుంగ మంగమ్ము ఖంగుఖంగునఁ గండతుండెమ్ములుగ నటికి ప్రోవులు వెట్టుడు, ౧౪౦

తే. అల్లనాఁడు తాఁ ద్రావినయమృతరసము
మహిమఁ దొఱఁగక యుసుఱు, దుస్సహము బాధఁ
జాల నొచ్చియు సురమాళిఁ దూలనాడఁ
బోక తాతం దలంచె నప్పుణ్యజనుఁడు. ౧౪౧

చ. అతులవిహంగపుంగవశతాంగయుతుండు రథాంగపాణికిఁ
సుతుఁ డవు నంచవారువపుజోదు వినీవినమిఁ సుతా ర్తి
దైవతములు పోవ్రుత్రోవఁ బడి పర్విననుర్వులు గ్రక్కుఁ
చుఁ జవోద్ధతిఁ బఱతెంచి నెత్తురులదారలఁ దోఁగుతదం
గఖండముల్, ౧౪౨

బ్రహ్మ లోహునితనూఖండములు లోహములు గావించుట

సీ. కడఁగి కాలువ గట్టు కన్నీటిజాలుల
నెడలించి నల్ల డొక్కఁడు నొకఁడుగఁ
దడవుచుఁ బొడఁగని కొడుక! మూడిం జొరి
వాత వెళ్ళెడువాఁడ వీతఱిం బొ
కాలుగతిం గొంటె కటకుదయ్యమువాత
వడియమై దయ్యాలవలఁ దవిలి?
క్రాలెఁబో శ్రీమాతకరుణాకటాక్షమ్ము
నింతకు మనపయి నీవిధాన!

ననుచు వాపోయి, యొకకొంత మనము దిటవు
పఱిచి దరికొన్న వ్రణముల బాధ నుడక
నట్టు నిటు గాక కొట్టుమిట్టాడుకన్న
నుసుఱుసనుపనిఁ గొన నిఁక నొప్పు లోహ! ౧౪౩

చ. కొస రొక కాసువీసమును గ్రుడ్డివరాటము పాటి కొంకు
లే కసురలదాయ యామఘువుఁ డర్థియొనర్చినమాత్ర
నెంతో సంతస మఖలేశికిం గొలుప దత్తభవత్తనుఖండ

కాండముల్ పొసఁగుత మూచు లోహామయముల్ భువ
నోపకృతిప్రసిద్ధముల్. ౧౭౪

తే. కదురు నఖిలమూలత లోహకల్పము భవ
దంగమున జనితమ్ము లోహంబు నఖిల
మూల శ్రీమాతతోఁ బాటు పూజనముల
గొనునుగావుత మిషమున ననుసమమ్ము. ౧౭౫

చ. ఎనసినమూఢవృత్తి నెవఁ డేడవుమాసమునందు లోహ
పూజన మొనరింపఁ బో డపయశ మ్మను చీఁకటినూతఁ
గూలి గొల్లునఁ బలవించుచుఁ జెడును లోహముయోత్త
మసాధనాళి స్యందనగజవాజిపంక్తులుఁ బదాతులు రూ
పఱి తానునుఁ నెఱిఁ. ౧౭౬

చ. అనుచు వరమ్ము లిచ్చి ముదితాంతరుఁ డాత్మజుప్రాణ
వాయువుల్ తనమెయిఁ జొచ్చి యెచ్చినపదంపడి నాల్గు
మొగాలవేల్పు శ్రీజననికిఁ బాదవందనము సల్పి శతక్రతు
గారవించి వే చనియె మరాళవాహుఁ డయి సత్యపుర
ప్రవరమ్ము సేరఁగాఁ. ౧౭౭

తే. అదియ మొదలుగ నాచార మయ్యె నాశ్వి
నమున లోహార్చనమువిధాన మ్మనూన;
మింటిముంగిటికల్పక మిద్ది లేని
లలితకొలువు డల్ల చవిటిపొలముజల్లు. ౧౭౮

వ. అంతియ కాక, తల్లోహాశ్వాభిముఖుల నెలవులం బాయక దినదినమ్మును శస్త్రబాధ దుర్నివార్యంబై పీటం బెట్టు; దుఃఖదారిద్ర్యోపశమనంబునకును విజయపరంపరావిలసనంబునకును లోహానిషేవణంబు పెట్టినదిపేరు; ఇయ్యదియ పూర్వోక్తలోహాభిసారికాఖ్యక్రియాకలాపమ్ము; ఇంక వేర్వేఱ ఛత్రాశ్వపతత్రిప్రవరద్విరదధ్వజాదుల పూజామంత్రంబు లెఱింగింతు నంతరంగ మవహితతమమ్ముగ వినునియతికిం గమ్ము. ౧౪౯

ఛత్రాశ్వాదిపూజామంత్రములు

తే. కడఁగుతమి బాలమున్నిటికడుపుపంట
పంటవలఁతినిబోలె నృపాలమౌళి
నన్నివేళలఁ బాళిమై నావరించి
విభవములు సమకూర్పుమా వెల్లగొడుగ! ౧౫౦

వ. అని ఛత్రమ్మును, ౧౫౧

సీ. విలసిలె గాంధర్వకులము నీపుట్టువు
కతన వాసియు వన్నె గడనసేసి;
కూరుపకుము తప్పిదారినయేఁ బాలఁ
బోలువంశమునకుఁ బోనిమచ్చ;
ప్రాఁబలుకుల వేల్పు పలుకునికమ్మునఁ,
జలువలరానీటిసామినీటి

పాపలదా ప్రభావమునతిశయమున,
గ్రహరాజు తేజమ్ము కలిమి పేర్మిఁ,

దపసిమిన్నలతపమునఁ, దపసిరాతు
బ్రహ్మచర్యప్రశస్తిని, వఱల రాజు
కొడుకుఁదనమును గౌస్తుభ మెడఁదఁ దలఁచి
యలరునెఱె మెఱయింపుమా హాయమ! తేని. ౧౫౨

క. కుదురుకొనన్ మోఱకుఁదన
మెద మొదవులఁ దల్లిఁ దండ్రి నిలవేల్పులఁ జం
పుదగరయాటు లని నయిదాం
బది సేయం దొడరుతేఁడు పరువు దొఱంగున్. ౧౫౩

క. అవిరళగతిఁ దారలుఁ ద
ద్ధవుఁడున్ జెయిదములసాక్షి తనరారెడుదాఁ
క వసుంధర దురమునఁ బెఱు
తివియుజనపునపయశమ్ము తీఱక నిలుచున్. ౧౫౪

క. అని కెత్తి వచ్చుదాయల
మొనకాఁడై యుక్కుతున్క పొలుపునఁ దగి గీ
టణచి జయేందిరకయిఁ గొన
జనపతికిన్ వరము హాయమ చాలినతోడౌ. ౧౫౫

వ. కావున, ౧౫౬

తే. పాలమున్నీటఁ బొడమిన వేలుపులకి
మీనివార్వము సురకాని కేనిఁ గొనని
ధాటి నాటోప మడర భీదములు కదన
భూములం గూర్పుమా జయములు హయంబ! ౧౪౭

వ. అని తురంగమపుంగవంబును, ౧౪౮

సీ. గోపకన్యాభుజంగునకు వార్వమ వయ్యు,
నల భుజంగాళికి యముఁడ వీవు;
సతము నాశుగత్రోవఁ జరియించుదణి వయ్యు,
గఱులతాఁకున నాశుగములు సెఱుతు;
పులుఁగులకొలపుం గడలికిఁ జంద్రుఁడ వయ్యుఁ,
బులుఁగుమాయింతు శత్రులబలమ్ము;
శ్రుతిమూర్తివై సురస్తుతికిఁ బాత్రమ వయ్యు,
శ్రుతిపుటమ్ములజాడఁ జూప వీవు;
కలితదివ్యప్రభావ! నీయలఘుగరిమ
మున్న దున్నట్టులే యెన్న నోపువారె
బంటినూర్ల మొగమ్ములపాఁపతేడు
పలుకుజవరాలిచెలువుఁడు వైనతేయ! ౧౪౯

తే. పావకప్రభలు వెలార్చి జేవురైన
చూడిక పఱపులఁ బగఱయసుఱులు ద్రావి
జయము గూర్చుచునుందు ధ్వజమున నిలిచి
చక్రధరున కీవు సుపర్ణ! సంగరముల. ౧౫౦

తే. తొలఁగ కెవ్వేళఁ బొలదిండ్లగలమున నుఱి
 త్రాఁడు కటివేళ్ళ నీయెడందన వసించు;
 నస్త్రశస్త్రాళి నేమఱ కరసి ప్రోచు
 చరుల సదమద మొనరింపుమయ్య గరుడ! ౧౬౧

వ. అని పెనుబాఁపకవణంబులకొలంపుదేవరను, ౧౬౨

సీ. కుముదము, నైరావణము, పద్మపుష్పదం
 తములు, వామన మనఁ దనరునద్రి,
 సుప్రసిద్ధమ్ములు సుప్రతీకాంజన
 నీలముల్ నాఁగ నెన్మిదివలఁకుల
 దొరలయేనుంగులుఁ, దొడరి యవ్వానివం
 గడమున జనియించి గహనగహన
 భూములఁ దిరుగాడి పొలుపారు భద్రమం
 దాదులపేర్వాసి నవఘుళించి,
 వసువు లాదిత్యులును మరుద్వరులు రుద్రు
 లొసఁగునాశీఃపరంపర పొసఁగ వజ్ర
 కవచముగఁ గాలదండానుకారిభూరి
 తుండ మమరఁ గూర్పుము గెల్పు దొరకు నిభమ!

మ. కుముదాప్తుండు, రమావరుం, డనిలుఁ, డయ్యండుఁ, సు
 వర్ణాద్రి, స్వర్గమునేలోపేటరి, రుద్రుఁడుం గరుణామైఁ బ్రా
 పింపఁ బాలింత్రు గాత మజస్రమ్మును నిన్ను మేల్సిరి,

బలౌద్ధత్యమ్ము, వేగమ్ము, తేజము, స్థైర్య, మతిధైర్యౌఘ్యముం,
గెలుపు, ప్రాంచదోద్భగమా! నాగమా! ౧౬౪

వ. అని మదమలినగండమ్ము వేదండమ్మును, ౧౬౫

క. లలిని వలఁకులసుబాదా
రులు వేలుపులపడవాలు రూఢిం గను తే
జులతో సత్తులమొత్త
మ్ములుఁ దపసులు నిలుచువారు మొగి నీయెడలన్. ౧౬౬

క. ఖరకరు లోకవేవ్రతో
సరిపోలినప్రభలఁ గులుకుస్యందనముతలం
దిర మగు నిను బరికించిన
నరు లఱరే వెన్ను విఱిగి యనిమొన ధ్వజమా! ౧౬౭

వ. అని పతాకికావితానమ్మును, ౧౬౮

క. పరఁగుదు వసివిశసనజయ
దురాసదవికర్మఖడ్గదుష్ప్రేక్ష్యోర మో
దరధర్మాధారాఖ్యల
నరిశీర్షాహరణభయదమా! యడిదమ్మా! ౧౬౯

మ. అరయం గృత్తిక పైపరామఱికదా, రాఁబోతు బాబా
పయిన్ ధరజం గూడి చరించుసామి గురుఁడున్, బంగారు
రంగారు మేన్, సిరియన్గుం జెలి తండ్రి నీకు నవ్వు సూ; నిన్

దాఁకి వెన్నిక పోరరిపుల్ కాలునిప్రోలు జూడఁ జనుతీ
రుం బొందరా ఖడ్గమా! ౧౭౦

క. మును ధర్మాధారమ వై
చెనసినయఁనుపమితధాటి శ్రీచండికచే
త నిగనిగ లెగయు నాఁడుచుఁ
బొనరించితి మహిషునొడలు ముక్కలు ముక్కల్. ౧౭౧

వ. అని యాదోధనాభీలమ్ము కరవాలమ్మును బూజించి యావరణమ్ముల వేదిపయి నునుపంబడిన తక్కుంగల యాయుధవిశేషమ్ములను ననువవు మనువుల నవికలస్థితి నర్చింప నొప్పు; ననంతరంబ, ౧౭౨

తే. బీటు వ్రాకొక శూకమ్ముపాటి వజ్రి
వజ్రఘోరధారాహతిఁ బవరములలొ
కన్నుఱెప్పచొ ప్పొప్పఁగఁ గరణయష్టిఁ
బ్రోచుచుం దనుక్షణమును బొందళమ్మ! ౧౭౩

తే. కాలపర్జన్యగర్జానుకారిభూరి
రావము సమస్తభువనవిద్రావణముగఁ
గొసరి పగతుఱగుండియల్ గూటఁ బెట్టి
దురములం గెల్పు లిడుము దుందుభివరమ్మ! ౧౭౪

తే. మెఱసి దశకంఠుకంఠముల్ దఱుఁగునాఁడు
దాశరథిచేతఁ, ద్రిపురవధావిధాన

మున హరుని చేతఁ, గౌరవహానవేళ
శక్రజుని చేఁ గొనినగెల్పొసఁగు శరమ్ము. ౧౭౫

తే. ముపురుమూర్తుల తేజమ్ము మూలకార
ణముగ నీనెఱేఁ దవుమేన నమరువిల్లు
పగఱకందనఁగాయుల వాఁడిముల్లు
మా జయమ్ములయిల్లు నై యోఱుఁ గాంచు. ౧౭౬

క. అంగడి పున్నెమ్ములకున్,
మంగళమున్ మంగళార్థమండలమున, శ్రీ
మంగళదేవీధవు చే
రంగారెడు నీ దరమ్ము రక్షించు మమున్. ౧౭౭

క. హిమకరుకరములతో వి
య్యముఁ గొని హిమడిండిరమ్ము నటు లుండు మనం
గమకించు పాండురసుషమ
నమరినచామర మడంచు నఘతామసమున్. ౧౭౮

చ. ఎలయక యెట్టిదిష్టముల నించుక యంచుక మొక్క, విష్ట
పమ్ములఁ గల సత్వమెల్ల నొక ముద్దగ నొద్దిక సంత
రించి, శ్రీలలితచెయిన్ నటించుచుఁ జెలంగితి శుంభ
నిశుంభముఖ్యదైత్యులతల లెక్కటించ దఱిగి యో ఛురికా!
తఱిఁ గావవే సుమున్. ౧౭౯

క. నలి నులి గా మేనులు గో
పులఁ బులికా పిడ సుజనులఁ బ్రోవం జేమో
ముల వేలుపు కూరిచె ని;
న్నలరఁగదే హేమదండమా! మాదండ౯. ౧౮౦

క. నానామణిగణఖచిత
మ్మై న్నేత్రనవాంబురుహామహమ్మై ధర్మ
స్థాన మ్మాసింహాసన
మీనోపు౯ జయము తేని కెకాలంబు౯. ౧౮౧

క. అరిభూధరపక్షమ్ములఁ
గరకరివై తఱేఁగి మెఱయఁగాఁ గడు నెఱఁ బా
తరలాడుచు నుందు సురే
శ్వరుకరమున భిదురమా! నృపతి దయఁ గనుమా. ౧౮౨

మ. అని తత్తన్మనుపాఠవృత్తి విధిఁ బాయంబోక సర్వాస్త్ర
శస్త్రనికాయమ్మును లోహనిర్మితములై రాజిల్లి యాజిం
బనిం గొన నా నాయుధజాలముం గొలిచి లగ్గుం జెందఁ
గా నొప్పు నాశ్వినమాసోక్త మహావ్రతాచరణసుస్థితుఁ
డు పూతాత్ముఁడై. ౧౮౩

క. పలుకుచెలి నేస్తిచెమ్మట
వలన౯ మెయిఁ బొరసి లోహవపువై తవు లో

హు లసన్మతిఁ గొలువనిజడు
నిలు నిలువునఁ దుడిచి పెట్టి యేగును సిరి తాన్. ౧౮౪

వ. అని వెండియు, ౧౮౫

క. తొలిపలుకులవేలుపుగా
దిలికొమరుఁడు పృథుమహీపతికి ని ట్లను ని
ర్మల! నవరాత్రమహావ్రత
మలఘువిధానమ్ము నింక నాలింపు మొగిన్. ౧౮౬

### నవరాత్రవ్రతరతదాతవ్యద్రవ్యాదినిరూపణము

వ. ఉదాహృతవ్రతశీలుండు తొలినాఁడు కేశంబు లలంకరించు
కొనుటకుంగావలసియుండు ద్రవ్యంబులును, రెండవునాఁడు
కుఱులు ముడిచికొనఁ బట్టుదారంబును, మూఁడవునాఁడు
మలినమ్ము గాక మెఱయునద్దమ్మును, సిందూరాల క్త
కంబును, నాలవునాఁడు మధుపర్కమ్మును, గస్తూరికా
తిలకమ్మును, గాటుకయు, నేనవునాఁడు పైపూఁతయు;
రవణమ్ములును శ్రీశివంకరికిం గింకరత్వం బేర్పడ నర్పణ
మొనర్ప నొప్పు; నాఱవునాఁడు సాయంసంధ్యాసమయ
మ్మున బిల్వతరుమూలమ్మున నర్చించి యేడవునాఁడు
ప్రొద్దుపొడుపునన నెలవునకుం దోడ్కొని రా నవు; నెని
మిదవుదివసమ్మున నుపవసించి మించునియతి విహితవిధి
విధానమ్మునఁ బదాఱు తెఱంగుల నోజ నించు పూజం
గావించుట లగ్గు; తొమ్మిదవునాఁడును వీడనినిష్ఠమెయి

నప్రచండిం గొలిచి బలికర్మమ్ము లాచరింప నొప్పుఁ; బదవ్రుదినమున నుపవాసదీక్షగదుర లలితకొలువు డవశ్యా చరణీయంబుగ నొడువంబడియె; నివ్వడువున నుక్తవిధిం బాయక సేవించునంచితుఁ ద్రిలోకజనని త్రిపుర సంతంబు నింబలెఁ గంటికి ఱెప్పయై యెల్లవేళల వీడక వెన్నంటి కాపాడుచుండు; నంమను నొక్క విశేషంబు గల దది యెది యనుదేని, యేనవ్రునాఁ డొసంగంబడిన గంధాలంకారతాంబూలపుష్పమాల్యాంగరాగాదు లుపవాసమ్మునఁ బరువు సెడవు; అమ్మఱుసటియుదయమ్మున బిల్వశాఖలను దత్ఫలమ్ములను శ్రీమాతృ్యాద్దేశమునఁ గొలిచి యానాఁటివియు నేడవునాఁటివియు నవ్రు సపర్య లనివార్యమ్ములై ముగిసినవెనుక నెనిమిదవునాఁడు పవలు విహితార్చాచణుండై నాఁటిరేయిం గను మూయక నిర్వర్తితజాగరుండై బలు లిడి తొమ్మిదవునాఁడు ప్రభూతభూతబలిప్రదానపరతం బరఁగఁ దగు; నావల దుర్గామంత్రరాజమ్మున దశభుజ యవ్రు దేవి నారాధింపవలయు; బదియవ్రునాఁడు ధూలీకర్దమనిక్షేపమ్ములును, క్రీడాకౌతుకమండలమ్ములును, భగలింగాభిధానంబులు భగలింగప్రగీతకమ్ములు నలువార శాఖోత్సవమ్ము నయనోత్సవమ్ముగ సమాప్తమ్ముగావించి తద్విసర్జన మొనరింపంజను; నిదియ విధిగ సరస్వతీపూజనమ్మును నాచరణీయమై యతిశయిల్లుఁ; మూలార్క్షంబున వాగ్దేవి నావాహనపురస్సరమ్ముగ స్థాపించి పూర్వాషాఢం గాఢభక్తియుక్తి నర్చించి

యుత్తరావసరమ్మున బలి నిడి శ్రవణమ్మున స్వస్థానమ్మున
కనుపం జను; పీఠమ్ముపయిం బుస్తకస్థాపన మ్మాదిగ
విసర్జనమ్ముదనుక నవ్వానిం గదల్చి పఠనపాఠనలేఖనాదు
లసంగతమ్ములని యభిజ్ఞులు నొడువుదు; రప్పొత్తమ్ము
ముత్తో మెత్తనియడుగుకెందామరులకొలువుడు సప్తమి
మొదలుగ మూనాళ్ళు, కాదేని, యష్టమి మొదలొన్-ని
దినమ్ములు రెంటం బొనర్పం దగి యుండు; మఱియు,

చ. హరునకు భాగ మీక దురహంకృతి యంకురితమ్ముగాం
బురందరముఖదైవతాఢ్యుం డయి దక్షుం డొనర్చుమఖమ్ము
రూపుమాపం రహిం జనించె యోగినులు పల్వురు గొల్వంగ
భద్రకాళి మున్ వర యిషమాస్సితాష్టమి; నవశ్యము
నాడు తదర్చ కర్జమా. ౧౨౮

చ. తన తలపెట్టినట్టి చెయిద మ్మొయిదం గొనసాంగం జండ
ముండనిహానప్రవీణ శివ నాకనివాసులచే నెసంగె నా
శ్వినమసితేతరార్ధమునం జేరిచి యాఱును మూడు నొ దిన
మ్మున నభిషిక్తయై పగఱమూంకలు నాఱును మూడు
నొ నెఱెన్. ౧౨౯

వ. అటు లౌట నాం డఖండనియతిం జండికారాధన మవశ్యా
చరణీయమ్మై యొప్పు; నింక బలిదానవిధాన మాకర్ణిం
పుము. ౧౩౦

బలిదానవిధానము

తే. బలిని బంచాబ్దలక్షణలక్షితమ్ము
  కోమలిం గొని వచ్చి కోర్కులు దలిర్ప
  ద్రోణబిల్వామ్రపున్నాగసూనచంద
  నాక్షతాదులఁ బూజన మాచరించి. ౧౯౧

వ. అవల బలిక్రియ నుపయోగింపంబడుకరవాలమ్ము నర్చింప
  నొప్పు; హ్రీం హ్రీం ఖండే త్యాకారమ్ము మనురాజమ్ముఁ
  బఠించుచు వికంచుక మొనరించి జకుక్కలదొరదిక్కుమొ
  గంబై యుండెఁ, దొలిదిక్కుమొగంబై యుండె, నిలువం
  బడి యుండి బలి నిడంగడంగుతఱి బలిపశువుం దిలకించి,

సీ. పండె నాతొల్లిటిభాగ్యముల్ దొరకితి
    బలిరూపమున నీవు పశువరమ్ము!
  శ్రీమాత కర్పించి నీమేలిమేను దు
    ర్గమదుర్గముల్ దాఁటఁ గలుగువాఁడఁ;
  జౌమొగమ్ములవేల్పు జన్నమ్ములకె పశు
    గణములు సృజియించె; ననలునందు
  వేలువఁబడు నెవ్వి వీఁగుఁ దత్తదవయ
    వకృతము లఘుములు వడిఁ బశుయజ
  మానుల కిరువురకుఁ గానఁ జండిక కిఁక
  బలివ యగుము జగముబాగు నరసి

యనుచుఁ గాలికాజపాద్యుతి యురుదారఁ
దచ్ఛిరము హరింపఁ దధ్భను నవల. ౧౯౩

వ. ఊం హ్రాం హ్రీం ఐం క్లాం ... నాప్యాయతాం మను మనువులం బఠించుచు ని ... ప్రదేశమ్మునఁ దత్కృత్తమస్తమ్మునిచి లేఁబగుడునను గ్రొవ్వకమిన నంజుళ్ళను నల్లయు నిలం బడనీక కడుంగడు ... రాకత నెఱయం గొని మహాకౌశికమంత్రితమ్ములుగ నైరృతుల కిడవలయు; నియ్యది యవిధిగ బలియొసంగు సాధకుం డఖండపూర్ణ ఫలావాప్తి నెసంగు; నద్దమరేయి బలి సీఁ దగినయద నని విధిజ్ఞులు నొడువుదురు. పశుబలి ముగిసిన యావలిసాము రేయిం బుడమిదొరలు దరాదులు వారయ కునికికి స్వగాత్రరుధిరమ్మున బలికర్మమ్ము నిర్వర్తించుచుండుదురు. మఱియు, ౧౯౪

సీ. వసుధామరులు మాపభక్తమ్మునకు బలి
కర్మమ్ముఁ దీఱుపఁ గడఁగువారు;
కన్నులర్మాని మేల్గడయు గుమ్మడిపండు
కల్లు నంజుడు పశుబలితో వావిఁ
గలుపునందురు బుధుల్; గఱ వయ్యెనే నజ,
యొండెఁ గూష్మాండమ్ము, నొండె శ్రీఫ
లమ్ము వసనపిహితమ్ముగాఁ జురకత్తి
గొని నడిమికి రెండు పోనరుపఁ జను;

నవల నా ఖండయుగళి జయంతి నొండె
సప్తశతి నొండె విధిపురశ్చరముగ నొన
రింపఁగా నొప్పు నిచ్చ నో వ్రేల్మి; నిట్టి
విధిన యనుసవ్యన్నానవాని పేర్మి యసదె?   ౧౯౫

పారాజన మాకృత్యము

వ. ఉద్దిష్టవిధానమ్మున,   ౧౯౬

సీ. ముగిసినవెనుక సంపూజనాదులు పరీ
వారమ్ము వెంట రా నూరు వెడలి
తలపోలమ్ముదనుకఁ దరలి యేగి యచోటఁ
గొలు వుండ నవు నొకకొంతసేపు;
చను విషమ్మసితదశమిని జింతాకులు
ముడిగి సంజ రవంత గడచుమీఁదఁ
గడకొని తారకల్ పొడిచియుఁ బొడువక
యడరుతఱి విజయ మనుపేరఁ;

గొరుకులపంట, కరమునఁ గుదురుకొనిన
వేల్పుమానిక, మిరవునఁ గల్పకమ్ము,
కట్టుకొయ్యకుఁ జేరిన కామధేను
వత్తఱి మహేశ్వరీపదాబ్జార్చనమ్ము.   ౧౯౭

తే. మోక్షవిజయేందిరలగలమ్మున ముదమ్ము
వొదల నెదల దారముఁ గట్ట బూను పుడమి

వేల్పులు దొరల కుంకువ వేఱె వలెనె
నాఁడు భువనేశ్వరీపూజనమ్ము కాక. ౧౯౮

మ. తతమాల్యమ్ముల మేలిగాసెనల ముక్తాహారపంక్తిం బరి
ష్కృతముల్ తుంగతురంగవారణములం జిత్రమ్ముల న్నిల్పి
త్వర్ధిస్సిత నర్చించి మహీసురాగ్ర్యజనతాశీర్వాదవాక్సార
వర్ధిత తేజుండయి ఱేఁడు గీతఘనవాదిత్రధ్వనుల్ మీఱఁగాఁ.

సీ. తోఁకొనుతోసానఁ దోతెంచుబలముల
కలకలధ్వనులు దిక్కులు వగుల్పఁ
గడచని తనవీడు కడువడి సీమాంత
మును జేరఁ బనివినఁ జను; నచోటఁ
బూనరిచి వాస్తుపూజనము తొల్దొల్త ది
క్కులసుబాదార్ల విధులు పదాఱు
ననువు మీఱఁగఁ గొల్చి యవల నిర్వర్తితా
స్వప్నసేవనుఁ డయి బహుళపాప
తూలవాతూల, మపమృతిమూలనాశ
న, మ్మభీష్టసిద్ధిసుసాధనముగ జమ్మి
మ్రాను శ్రుతిపురాణోక్తముల్ మంత్రతంత్ర
పద్ధతుల్ దగఁ బూజింపవలయు భక్తి. ౨౦౦

క. శమి శమ మొలయనిపలుదో
సములతొ బలియురఁ బగతుఱ సదమద మొనరిం

చు; మఘవసుతశరధారిణి
శమి రామునకుం బ్రియమ్ము సరసతఁ దెలిపెన్. ౨౦౧

వ. అను మనువుం బఠించుచుఁ గృతప్రదక్షిణాత్రయుండై పుడమిఱేఁడయ్యెడ తొలిదిక్కు మొగంబుగ సజ్యచాపుండై నిలువంబడి కట్టెదుట నభిముఖంబుగ నమర్చఁబడియున్న రిపుప్రతికృతిని స్వర్ణపుంఖమ్ము విశిఖమ్మొదవ్వో మ్మున గాటమ్ముగ నాటి గీటడంపవలయు; నంతం బురోధ దిగ్విజయమంత్రంబు లాశీఃపురస్సరంబుగఁ బఠింప నొప్పు; భటులు గెలుపు దెలుపు భేరీకాహళాదులు మ్రోయింపవలయు; నిక్కరణిఁ దక్కుంగల దిక్కులయందును బగఱ బొమ్మల శరమ్ములఁ దుమ్మునం గలుపవలయు; నవ్విజయ ముహూర్తమ్మున శ్రీమాతం గొలిచి దిగ్విజయయాత్ర సాగించుతేని రాలచ్చి తనకుం దాఁ గవుంగిలింప నెదురుగ నగుదెంచు ననియు యేతదాశయమ్ము. పదంపడి పుడమివేలుపులం బురోహితులం బూజించి జయమంగళ శబ్దంబులు భోరుకలఁగ బలంబులు బలసికొలువ నగరిం జొచ్చి భూసురాశీర్వాదంబు లానందంబున నందుకొనుచు నిజమందిరప్రవేశం బొనరింపం దవు; నిట్టిచందమ్మున ననుసమం గొనసాగించు ధరాధిపచంద్రుండు నీరంధ్రయశస్సాంద్రుండై విజయలక్ష్మీస్వయంగ్రహాపరిష్వంగంబుల నంతింత యనం బోలని సుగంబున మెఱయు; మఱియు నిరవున, ౨౦౨

సీ. రాజుఁ బూర్ణుని ద్రోసిరా జను నవు మోము
నలువారు జయ కోరకుల నొసంగు;
భావితాత్ములకొంగు బంగారు విజయాఖ్య
విజయపరంపర వెలయఁ జేయు;
ముంగిటి కల్పకమ్ము శివ కామేశస
వ్యాంకస్థ యవుఁగాత మండదండ;
కూరిమిమున్నీరు కులపాలిని కులమ్ము
తామరతంపర తగఁ బొనర్చు;

ననుచు హారిద్రచూర్ణమ్ము నక్షతలును
గుంకుమము కోమలములు దూర్వాంకురములు
తెల్లనావాలు గొని కృతత్రిఃప్రదక్షి
ణక్రముఁడ యయి గీతస్వనమ్ము లెసఁగ, ౨౦౩

వ. తోరంపులతాసూత్రమ్ము వలచేతం దోరంబుగఁ దాల్పవ లయుఁ; బదంపడి యావరణావాహితమ్ములు వజ్రాదుల మంత్రమ్ములత్రోవలఁ దమతమ నెలవుల కనిపి సమిత్ర బాంధవమ్ముగ నూతనవస్త్రాలంకారపరిష్కృతుండై జల గోగోష్ఠమ్ముల సవిధమ్మునఁ ఖంజనమ్ము ధ్యానపూర్వక మ్ముగఁ బొడఁగనం జను; నిటు లేటేట నొనరించునంచి తుల కఖిలార్థంబులు కరతలామలకంబులై యతిశయిల్లు నని ననుచు నెనరు తనరు తెరువునఁ బొకిలివిరితామర చూలిచూలి యయ్యిలాపాలకమౌళికిం దెలిపె. ౨౦౪

క. శ్రుతిమ స్తసుప్రశస్తా
యతనిష్ఠుటమార్గమార్గితాత్మయశస్సా
నతతమరందమిళిందా
యితయోగీంద్రజనతాసమీడితతత్త్వా! ౨౦౫

ఉ. కారణకారణత్వపరికల్పితదివ్యనఖండవైభవా!
మారణమారణత్వబహుమానితచిత్రచరిత్రచిత్రితా!
పూరణపూరణత్వభృశపూరితకంజభవాండభాండ! సం
దారణదారణత్వచిరదారితదారుణకల్మషక్రమా! ౨౦౬

పాదప— భావభవాభ్యుపపత్తివిపత్తిశ్రీవలితస్థితిచింత్యసతీప్సుం
భావవిభావితభాసురతేజోభావకభావుకభావుకకారీ!

శా. సారాచారవిచారపారగమనీషాభూరిభూషావిశే
షోరీకారవికారదూరరమణీయోహామహోత్సాహునిన్
రారాజత్పెను మెచ్చువంశవరపారావారజైవాతృకున్
శ్రీరంగావనిపాలమాలిఁ గరుణాశ్రీలాలితుం జేయవే.

గద్య— ఇది శ్రీ శ్రీవత్ససగోత్రపవిత్ర, చిదంబరపౌత్త్రి
నాగభూషణసుధీవరపుత్త్రి, శ్రీబాలాత్రిపురసున్దరీ
గర్భశుక్తిముక్తాఫలాయమాన, ప్రభాకర, లక్ష్మీ
నరసింహశాస్త్రిసమాఖ్యానప్రణీతంబైన
కాలభాగవతము సప్తమస్కంధమున
నాశ్వినమాహాత్మ్యము
ద్వితీయాశ్వాసము.

శ్రీరామ

కాలభాగవతము - సప్తమస్కంధము

# ఆశ్విన మాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

శ్రీసత్యవతీసుదతీ
భాసురసేవావిధానపరితోషితచి
త్తా! సమతాసమతావి
న్యాసకలాతీతభావ! యఖిలేశానా! ౧

వ. వెండియు నకల్పకథకకులాఖండలుండు శౌనకాదుల కిట్లను.

ఆ. ఆలకింపుఁ డవలిదవు వృత్త మడర న
వ్వడువు నోడువఁ దొడరుప్రాఁబలుకుల
వేల్పుపట్టి కిట్లు పృథుపార్థివాన్వయ
కైరవాప్తుఁ డనియెఁ గదురుబత్తి. 3

చ. తపసికొలమ్ముగ్రమిన్న! అరుదారిననీయనుకంప పెంపుమై
క్షపితము లెల్లదోసములుగా వినఁ గల్గితి నిట్లు మోదముం
ద్రిపురకుఁ గూర్చు నాఱుతిగఁ శేల నెసంగునిషవ్రతమ్మన
ల్పవుభిధియొప్పఁ దొప్పడ నెడం బొనరింపఁగ నొవ్రతమ్ములౕ.

సీ. కలపనగంపనై కాలు నోరును బొదు
గాన కెవ్వలనున గాముపాత
బడినవెడంగుచొ ప్పడరఁ ద్రిమ్మరుచు ను
పాయపు ప్రేలరిపలుకుబడుల
జుట్టుజుట్టును ముడి వెట్టి పోరయుచుందు
కెలస మీ వందురు తెలివి మాలి
యొకకొంద అలఁతు; లెట్లాలయు ముజ్జగము ల
నామయముం బరిణామకుశల

కరము లట్టివి సేఁతలఁ గాలు నిడక
యట్ల కానిమ్ము నా కేమటంచు నూర
కుందువే క్షణ మీవు? పరోపకృతిగృ
హీతశారదజలదావదాతగాత్రి! ౫

తే. నెమ్మి నా పొనరిచినపున్నెములపైరు
కొండలుం గోటలుగఁ బండి నిండ నవుట
వినిచితివి పీనుదోయికి విందుగూర
నిట్టిపున్నెపుకత లోపి యింత తడవు. ౬

వ. అట్లయ్యు నడంగనిదూఁపం దపతప గొట్టుకొను మచ్చె
తమ్ము పేరిఁటి చాతక మ్మిప్పాటి యలంతితుంపురులఁ దనివు
సనదు; భవద్వదనవివరమ్ము ననుండి చండముండాదినీ
విమలచరితామృతరసాసారం బవారిఁ గాలువ గట్టి యేళ్ళ
కొళ్ళ నేక మ్మువునట్టుల కురియవలయుఁ గావున నీప్సి
తార్థపరిపూరణగుణశస్తమ్ము నవరాత్రవతప్రాశస్త్య మ్మింక
నుదాహరణపూర్వకమ్ముగ వినిపింపంగదె యని వేఁడుడుఁ
దాపపరితప్తమహీనారదుండు నారదుండు మొగమ్మున
నింతింత యనంబోలని సంతసపుంజిన్నెలు దచ్చనలాడ
వేడుకపడుచు తేనిం గనుంగొని యి ట్లని నుడువం
దొడంగె. ౭

తే. వినుము పార్థివవర! యోగిజనవిభుఁడు స
నత్కుమారుఁ డొకతఱి నుద్యత్కమలసు
హృత్సహస్రసన్నిభ తేజు నిందిరేశుఁ
దఱియ నరిగి యి ట్లనుఁబదద్వయికి నెఱఁగి. ౮

సనత్కుమారుండు విష్ణువుం బ్రశ్నించుట

క. దేవా! తావకశుభలీ
లావేలవిలాసకలయ యయి తవుఁ గాదే
యీవిశ్వమువిశ్వముపు
ట్టవెత లేకున్కి సమసి యేగుట తుదినిన్. ౯

క. తమి సర్గక్రీడారత
ము మదిం జేజేత సీవ పొడమించినలో
కము లెచ్చు కుందు లొందుట
యమరగణస్తుత్య! కూర్చు నబ్బుర మెంతేఁ. ౧౦

సీ. కంతువసంతజయంతాదులఁ నవ్వ
మానితరూపసంపదలు వ్రెదలి,
పరువపుజవరాండ్రబలుపుగుబ్బలచోకా
టంపుకౌఁగిళుల నోడళ్ళు మఱచి,
కొదవ్రొనికోరుకలు కొనకొన ఫలియించి
కొడుకుకూఁతుండ్రతోఁ గూడిమాడి,
చద లంటి చందురుచాయ లిం పొప్పు ను
ప్పరిగలు మేలునిక్కపట్లుగ, గజ
రాజగండకాసారనిర్గలితదాన
ధారలం బ్రాంగణంబు లార్ద్రిములుగ మణి
గణనికేతనమేఖలాకాంతు లవుచుఁ
గొంద ఱెన రానిసుగముల నొందువారు. ౧౧

క. దొట్టినశమదమగుణములు
పుట్టువుతోఁ బెట్టినట్టిభూషలుగఁ దురా
పొట్టుగురుం జెవి వట్టుక
యట్టిట్టూఁగింపఁ గొంద ఱవుదురు విబుధుల్. ౧౨

తే. తట్టుముట్టాడ నెట్టన నట్టులందు
నెవ్వ గొట్టుమిట్టాడుచు నెఱి దొఱంగి
కన్ననిసువులతోఁ గూడఁ గడుపు గాలి
కొంద ఱిల మలమల మాడుచుందురు గద. ౧౩

తే. మూఁగలుం జీఁకులును విన్కిఁ బొరయఁబోని
దీనులుం బంగువులు గదాధీనతనులు
దిక్కు ద్రొక్కును లేమిని దేవురించు
వారునై కొందఱు బడలుపడుచు నుంద్రు. ౧౪

క. దేవా! త్వదేకసృష్టుల
కీవిపరీతప్రవృత్తి యేల కలిగె నా
కీ వానతిమ్ము నావుడు
శ్రీవరుఁడు కుమారున కనుఁ జెఱునగ వొలయన్. ౧౫

నవరాత్రవ్రతప్రశస్తి

క. ధనరాజ్యరమాసంప
ద్వనితాపత్యాప్తమిత్ర పశువాహనికే
తననిష్కుటములు నిఖిలము
లొనరుఁ బురాపుణ్యఫలమ యొప్పఁ గతమ్మై. ౧౬

క. అలరుం బలు తెఱఁగుల నె
ప్పొలుపున నెన గాన రాని పున్నెంపుబనుల్;

విలసిల్లు వానినెల్లం
దలమానికమై యొకండు వ్రతమ్ము కుమారా! ౧౭

క. తొలిపలుకులును బురాణ
మ్ములు నడుగడునన నొడువు మొగములు వేవేల్
వెలయంగం దన్మహిమముం గో
టలు కొండలునుం జలిపి కడలుకొని పేర్మిన్. ౧౮

క. కురుకుళ్ళాంబాప్రీతిం
కర మప్పుణ్యవ్రతమ్ముం గావింపం దవున్
శరదవసరమ్ముతొలి నెల
మురు వపు వెలిసామునందు మొదలిడి కడంకన్. ౧౯

క. నవరాత్ర మ్మనుపేరటం
దవ్రం జు మ్మమ్మెలివ్రతము; తత్సక్తమతుల్
దవులరు భవభవతాపము;
శివ వారలకొంగున ముడిచిన మానిక మా. ౨౦

వ. మఱియుం గుమారా! ప్రామినుకులం బ్రణవమ్మును, మనువుల గాయత్రియు, రసమ్ముల ఘృతమ్మును, లోహమ్ములం బసిండియు, నగమ్ముల మేరువును, సరస్సులం గడలియు, ధునుల జాహ్నవియు, ద్రుమంబుల నశ్వత్థమ్మును, గంధర్వుల నారివేరంపుతబిసియు, వేలువులం గఱివేలుపును, ధర్మమ్ముల వైష్ణవమ్మును, వైష్ణ

వులం బ్రహ్మోదుండును, దిశుల నేకాదశియు, హారమ్ముల నరకలవారమ్మును, దేజస్సుల వెలుంగుల మెకిమీాఁదును, జుక్కలం జుక్కలచోరయుఁ, బులుఁగుల గరుడుండును, జిలువల వలరాజునయ్యశేయ్యయు, రతనమ్ములఁ జింతామణ్యా తమ్మును, క్షేత్రమ్ములఁ గురువును, నోషధుల నన్నమ్మును, బూజార్హమ్ముల దలమ్ములఁ దులసియు, నందుం గృష్ణయు, గంధర్వాదికమ్ముల లోకమ్ముల నాకమ్మునుం బోలెఁ గలయెల్ల వ్రతమ్ములఁ బవిత్రమ్ము నవరాత్ర వ్రతమ్ము మిన్నమై వన్నియ కెక్కుఁ; దపోదాన సవనాదు లద్దానికాలిగోరునం బోల వని విజ్ఞమతమ్ము; దొఱంగనివిధి నాచరితమ్మయ్యాది యుభయలోకఫల మ్మనాయాసమ్ముగ నొసంగి యెసంగు; నందును నవ రాత్రోపవాసమ్మువాసి సురలకేఁ బలుక నలవి గాకుండు. వినుము, మున్ను, ౨౧

సహస్రభగుఁడు సహస్రాక్షుఁ డగుట

సీ. మునికనుఁ బ్రామి ప్రామినుకు వేలుపునయ్య
గాదిలికొడుకునల్లల్వలన్న
వాడితూఁపుల కోడి కోడిపోఁడిమి మీాఱి
నొకనాఁటిరాత్రిరి నుటజము చొరి
చెఱిచె గౌతముకూర్చుచెలువ నలంతియై
వాసవుఁ; డెఱిఁగి యమ్మౌనస మెల్ల

వేఁగ న న్నది నది కేగిన యమ్మునీం
ద్రుండును గాలరుదుఱిందువోలె
మండిపడుచుఁ దా బిఱబిఱ మగిడి యుటజ
మునకు మెలమెల్లఁ గాలికి బుద్ధి సెప్పి
నప్పలువఁ బదరి పదరి త్రిప్పరాని
శాప మిడె సహస్రభగతఁ జను మటంచు. ౨౨

వ. అప్పట్టున, ౨౩

క. అఱి సిగ్గగ్గలు నట్టిద
కొఱగామికిఁ బాలువడిన కుటిలుఁ డతనికిం
గుఱుతుగ నోడలునఁ దెఱవల
గుఱులు వెవేల్ వొడమి వడిగఁ గుమురులు గట్టెన్.

తే. ఆవిమానన నేపఱి యనిమిషాధి
నాథుడుం దివమ్మునకుఁ జనంగ మాని
మానసము మించు జవమున మానసమ్ము
పేరికాసారరాజమ్ము సేర నరిగి, ౨౪

వ. అం దొక్క మృణాళనాళమ్మునం దూఁకొని తోఁకొను విషాదభరమ్మునఁ గూకులు వత్తులు నగుచు నిద్రాహార మ్ముల కెడమై నోడువరాని గొడవ నగడు గుడుచుచుఁ బడియుండె; నటులు కొన్నినమలు సనినయావల నావిల స్వాంతుం డా మఘవంతుం డనుప్రాప్త మ్మిషమాసమ్ము

సితమ్ము పక్ష మ్మెఱింగి ప్రతిపదాదిగఁ దొమ్మిది నాళ్లుం
బవనభక్షణం బేనియుం బొనరింపక యనన్యగతికుండై
నిండిన భక్తిభావమ్మునఁ గింకరత్వమ్ము నెఱయ శ్రీశివంకరి
నంకించె; నద్దానఁ జేసినదోసంగు లంతంతలం బడి యడంగి
పోఁ బులు గడిగిన యాణిముత్తియమ్మునెఱి మెఱయం
దొడంగె; నయ్యవసరమ్మున, ౨౬

సీ. పోయినపోకయై పోయిన యొడయని
జాడ యెఱుంగక జాలి దూలి
వేలుపుమూఁకలు బిట్టడలి వికుంఠ
మున కేగి కఱివేలుపునకుఁ దూఁ చ
విడువక తమగోడు విన్నవించుడు దేవ
దేవుఁడుఁ బురుహూతుదేవురింత
సొంతమ్ముగ నెఱింగి యను వారలకు నిట్లు
దిక్కు మ్రొక్కును లేక స్రుక్కుచున్న
వాఁడు మీఱేఁడు తామరతూఁడు మనికి
పట్టుగా గౌతమమునిశాపమున మేను
యోనులన్ నిండ మానసాఖ్యాన మైన
మేలికొలనున వెఱ గ్రమ్మ మమ్ముఁ జూడ. ౨౭

ఉ. పిమ్మటఁ బాపిపుత్త్ర మటు పీడక స్వర్విభుఁ గ్రాఁచుదాని
నిం, బిమ్మటఁ జూచుకోఁ దవును మేనఁ బొలంతిగుఱుల్
దొఱంగి సౌఖ్యమ్ముగ మని; రందు రయ మారఁగ మీ

రిఁక సంచుఁ గొంచు మొత్తమ్ముగ వారి వారిధిసుతా
దయితుండు దలిర్చు నాదృతిన్ . ౨౮

చ. విరిసి వెవేలు రేకుల నవేలము శోభఁ జెలంగు మేలిబం
గరు నెఱితమ్మిపూగుములఁ గాల్వఁగఁ బాఱు మరందధారలం
దిరముగఁ గ్రావి మత్తిలిన తేఁటులపాటల సీటుగుల్కు నా
సరసుచు గన్నుపండువులు సల్పెడుదానిని జేర నేగి తాన్.

తే. దరిని నిల్చిడి యానుఁ బురందరుఁడ! యిట్టి
కర్జ మది మేలె? నీ యెడగలిగి మనికి
నగడు గుడువదె దివము? గా దవు నటంచు
బలుకఁ బోక మృణాలమ్ము వెలలి రమ్మ. 3౦

మ. కనితే వంతులు పంతముల్ దగ శచీకాంతాలలామమ్ము
పల్చనినెమ్మేనిపసిండితీవ సురపూలక్ష్మీముఖాబ్జమ్ము
వెల్లనదోఁపన్ వసివాళ్ళు వాడఁ గడఁగెన్ లబ్ధంబుగా
మిత్రతన్ చనవుల్ మీఱిన నీవియోగభరసంతాపమ్ము
లేఖర్షభా! 3౧

మ. అనుచుం బిల్వ భగాంగణం బయిన స్వీయాంగంబుతో
నిల్వ విచ్చినయవ్వారలకన్నుదమ్ములెదుటన్ సిగ్గిల్లి రా
నోడి వాడిననెమ్మోమున నంద కొంతవడి నల్లేయుండి
జిష్ణుండు తప్పనిచొప్పి బిసరాట్చిరోవివర మన్
ద్వారమ్ము దా వీడుచున్. 3౨

వ. అంతికమ్మునకుం జనుదేరం బూనియు సిగ్గుబరువునఁ బరువు దప్పి మోమోడుచు నున్నం గనుంగొని దను జాంతకుండును, 33

శా. రావోయీ యిటు జంకు గొంకు గొన నేరం బెద్ది గావించితీ వివేళం జెపుమయ్య, కూడుకొని రావే కాలముం గర్మ మి ట్లేవేవో పౌరసుల్ మహామహులకే? నిస్పాటిగా దీనికై భావంబందునఁ గొందలంపడఁగ భావ్యం బానె నాకాధిపా! 34

వ. అనునయ్యవసరమ్మునన, 35

సీ. అచ్చపు మోమునఁ దచ్చనలాడు లే
నవ్వుతోఁ దల నెలపువ్వుతోడఁ
గ్రొమ్మానికమ్ముల కిమ్మువు మకుటమ్ము
తళుకుతోఁ గనుఁగవ బెళుకుతోడఁ
బాడుచు ప్రొద్దును నెత్తిపోడుచు నెమ్మోయి మేలి
డాలుతో సత్తులజాలుతోడఁ
గాలిఁ గాలం దాఁపఁ జాలు సింగపువారు
వమ్ముతోఁ దవుగరువమ్ముతోడఁ
బునుక, సిడి, కోల, విల్లు, స్యందనమునంగ
ముం, జిరా, గద, తామరపువులదోయి
తోడ భువనేశి దచ్చి చేతులు సెలంగఁ
గట్టెదుటఁ బాడకట్టి మిన్నొట్టుకూర్మి. 36

మ. అను లజ్జావనతుండు యోగిగున కిట్లన్నె మ్మొ పున్నెమ్మొ
ప్రాప్తనిలింపప్రభుతావలేపఫలమో దయ్యెష్పుపేరత్రిలో
లన సౌనో యిది, యూయెఁబోయె నహింతం బట్టల్
పొసంగించి చేసినకర్జమ్ము శతక్రతూ! మది నీఁకం జింతిల్లఁ
గాఁ జెల్లునే? ౩౭

మ. దినముల్ మూడును నాలు నాఁలనిప్రపత్తి౯ నిల్పి
నాయంద నెమ్మన మన్నాదుల జోలిత్రవ్వఁజనకే మాన్య
త్వ మొప్పం గతాశ్వినశుక్లప్రతిపత్తునం దొడరి న౯
సేవించి భావించి తీ వెనయం గల్గితి దాన నాయడుగుల౯
వీక్షింప నౌభాగ్యము౯. ౩౮

చ. విడువనిభక్తిభావమున వేఁడెడుభక్తజనమ్ముకొంగున౯
ముడిచినపైఁడి మచ్చరణపల్లపయోజయుగమ్ము గన్నులం
బొడఁగనుమీఁద నేజనుఁడు పొందఁగలాఁడు బెడంద
లింద్ర! నీయొడలునఁ గల్గుపాత్రిగుఱు లొప్పెడి నిష్పడ
లోచనమ్ము లై. ౩౯

శా. కానీకానివిత్రోవలం దలఁతివై కాల్వెట్టి, వేల్వెట్టి యొం
దేనాఁడుం బెరవానిచే నిదె యతండే యంచుఁ జూపించు
కోఁ గానీయంతటి యంతరం బిడక నాకమ్ము౯ మదంఘ్రి
ద్వయధ్యానాసక్తము చిత్తముం బాదల నిత్యమ్ములు
కొమ్మాయిఁక౯. ౪౦

వ. అని యనుగ్రహించి చిత్కళాంచిత యప్పరమేశ్వరి యిం
ద్రోపేంద్రులపాదాభివందనంబు లంగీకరింపుచుఁ జూపు
జాడ కేడమై చనియె. ౪౧

క. అంతఁ బురందరునొడలున
నింతులగుఱు లెల్లఁ జెల్లి యీశ్వరికూర్మిన్
వింతగ విరితమ్ములతోఁ
బంతము గొను కనులు గా శుభస్థితి నొప్పెన్. ౪౨

వ. నాఁటంగోలె సహస్రభగుండ మ్మఘవుండు సహస్రా
క్షుండు నా నొప్పె, నట్లు కావున, ౪౩

క. వ్రతములుఁ దీర్థమ్ములు దై
వతములు నెత్తినశిరమ్ము వ్రాల్చు నఘాహి
వ్రతతికి గారుడమంత్రము
క్షితి నవరాత్రోపవాసకృత్య మడు గిడన్. ౪౪

క. వరుసం బంద్రెం డేఁడులు
వరనవరాత్రవ్రత మ్మెవ్వాఁ డాదృతి నా
చరియించు నయ్యుదంచితు
దరియఁ గృతాంతుండు నెఱచుఁ దాఁ గలనేనిన్. ౪౫

క. ఏలా వేలిఁక యోగి
జ్ఞాలీ! యుక్తవ్రతోత్తమము సవ్యమ్మా

కాలం దవునలిగోరునఁ
బోలవు మఖదానతీర్థపుణ్యము లెల్లన్. ౮౬

వ. అంతియకాక, కుమారా! వాసరమ్ములు తొమ్మిదియు నుపవసించి శరదవసరమ్మున నంచిత మ్మా వ్రత మాచరించు సుకృతికోటి కోటీశ్వరత్వమ్ము ఘటింప నిహమ్మున వలవానిమానినిం గాదు వెమ్మన వెనుదీయని నిబ్బర పుంగబ్బిగుబ్బెతకులుకుకవుంగిటం బురుడు వోరయుని సుఖ పరంపరల వఱలి తుదిఁ దిరిగిరాక యొలయుని పరపద మ్మున నిరంతరపరమానందానుభూతి నెసక మెసఁగు నని వినిచిన సనత్కుమారుండును దేవా! తావకీనకరుణారసావాప్తి నలుప్తఫలప్రదమ్ము నవరాత్రవ్రతమహిమ మ్మాలించితి; నింక నద్దానివిధానమ్ము నానతీవె యని వేఁడిన వేడుక దళుకొత్త నత్తామరసనేత్రుం డిట్లని నొడువం దొడంగె. ౮౭

నవరాత్రవ్రతవిధి

సీ. సర్వదైవతములు శక్తిమయమ్ముల
యవుట భాస్కర విష్ణు భవ గణేశ్వ
రాలయమ్ముల నొండె నంబికాగారంబు
నం దొండె నివ్వ్రత మాచరింపఁ
దవుఁ; దవులుతమి సంధ్యాసమయమ్మున
వఱలఁగా నిరశనవ్రతనిరూఢి

సశ్రీఫలము సవస్త్రము గాదయేని స
ద్రవ్యమ్ము కలశమ్ము స్థాపిత మ్మొ
నర్చి సంజలు మూటన స్నాన మాదు
చుం బ్రథితధూపదీపాదిషోడశవిధు
లం దొలంగనివిధిని గొల్వంగ నొప్పుఁ
బ్రతిపదాదిగ నవమిపర్యంత మనఘ! ౪౮

తే. ఇరవునం బావిసిటఁ బుష్కరమునందు
ప్రొద్దినిం దద్వ్రతావసరమునఁ గార్య
మా వగావ మధమము మధ్యమము నుత్త
మమ్ము నుత్తమోత్తమము కుమార! వింటె? ౪౯

క. ఇవ్విధిఁ దొమ్మిది నాళులు
నెవ్వా, డశనంబు ఁగోలియే వ్రతవ్రత తా
ముప్పేళల లలితఁ గొలుచు
నవ్వాలఁతి వెలుచు గలితమహౌఘములుం డై. ౫౦

తే. ప్రతిపదాదిగ నష్టమవాసరమ్ము
దనుక గీతవాదిత్రన ర్తనములు పొలు
పార లలితాంబికామహోదారచరిత
మవహితము చిత్తమున నవు నవధరింప. ౫౧

వ. ఎనిమిదవునాఁడు, ౫౨

సీ. ఫలమర్ఘ్యతండులమ్ములు బిల్వదలములు
త్రిఫలముల్ నేయి యందికొని మంత్ర
తంత్రపూర్వకముగఁ దవు నగ్ని వేలువ;
ననుదిన మెఱిఁగి వయఃక్రమమ్ము
కన్నియల ద్విజాగ్రగణ్యుల నిష్టమృ
ష్టాన్న భూషాసుమాల్యాంబరాది
కములఁ బూజింప నొఁ; గడకొను ప్రయతతఁ
జండికాజపమును జలుప నొప్పు;

నిదియ నియమముగ నెసక మెసఁగ ననుస
మమ్ము నుక్తవ్రతాసక్తమతి గలాఁడు
వఱల నఱచేతియుసిరికపండువోలె
ద్వివిధఫలమును బుధజనవినుతి నెనయు. ౧౩

మాంధాత సరూప ధాత్రిం బరిగ్రహించుట

సీ. మాంధాత నా నొప్పు మహినేత తొల్లిట
సద్వీపకానన శైలజాల
రత్నాకరోద్దామరశనాధురంధర
ధర నకంటకవృత్తి దనర నేలె;
దాయలకందనగాయలలోఁ గాయ
మతనిపే ర్విన్న దయ్యమ్ము వెఱచ
ఱచి పాఱుఁ; బుట్టి యేడుచువానిచే ధాత
త్రావించెఁ బీయూషరసము పొసఁగ

నెట్టిపట్టున ధర్మమ్ము కట్టుబాటు
బాయ నీయనివాని యేల్బడి తెలుంగు
వెలుఁగు పాడమించె సురలక; ప్రీతుఁ జేసె
సతఁడు యజ్ఞపరంపర యజ్ఞపురుషు. ౧౪

తే. విసువ కెవ్వేళఁ బదునాల్గు విష్టపముల
వీఁచుచుం గుంచె దిరుగు తబిసికోలమ్ము
మిన్న యొకయప్పు డప్పుడమిదొరపాలి
కరిగి కొని పూజ ముద మేద ననియె నిటులు. ౧౫

క. రాజా! రాజదురుశ్రవ!
రాజాన్వయకలశజలధిరాజా! సేమ
మ్మె జనములు నీయానల
యోజ మెలఁగువారె? ధర్మ వొప్పునె యొప్పై? ౧౬

క. నినుఁ బోలు ధర్మమూర్తులు
మనుజేంద్రులయేలుబడిని మహిమాన్యత మ
న్కినిగద మాదృశులకు దివ
మునమండి పొసంగె రాకపోకలు భూపా! ౧౭

మ. శ్రమలేకే పగ కింత యంత యనుకో రానట్టి దివ్యమ్ము
తేజము నోజమ్ము పరాక్రమక్రమ ముదంచద్వృత్తి
దీపింప నీక్షమ రత్నాకరమేఖలన్ స్వవశగం గావించి

భావింప రానిమహోదారతఁ గీరితిం గనితి క్షోణీనాథ!
యెంతేనియున్. ౫౮

ఉ. అంత నిగర్వి యానృపకులాగ్రణి యిట్లను మౌనివర్య!
గోరంతలు కొండలంతలుగ నల్లుచు నిల్లలి నుగ్గడింప మీ
స్వాంతము పూనెఁ గాక యొకపాటిఁడె వీఁడు? లభించె
వైభవం బంతయు మీదయారససమంచితదృక్కుటాలు
పర్వి పైపయిన్. ౫౯

క. మీయాశీఃఫలముగఁ బెడఁ
బాయనిసుఖసంపదలు శుభస్థితిఁ బొదలన్
శ్రేయము గొను మా కీయెడ
మీయాగమనమ్ము కూర్చె మేలు మహాత్మా! ౬౦

చ. అనవుడు లోకమంగళపరాయణజీవనపావనుండు జీ
వనరుహసూతిసూతి సితపద్మమునందముచంద మిన్ని కా
దనువదనంబునన్ మృదులహాసము భాసురమై తలిర్ప నే
ర్పున నను వేల్పుబువ్వరసమున్ వెలిజిమ్ముచచఃపరంపరన్

మ. దరహాసోజ్జ్వల! సాద్రిరాడ్వ్యాపినసప్తద్వీపవిశ్వంభరా
భరనిర్వాహసుకార్యధుర్యబలశుంభద్దివ్యదోస్స్తంభబం
ధురుఁ డౌ త్వాదృశరాజచంద్రుని కేచోఁ దోఁచున్
సరూపత్వ? మొకటి రహస్యం బిపు డేను నీకుఁ దెలు
పంగా వచ్చి తిచ్చోటికిన్. ౬౧

వ. అ దెయ్యది యనుదేని, ౬౩

మ. మహికాంతాగ్రణు లెల్లవారలకు సామాన్యంబ సామా
న్యదుస్సహబాహాబలలాభ ముంకువగ భూజానిత్వసంసిద్ధి
నన్వహాముఁ భాసిలుచుని-; సార్థకముగా నాపేరు మైఁ
గొన్న భూమహిళారత్నముతో సుకమ్ము గొను సమ్రా
న్యుండు లేఁ డేయెడఁ. ౬౪

ఉ. రాజబిడౌజ! నీవ మెయి రాజిలునుర్వర పేరిపూర్ణిమా
రాజనిభాస్య బంగరుహారంగును గా దను మేల్తళత్త
ళల్ సాజములై వెలిం బఱవ సవ్యము నున్దొడపైని లచ్చి
మేలోజ వసింపఁ జక్రధరునొప్పున నొప్పెదునప్డు గద్దెపై.

క. కనువిరితామరపువ్రగవ
కు నొనరంగా విపులు గనుఁగో నెవ్వేళఁ
మనమునఁ గుతుకంపడుచుం
దు; నటుల్ మెఱయుజతనమ్ము నొగిఁ బూనఁగదే? ౬౬

మ. అన నెకోల్గొనుప్రశ్రయానతత భూపాగ్ర్యుండు మాం
ధాత, స్వర్మని! యెవ్వారలు నేర్చువా రిటులు పొల్పుం
గాంచుకర్జమ్ము సాధనసేయంగఁ? ద్రివిష్టపాధిపతితఁ
ధన్యుండు శక్రుండు తాఁ గొనెనే మైఁగొనుస్వర్గరాజ్య
రమకులుఁగాంగఁగిటఁ మోదముఁ? ౬౭

సీ. అనవుడు ద్రుఘణునందనుఁ డను నివ్వడు
వునఁ బార్థివేశ్వర! వినుము దుర్ల
భము దానిఁ బడయఁ దోడ్పడు మేలివర వ్రకఁ
డస మొందు లలితామహావ్రతమ్ము
నా ననుచునభిఖ్య; నవ్యాశరన్నవ
యామినీవ్రత మన నదియ సూవె;
యనుసమమ్మును సడలనినిష్ఠఁ బూనరించు
దిట్టమేలిరవులోకొట్టమందుఁ

గట్టుకొయ్యకుఁ జేరినయట్టిపుడుకు
దోడుకు గాదె యయ్యది యని నోడివె నోడువు
నోడువునఁ బ్రమోదరసము జాల్వడఁగఁ దద్వి
ధాన మఖిలమ్ము నృపున కమ్మానిరాట్టు. ౯౮

వ. అనంతరంబ, ౯౯

క. విడువక సురమానీంద్రుఁడు
నోడివినవడువునఁ బుడమియనుంగుమగం డా
తఁడు లలిఁ బంద్రెండేడులు
కడుఁ బూనికిఁ జలిపె మాతృకాపదపూజల్. ౨౦

తే. పట్టుదువ్వల్వలుఁ బదాఱువన్నెపసిఁడి
తొడవు లూళులు లెక్క కెక్కుడుగఁ గడఁగి
దాసదాసీసమూహమ్ము దా నొసంగెఁ
గన్యకాసువాసినుల కగ్రకులజులకు. ౨౧

వ. అట్లు పంద్రెండవునేట విజయముహూర్తమ్మున దిగ్విజయ మహోత్సవము ముగించి భూసురాశీర్వాదంబు లందు కొని జయజయధ్వానంబులు తూర్యారవంబులతోఁ గలసి చెలరేఁగి యాకస మంట వెంట నంటి యరుసమ్మునం బఱతెంచుపరివారమ్ముతోఁ బురప్రవేశ మ్మొనరించి యల్లనఁ జల్లనిపన్నీట స్నాన మాడి పిదపనితమి నిర్వర్తిత సంధ్యాదికదైనందినక్రియాకలాపుండై యాచమించి విధి విధానాంచితమ్ముగఁ గ్రమ్మఱ నమ్మంగళప్రద లలితాం బిక నత్యంతభక్తిప్రపత్తులు సెలంగ షోడశోపచారముల నర్చించి కర్పూరనీరాజన మర్పించునవసరమ్మున, ౭౨

సీ. చారుచంద్రకళాలసన్నవమణిమకు
టాన్విత శ్రీమాత యంబ కాంబు
జద్వయోత్సవ మవు సదమలాకృతిఁ బొడ
కట్టె కిట్టెనుట జాల్గట్టునెనరు
నా నొప్పు వేల్పులబోనంపురసము మి
కుటముగఁ గనుకొలంకులన నిండఁ
బలుకు నీలలి రాచకొలపుమేల్రతనమ్మ!
యరుస మెసంగె నీయర్చకతనఁ
గోర్కి నిడు డింక నిష్టముం గోరుకొమ్ము
భక్తమానసపూర్తియె వ్రతము నాకు
నాపుడు వినీతత తలిర్ప నావసుంధ
రావరావతంస మ్మను నీవిధాన. ౭౩

శా. అంభోజాసనజంభభిత్ప్రముఖదేవానీకకోటీరసం
శుంభద్దివ్యవినూత్నరత్నరుచిరింఛోళిప్రణీరాజితాం
ఘ్ర్యంభోజా! నతకల్పవల్లి! యనుకంపాంభోనిధీ! యంబ!
ఓశుంభద్వేషిణి! చూడఁగంటి నినుఁ జన్ముర్లాభ మే
పారఁగాఁ. 24

తే. తొడిఁబడక భవదనుగృహీతుఁడన నాకుఁ
గలదొకో కోర్కి మఱి యింతకన్న వేఱ,
జననియెడ ముద్దు మురిపెమ్ము చనవు నెనయ
దివిజమునియానఁ జేసి యర్థింతు నొందు. 25

ఆ. మేను వొంది సింధుమేఖల శుభము శో
భనము నగవు తగవు చనవు నను
నెచ్చు నిచ్చు కరగృహీతిరీతిఁ దమి నా
యెడ మెలఁగ ననుగ్రహింపు మమ్మ! 26

క. అని వేఁడ నట్ల కావుత
మని మనురాణ్మూర్తి మానిమానసనవజీ
వనజాంతర్వర్తిని శ్రీ
జనని చనెఁ నృపునిచూపుజాడ కెడమ్మై. 27

వ. ఆవెనుక, 28

చ. తొడరి పసిండికొండదొరదొట్టిమలల్ మనుగబ్బిగుబ్బలుం
బొడమెడు నేళ్ళలోసుదులు పొక్కిలి తత్సికతాతలమ్ము లే
పడరుపిఱుందులుఁ ఖను లనర్ఘ్యవిభూషలు రత్న

కాంచియుం గడళులు నేడుగాఁ బుడమికల్కి మదిం
గొనురూపు కులకఁగాఁ. ౭౯

తే. చేరి యొకవేవు రనుఁగునెచ్చెలులు వీవ
వీవన లిరువలంకుల విజయలక్ష్మి
హారుపునం బఱతెంచి భూవర! పరిగ్ర
హింపుము నను నింతిగ భువనేశిముదల. ౮౦

వ. అని వేఁడుడు నయ్యాదియ యభిలషించుచునికిఁ గడుంగడు
ముదం బెదఁ బాదల నప్పుడ యచ్చోఁపున కొడంబడి,

శా. ఆశాపూర్తిపరాయణాయతతమానల్పశ్రవఃకౌముదీ
వైశద్యోజ్జ్వలమూర్తి రాటుకలసరస్వత్సోముఁ డా
మాన్యుఁ డుర్వీశంపాలలితాంగి తోడుగ సమల్ వేవేలు
భోగించె నీకాశత్వం బెట లేనిభోగములు లోకవ్రాత మా
నా ననన్. ౮౧

క. కావునఁ బావనఁ మీవ్రత
మే వెరవున నేఁ గృత మయి యెడలించి వెతల్
కేవలభావుకపదవీ
భావితులఁ బొనర్చు యోగివరసుమనసులన్. ౮౨

వ. అ దెట్లు? సోదాహరణమ్ముగ నెఱిఁగింపగదె యని వేఁడు
ననతుకమారునకు మారజనకుం డెలసిన కెలసమ్మున ని
ట్లని నొడువం దొడంగె; వినుము, ము న్నొకకనాఁడు,

సుఖప్రాప్త్యుపాయము

సీ. కానక కన్న సంతానమ్మె కానలఁ
జెట్టవట్టినకూర్చు చెలులతోడ
నికటములం బడి స్రుక్కుచు ద్రుపదనం
దని కృష్ణ కని కృష్ణ ననియె నిట్టు
లగ్రజ! దిక్కు మె కాకటి గోరమ్ముల
పాలైన మమ్ములఁ బోలు ననద
లెది సేసి యవ్వాని కెడగల్గి సుగముగ
మనువారు? కూరిమి మొనయ నాన

తీవె; నావ్రుడు నతఁ డను భావిని! నవ
రాత్రపరిమిత మవు మేలి వ్రత మొకండు
హారు వ్రేలయు నది విధివదాచరిత మాన
యేని వేల్పుగిడ్డితో పని యేమి యింక? ౮౫

తే. ఉడుగ కిడుములఁ ద్రోయుతాపోపతాప
సంతతులపేరిపాఁపలసాములకు దు
రాయి యద్దానివలనన హాయి గాంచె
వ్యధ దొఱంగి ము న్నయోధ్యాధిపతితనూజ. ౮౬

వ. అన నమ్మొలంతయుదంతమ్ము సాంతమ్ముగ నెఱింగింపం
గదె యని వేఁడు పాండవపట్టమహిషి కనిమిషాధిప
సోదరుం డిట్లని నుడువం గడంగె. ౮౭

ఉద్దాలకమునితపోవైకల్యము

శా. మున్నుద్దాలకమౌనిశేఖరుఁ డెదన్ మోక్షేచ్ఛ
రెట్టింపఁగా నెన్నో యేఁడులు శాంతిదాంతియుతుఁడై
హేమించునీమమ్ముతో నన్నాలీకదలాక్షు మోక్షపద
రాజాధ్యక్షునిం గూర్చి లేక న్నాదిస్పృహ సేసె భాసిలు
తపస్యన్ దుర్నివార్యస్థితిన్. ౭౭

తే. వాడి వత్తయై వడియమ్ము వాసిఁ గొనియు
నినుల వేవుర మించు మే నెసఁగువాని
కునికిప ట్టౌట జహ్నునందనితటమ్ము
కాంచె మిపులఁ బునీతమై గణుతి దెసల. ౭౮

వ. ఒక్కనాఁటియుదయమ్మున ౮౦

సీ. త్రిదశమానితతపఃశ్రీమంతుఁడు సుమంతు
మౌనిభాస్వంతుఁ డనూనవృత్తి
నెల్లవలఁకులఁ జరించి పునీతముల్
సేయునాతఁడ వడి డాయ నరుగు
దెంచి మహాత్మ! ప్రాపంచికవ్యవహృతి
విముఖత గడురఁ గాపించుచుంటి
విమ్మెలపున దుష్కరమ్ము తప మ్మది
వడయ నూహించితి నొడువుమయ్య
యనుడు, నుడుగ కెడఁదఁ గొనకొని కుదురుగ
ట్టినవిముక్తివాంఛ, తనతపస్య

తెలుఁగు నెఱుఁగఁ జెప్పుడు విఱుగనవ్వుచు సుమం
తుండు వలికె నిటులు పాండవసతి! ౯౧

క. మే లుద్దాలక! నీనోడి
జా, లింకం జాలుఁ జాలు శ్రమ మిది, యమృతాం
ధోలోక మ్మోతపములఁ
గేలం బడుపాటిదే? లగించితి కోర్కెన్! ౯౨

చ. అనిమిషపట్టణమ్ముఁ గొనునట్టిద నీస్పృహయేనిఁ ద్రోసి
రా జని తుదిచీటి వ్రాయుము రయమ్మ తపమ్మునన, కాప
యిం బనికె వినుము గృహమ్మ సేరఁ, దవునెల్ల నొక
ర్తుకఁ జెట్టవట్టు మల్లన నొక నాల్గు కాయ లకలంకత
గర్భమునందుఁ గాయఁగన్. ౯౩

చ. అనువుగఁ గూర్చి పేర్చిన కులాంగనతో గృహమేధిధర్మ
ముల్ వొనర ననుష్ఠితమ్ములుగఁ బుత్త్రిలఁ బాత్రులఁ
గాంచి వేల్పులం దనివున ముంచి తేల్చుచు ఋణమ్ముల
నీఁగినప్రోడ గాక నేర్చునె మురు మూసికొన్న ఋణి
చూరగొనంగ సువర్గభాగ్యమున్? ౯౪

క. ఏలా వే లుద్దాలక!
మే లగు, నానోడులబడిని మీఱక, చను మా
జాలున, ననుచు సుమంతుఁడు
గా లూఁదెం దనదుత్రోవఁ గలితము ప్రీతిన్. ౯౫

వ. అనంతరంబ, ౯౩

తే. తపులువైమనస్యమున నుద్దాలకుఁడు ప
సిండిఁ బోలు తపమ్ముఁ జేజేతఁ గంగ
పాలు గావింప నోలి నిల్లాలిఁ గొనఁగఁ
గాలు గాలు బిడాలమ్ముగతికి నవుచు ౯౪

ఉ. ఓముకొనంగ నాముకొనునూహ లపోహలు నేగి వేగ
చౌమోములవేల్పుపాలికి నమో యని పాయనిభక్తి
యుక్తి నోసామి! సుమంతుపలుకులె నిజమ్ములో మేలో
తపమ్మురక్తి యే నేమి యొనర్పఁగా వలెనో యేర్పడఁ
దెల్పు మటంచు వేఁడినన్. ౯౫

క. ముని! తొలుతన్ నందనుఁ గని
వనితాపాణిగ్రహ మ్మువల నొలయుదు వీ
వని ప్రామినుకుల వేలుపు
పనివినియెం జూపుజాడఁ బాసి కడంకన్. ౯౬

సీ. విడిచి పీడ బిగాది వెంట నంటినయట్లు
ఋష్యాసురుం డతఁడు వెనకటి తెఱంగు
నఱగాలఁ దన్ను నివ్వెఱపేరికడలిక
రుళ్ళ మొత్తమ్ములో బ్రుంగుడువడి
పోవుపల్పోకల నావంత నిలువర
మొలయని మనమునఁ గలఁక బాఱి

కొమరైనఁ గద తల కుళ్ళాయి తగిలించు
పూనిక! పైఁదలి లేక పుత్త్రుఁ డెట్లు
లోదవు? దైవమునె త్తికో ల్తుదిని దాఁకు
దాఁక నుఱఁబోవ దనుచు మందాకినీత
టమ్ము గ్రమ్మఱఁ జేరి స్వీయమ్ము నాశ్ర
మమ్మునన్ సమకట్టెఁ దపమ్ము సేయ. ౧౦౦

ఉద్దాలకుఁడు స్ఖలితము రేతము గంగలో విడుచుట

చ. మునుకొని యాచమించి మనుమూర్తి జపింప రవంత మా
యునంతన తనకోరుకుల్, తపముదారి, సుమంతునియడ్డ
గట్టి, నెక్కొను వెఱతోడి తాతపలుకుంబడి సందడికంటెఁ
గూర్చునంగనతలఁపుల్, గనుంగవకుఁ గట్టినయట్టులు
తోఁచి మించుదుర్. ౧౦౧

ఉ. ఆతఁడుఁ ద్రోపనంగొఱవి నొదునొకో తపముం గిపమ్ము
నే నీతటినీటఁ ద్రోసి, త్రిదశేట్పురలబ్ధికి దూరమై, యటం
చాతతవృత్తిఁ దత్తరిలు చాలిపయిం దవులాట మీఁతలున్
మ్రోఁతలునై ధృతిం దొఱఁగె మునొకన రేతముపాత
మాతజిన్. ౧౦౨

సీ. తొడిఁబడి తొడు గయి చెడినపోఁడిమిఁ జకి
తుఁడు మహాత్తరతపోదుర్నివార్య
వీర్యుఁ డమ్మునిజనవర్యుఁడు నద్దానిఁ
బుడమిని బడనీక పుష్కరదల

రచితపుటమున నునిచి నూల్కొనినజాగ
రూకత దర్భశలాకచే మొ
గమ్ము సంపిహితమ్ముగాఁ గ్రన్న జహ్నుజా
సలిలపూరమ్మున జాఱవిడిచె;
వెలుఁగులేకిమీని చేతులు వేయితోడఁ
జేయిఁ గలిపి తళుకన్ఁ జిటిపొటితరఁ
గలపరువులలో నురువులు గడచుమురువు
లలరఁ బయనమ్ము సాఁగించె నప్పటమ్ము. ౧౦౩

సుభద్ర చెలులతో జలవిహారము సేయుట

తే. అత్తఱి విదర్భభూధవుననుఁగుపట్టి
భద్రరూప సుభద్ర తా వనవిహార
చిరపరిశ్రాంతయై తోడిచెలులతోడ
నెలమి నరుదెంచె జాహ్నవి జలకమాడ. ౧౦౪

సీ. సిరిమించు చెలువంపుచెక్కుటద్దాల జా
ల్వాఱి దుల్లిన ఘర్మవారిబిందు
సమితి తవులుపాట శతథా సహస్రథా
చిదురుప లోనరుపఁ గుదురుకొన్న
తిమురు మేల్చను కొండలు ముఖసమీరణ
ప్రేరితతమములై బిట్టుగదల
నుల్లసిల్లఁగఁ బదపల్లవమ్ములమణి
మంజీరరవళులు మంథరగతి

మించుదగఁతోడి యాడురాయంచలట్లు
వరుసఁ దీర్ఘాన విమలసోపానపంక్తిఁ
గడచి నిల్చి పొల్చిరి చనుకట్టుబంటి
నీట నన్నవనీరజనేత్ర లెల్ల. ౧౦౫

తే. మించె ఘర్మవాఃకణపూర్ణకించిదరుణ
కామినీముఖోల్లసిత మా గంగ రేవు
స్యందిమకరందబిందుబృందాచ్ఛవికచ
కుముదకల్హారరుచిరము కొలనునోలపు. ౧౦౬

క. చేతులు చేతం బట్టుచు
నాతలిరుంబోండ్లు నిలిచి యటు కట్టిరి గం
గాతటినికి సేతువరం
బాతఱి నాతోయ ముబుకునలవున మివిలెౘ. ౧౦౭

మ. తవుపోకం దలిరాకుబోం డ్లపు డమందమ్మైన యానంద
మాత్మ వెలుంగం దలిరాకుచేతిమురుగుల్ మానా రవ
మ్మ్మని పొంగ వెసం జల్లులయాట లాడి రలవ్రాకం
జింది తోయమ్ముబిందువు లల్లల్లనఁ జెకుటద్దములఁ
జిన్కుంబూసలై దుల్లఁగాౘ. ౧౦౮

క. వాలాయముమై డాసెదు
వాలుగనుల్ దానిచేతఁ బడ కొకరిత నీ

ర్వాలునఁ బడి తేలుచుఁ జను
చాలున మునిఁగెం గుచకలశభర మ్మెచ్చన్. ౧౦౯

చ. మునుకొనుచాతురిన్ మెఱుఁగుబోఁడులు వేడుక నీఁదు
వేల వీడిన నెఱికొప్పునాచు నెడలించి రహించుజవానఁ
బర్వ వాల్గను లను మీలకోసము చొకాటపువాటపు
గుబ్బగిబ్బ లేపున ముకు సాచి యేచి రసపూరనిమగ్నము
లయ్యె నయ్యెడన్. ౧౧౦

వ. అప్పట్టునఁ దొట్టినకెలసమ్మున నమ్మనుజేంద్రసంక్రందను
నందని తనురోమరాజి, రాజితమ్ములు కులుకుంజనుకుంబూ
సలపేరులపేరింటి కృష్ణా వేణీ యమునా త్రిపథగాది ధునీ
మతల్లు, లుల్లసితమ్ము పల్లవితమ్ముగ దారమ్మునకే రవంత
యంతరం బొసఁగని నిబ్బరపుంగబ్బిగుబ్బలు నా నిండారిన
దండికొండలనడుమ నెట్టెటో మెట్టి జాల్గొనియుఁ జుట్టుం
జుట్టియు రసపూరం బపారం బయి తరళరుచితరంగభం
గంబు లుత్తుంగంబులుగ వడివడినడల నధోభాగమ్మునకుం
బాఱి వారక వళిపదంబులు నా మిట్టపల్లమ్ములపయిం
బడి తొడిఁబడక యొకమట్టమ్మున నేళ్ళుం గోళ్ళు నేకమ్ము
గావించి నించినపఱుంగున మెఱుంగులపొంగులు చిందు
వొందు బలుపుపిఱుందు లనం జను ననుకూలత్తోల్లాలిత
మ్ములు మేలివాలుకలపయిం బాఱులు తీరిచి కూరుచు
పేరిమి రామణీయకమ్మున కిమ్ములు నొజ్జలు నైన కడాని

గజ్జియల కులుకురతనాలమొలనూలు జాలుగొను మొర
పమ్ములపేరింటి హంసకారండవకాండకుక్కుటగోనర్దాదిక
వివిధజలవిహంగమపుంగవమ్ముల కలకలారవమ్ములు మం
గళధ్వానమ్ములుగ నాభీసముద్రసంగత లయి తల మునిఁగి
తాడిపోడ వవు వలపుల గిలిగింతలు వాఱుచుఁ గూరిన
మెఱుంగుదువ్వాల్వమఱుంగునఁ బలుక నలవికాని కులుకుం
బోకలసోకు లొలికించి మించుసంచుల నెఱజాణతనం బవ
లోకించి నించు తోడిఖేలనమ్ముల నుల్లోల లూరురంభాదు
లనుంగుంజెలులు వీడని ప్రీడాభరమ్మునఁ దలలు వాంచి
యంతలంతలం బడి యెడమ్ముగా నాడురాయంచసొబఁగు
నవఘళించుచు గంగాంబువుల డంబుమెయి నోడలు గద
లియుఁ గదలక శివిమెయి నీఁదుచు మెయిఁగొన్న పద్మి
నియో యనఁ బద్మషండంబులపరామఱిక నేమఱక
యచ్చపుపుప్పొడిజల్లు లుపాయనమ్ములుగఁ గొని యుల్ల
సిల్లుచుఁ దటాలునఁ గచ్ఛపింబోలె నొకచో మునింగి
క్రుంగనిరయమ్మున మకరిపోలిక హత్త నున్మత్తవేదండ
మ్ముతుండమ్మున కందచందమ్ముల యక్షరాభ్యాస మీ
నొప్పు నొకపైఁడలిముఱిపెపుకురువు దిగువభాగమ్ముం గర
కిసలయమ్ములం గొనఁ బూను నాలో స్మృతిపథమ్మున
కవతరించిన గజేంద్రమోక్షణకథావిధానంబునం జకితచకి
తమై యలంతివెఱఁ గలంతవడి బిగి సడలునప్పాట నొప్ప
రికింపక కరువలి కేఁ దెరువీని నిండుచనుపసిండికుండ లుపరి
భాగమ్మున కొక్కమ్మడి నెగద్రోయుడు మూర్తిభవించి

ధరాతలమ్మున కరుదెంచు పాతాళగంగాతరంగిణి తెఱంగు
దోఁప నీళులపైఁ దేలియాడుచు నించుక తల యెత్తం
బూనునాలోన, ౧౧౧

సీ. దైవమ్ముపనుపున దేవి భాగీరథి
చిటిపొటితరఁగలచివురుచేతు
లనువుగఁ గొనివచ్చి యునిచెనో యన నును
కరువలివాలునఁ గడఁగి తడిసి
పయిఁతల నల్లనఁ బాతరలాడు న
ప్పుద్మపుటమ్ము సుభద్ర కన్ను
దమ్ములతో విప్పి త్వరితగతిం దాని
గుట్టు మట్టు నెఱుంగుకుతుక మాము
కొనఁ బరీక్షించుచుండుడు మునివరేణ్యు
చేత మయ్యది నిశ్వాసవాతసరణిఁ
గొనియె తూఁకొనెఁ దద్గర్భకుహరమందు
నెఱుఁగ దాగోల యాగోల యింతయేని. ౧౧౨

తే. అవలఁ జాలించి జలకేళి హాళి మించి
లీలఁ బోడి కట్టి కౌతుకోల్లోల లవుచు
నరిగి రెప్పటియట్ల యయ్యలరుబోండ్లు
టెంగురంగా యటంచు పీటికి బిరాన. ౧౧౩

సుభద్ర గర్భవతి యగుట

వ. అనంతర మత్తాపసివర్యునమోఘవీర్యప్రభావమ్మున, ౧౧౪

క. చలచలనై పిదపిదనై
కలలంబై విప్పువాటి కట్టినకరుడై
తల సూపి పొదలి గర్భము
నెల మసలెం జీర చిక్కి నృపనందనికిన్. ౧౧౫

తే. మోసె నలడాలు నుజ్జనుమొనలు, మోము
ద్రోసె నెక్కొను వెలిజిగిఁ దొంటిగోము,
బాసె రసన చవుల్, సేసె నాస మృత్తు
పై మది, బలసె గౌను సుభద్ర కపుడు. ౧౧౬

క. ఉద్దయుఁ గలపనబిండిగ
నుద్దాలకశుక్లరససముద్భవగర్భం
బద్ది ప్రవృద్ధము నానాఁ
డుద్దారక మయ్యె నువిదయుల్లమ్మునకున్. ౧౧౭

క. ఆయంతర్వత్నివిధం
బాయత మొరులొరు లెఱింగి యచ్చటితొత్తుల్
కో యని నగికొంచున్ విం
టే యని జనయిత్రికిన్ వచించిరి వెలుచన్. ౧౧౮

క. ఆవెయు నివ్వెఱ నటు నిటుఁ
దోఁపక యొడి నిండి యున్న దుహితం గుమారిన్
దాపము తలబంటిగఁ గని
క్ష్మాపతి కేకాంతమున వగచుచుం దెలిపెన్. ౧౧౯

సీ. ఆవిదర్భవసుంధరావల్లభుండుఁ గ
లంతత్తోడి మెలంతవింతపలుకు
బడులు వీనులజాడఁ బడుపాట వెఱపడి
వేడినిట్టూర్పులు విడిచి విడిచి
పోతుటీఁగకు నేని పొనరి తెర్వడఁబోని
యంతిపురమ్మున నింతలేసి
గోరముల్ సమకూరె నేరీతి? మేలె ము
న్నరిగినవాఁకకు నానకట్టె?
యనుచు నాభీలకరవాలహస్తులఁ గడ
కొలమువారలఁ బిలిపించి యుడియె ముదలఁ
గాఱడవి నిప్ప యీ చెడుగఱపుడొకళ్ళఁ
గండతుండెమ్ము లొనరిచి రండటంచు. ౧౨౦

తలారులు సుభద్రం బాడునాత డించి చనుట

క. పూని తలం దమయేల్గడ
యానతిఁ గఱకులు దలారు లద్దమరేయిం
బూనిన నిద్దురమబ్బున
మే నెఱుఁగని యమ్మెలంత మెయిఁ గొన్న నెఱిఁ. ౧౨౧

సీ. చెకుళ్ళచెమర్పక తకుళ్ళవయస్యల
నిడుదలుకన్నులఁ బిడుకఁ దొడిగి
కొంకు కొస రఱి పర్యంకమ్ముతోఁ గొంచు
నరిగి రొకండు కాఱడవి సేర;

నీరు మోసియ యున్న నిండుప్రాణము నిల్వ
నీరు సేయుటో, ధృతి నెక్కొనంగ
నోడయని ముదలఁ దా గ్గడచని మరలుటో
పాలుపోనిద యయ్యెఁ జాలతడవు

కొసరి నంజఁగాఁ దొడరిన కూర్మిపేరి
కూరచవిఁ జేసి; తుదిఁ గ్రమ్ముకొన్న యిఱుల
భీతిఁ గూరుచు నొక పాడునూత నాపె
డించి నగరికిఁ జనిరి వా రెంచి లగ్గు. ౧౨౨

సీ. పదపడి పొడసూపి పద్మబంధుండు జ
గమ్ములఁ గ్రమ్ము చీఁకట్లతోడ
మెఱుఁగుకన్దమ్ముల మీలనముకుళన
మెడలించి విరియించి మెసఁగునంతఁ
గడవనేరనిత్రోవ నడరిన తనదు నా
గోరంపు టునికికిఁ గూరిన వెఱఁ
గళవళంపడుచుఁ గకావికలై బిగి
సడలి బడల్పడి పిడు గడఁచిన

జాడఁ బోఁడిమి సెడి మతి సన్నగిల్లి
హత్తు నొకమాద్రిస్మృతి నెలుఁ గెత్తి కురరి
పగిది విలపించె దయ్యమ్మఁ దెగడికొంచు
భద్రరూప సుభద్ర యప్పాడునూత. ౧౨౩

క. అత్తటి సమిత్కుశాహర
ణాత్తమతిం గంగదరికి నరుగుచు యోగిం
ద్రోత్తముఁ డవ్వు విశ్వావసుఁ
డత్తరిరుంబోఁడియెలుఁగు నాలించి వెసన్, ౧౨౪

వ. నలువలంకులు కలయం జూచుచు నులివుతెరువునం బడి
చని యనతిదూరమ్మున నప్పుడునూత మూ ర్తీభవించిన
శోకదేవతయో యన వికీర్ణకేశపాశయై యగడుగుడుచు
గర్భగుర్విణి సుభద్రం గని కనికరమ్ము కరమ్ము తిరమ్ముగ
నంతరమ్మున నిరవుకొన వెలిఁ జేరిచి యమ్మా! శోక
మ్ముడుగు; మడఁగనిబెడఁద నదవద యవు; దీ వెవ్వరి
దాన? వి ట్లేల యయితి? కలయుదంతంబు సాంతంబుగ
నా కెఱిఁగింపు మనుడు నవ్విదర్భవసుంధరావరపురందరు
నందని కనుతామరకొలంకులం జాఱిన బాష్పపూరమ్ము
తలిరాకుచేతివ్రేళుల నల్లనల్లనఁ దుడుచుకొనుచు రాలు
పడునలికపుటెలుఁగున ని ట్లని యనియె. ౧౨౫

క. భ్రాఁతిగఁ దొల్లిటిపాపపు
జేఁతల మలినమ్ము నాదు జీవితకథ యీ
వాతన మీ చెవి నింపుట
పూతాత్మా! సుధ విసమ్ముపోఁతయె కాదే? ౧౨౬

క. కడవక రానిది మీనోడి
బడి, వినుఁడు వినుతు, విదర్భవసుధాధిపువం

గడ మన్న తొలసితోఁటం
బొడమితి గంజాయిమొక్క వోలె మహాత్మా! ౧౨౭

ఆ. కావఁ గన్నవారు కంటికి ఱెప్పలై
యలర నద్దు ముద్దు లాకుమఱుఁగు
పిందె నవుచు నాఁడు పెరిగితి నేనిక
కొమ్మన మఱి దాదిఁగొమ్మన ఘన! ౧౨౮

క. అల్లారుబెల్లమై గలు
గల్లున నందియలు మొరయఁగాఁ గాళుల భూ
వల్లభదంపతులుల్లము
లుల్లసితమ్ములుగ నడచునొలపు లొలసితిన్. ౧౨౯

క. అలరితిఁ బువ్వుబోఁడులతొ ద
విలి గుజ్జెనగూండ్లు బొమ్మపెండ్లిండ్లం బిం
పిళు లచ్చనగండ్లం గ
న్నులగంతులయాట లెసఁగ నూల్కొనుకోర్కిన్. ౧౩౦

తే. అవల నవయౌవనోదయ మగుడు ననుప
మానరూపలావణ్యనిధానమ నయి
యొసఁగిన సుభద్ర యనినపే రెసక మెసఁగ
నంతిపురిఁ గాల ములు సోఁక కలరుచుండి— ౧౩౧

ఉ. దయ్యము నెత్తికొలున నెదం దమి గూర నొకండునాఁడు
రా నెయ్యపునెచ్చెలుల్ గలిసి నిష్కుటకేళులఁ జాల

డస్సి యే నయ్యెడ గాంగతోయముల హాయిగ మజ్జన
మాడు వేడుకం జయ్యన నేగితిం; బొసఁగె సాధువరా!
యొక వింత యంతలోన్. ౧౩౨

క. కొనకొను నిమజ్జనోన్మ
జ్జనములఁ బద్మపుట మొకఁ డెసఁగి యోగిజనా
గ్రణి! చేదామరఁ బడియెం;
బనిగొని యద్దాని విప్పి పరికించితి నేన్. ౧౩౩

చ. అటిముటి మింటిమానికపుటచ్చపు వెల్గులఁ బ్రోదిసేయనై
మెఱయుచుఁ దేజ మొండు పొడమెన్; వడి నూర్పుల
తోడి నివ్వెఱం దఱుఁగక మూసికొంటిఁ గనుదామర
లా మెయి నేమి యయ్యెనో యెఱుఁగఁ దపస్వివర్య! ధరి
యించితి గర్భము దుర్భరమ్ముగాన్. ౧౩౪

ఆ. కడచిచన్న రేయి కాందారిమాందారి
ప్రొద్దుదాఁక నంతిపురమునంద
సెజ్జపైని జెక్కు సెదరఁ బోకయ యుంటి
నిట్టిగతికి నయితి నిప్పు డనఘ! ౧౩౫

ఆ. కడవ నరువుఁ దెరువు నడరని యెడరు పే
రింటి కడలి మింటి నంట నవుక
రుళ్ళ బ్రుంగి యల్లతల్లడ గుడుచు నా
కీవ తండ్రి! తెప్పవై వెలసితి. ౧౩౬

క. పాలితకరుణారసపూ
రాలోలశుభావలోకనా వేల! దోసం
గేలని కన్నెను నన్నుం
బాలింపంగదవె తండ్రి! పరమాప్తుఁడవై ౧౩౭

మ. అని నెకోంల్గాను నెవ్వగం గుడుచునయ్యబ్జాక్షిఁ జూలాలి
నొయ్యన విశ్వావసుయోగిపుంగవుఁడు నమ్మా! యజ్ఞ
తాంధ్యమ్ము క్రమ్మి నినుం జేసిరి కానపాలు పితరుల్;
మే లౌ నిజ, మ్మూను మెచ్చినధైర్య మ్మిఁక నంచుఁ జేర్చె
శుభదస్వీయాశ్రమప్రాంతముక్. ౧౩౮

క. అయ్యాశ్రమరాజమ్మున
నయ్యంతర్వత్ని పార్థివాత్మజ యింతేఁ
గ్రుయ్యక డయ్యక యెయ్యెడ
నొయ్యన నొకకొన్నినాళ్లు లోలిమిఁ గడపెక్. ౧౩౯

మ. వెలయం బ్రేముడి మాఱుతండ్రి తన కవ్విశ్వావసుం
డొప్పఁ గన్నులు వేలై యెడ యీక సాఁకతమునందుక్
ముఁన్గియే యున్న నచ్చెలి వాల్గన్నుకొలంకు లొకొంక
తతిక్ స్వీయస్మృతిం జేసి యశ్రులు వెల్వర్చుచునుండు;
నవ్వా భువి స్వర్లోకమ్ము మీఱుంగదా! ౧౪౦

వ. అమ్మెయి నొకకొన్నిదినమ్ములు సనినయావల నొకనాఁటి
శుభముహూర్తమ్మున, ౧౪౧

సుభద్ర కొమరుం గనుట

సీ. మునివర్యుఁ డుద్దాలకునమోఘవీర్యమ్ము
మునుకొని లోన తూఁకొనినచొప్పు,
సంశుద్ధచరిత నిజజననిసౌభగ
ప్రథితి జగమ్ములఁ బ్రకటపఱుచు
కుతుకమ్ము మది గుబురొల్క నియకాఁబోలు న
కామినీమణి నాసికాపుటమ్ము
వివరమ్ముననయుండి వెడలె వేవురుధాము
నిధులఁ జీరికిఁ గొనువిధ మెఱుంగఁ

బోని తేజున రాజిలుమేన నేధ
మానయశుఁ డొక్కరుం; డప్పు పూనె దెస ల
నూనగతిఁ బ్రసన్నత, మలయానిలుండు
సూనసౌరభవాహుఁడై కాన మలసె. ౧౮౨

క. అనిసుఁగుపేరికై రవి
ణీనాథుమహోదయమ్ము నెఱి మెఱయ మునీ
జ్ఞానసరత్నాకర మ
త్యానందతరంగభంగ మవుచుఁ జెలంగెన్. ౧౮౩

తే. పరమయోగిపుంగవుఁడు విశ్వావసుండు
నిండుగారాము మాఱాకు నెగడి తోడుగ
సంస్కృతిస్ఫీతు నాసికాజాతు నా ప్ర
పూతు నాసికేతుఁ బొనర్చె మురియుపేర. ౧౮౪

తే. వాసి నావిర్భవించిన నాసికేతుఁ
డాతఁడును సుభద్రాకన్య కవుచు నెడఁద
ముల్లు నల్లారు బెల్లమ్ముఁ బొదలఁ జేసె
శోకహర్షాశ్రుపూరము నాకెకనుల. ౧౮౫

వ. ఆజాలున నొకకొన్ని నాళులు గడచుపిదప నొకనాఁటి
ప్రొద్దుపొడుపున. ౧౮౬

సుభద్ర నందనుని గంగలో విడుచుట

ఉ. కన్నుల కద్దుకోఁ దవిన కన్నెఱిక మ్మెఱివోవకునికి కా
కన్నియమిన్న యన్నెఱినిఁ గన్నతనూజుని మందసానఁ
బ్రచ్ఛన్నుఁ బొనర్చి పేర్చినవిషాదము శీర్షముబంటి
గాఁగ నిన్నన్న! సురల్ దయం గనెద రంచుఁ ద్యజించెఁ
గడంగి గంగలోన్. ౧౮౭

తే. ఎండకన్నును వానక న్నెఱుఁగఁబోక
యాకుమఱుఁగు మేల్పిందె యై యంతిపురి మె
లంగునాకన్నె గొంతిజాడన పొనర్చెఁ
గడుపునం గన్న నిసుఁగును గంగపాలు. ౧౮౮

చ. కనికర మింత లేక తనకన్నపులుంగు విహంగిభంగి గంగ
నటు జనిత్రిచే విడువఁగాఁ బడినట్టిడు వానిమందసంబును
బరివాహ వేగమున మున్గొని మున్గక తేలియాడుచుం దనరఁ
బయానముం జలిపె దైవము సూపినబాట సూటిగాన్.

వ. ఆపయిఁని, ౧౫౦

ఉద్దాలకునకు నాసికేతుమందసము దొరకుట

మ. ఘనుఁ డుద్దాలకమౌని శేఖరుఁడు గంగాస్వచ్ఛపూరావగా
హనిరూఢిం దగి కర్మసాక్షి కొగి నర్ఘ్యమిచ్చుచోఁ
డాయవచ్చిన యప్పేటిక విప్పి యొప్పినరుచిశ్రీమించు నంగ
మ్మునం గనువిందుం బొనరించు నంచితు ననంగ ప్రఖ్యు
నయ్యర్భకుఁ. ౧౫౧

చ. కనుఁగొని మెచ్చు నచ్చెరువు గ్రమ్మి మన, మ్మగుపాటి
నాఁటి ప్రామినుకుల వేల్పుపలుకు పస మీఱి తలంపున
కెక్క, నాతఁ డిచ్చినతనూసూతి యీతఁ, డిది సిద్ధము,
సిద్ధుఁడ నంచుఁ గొంచుఁ దా విని పని కూర్మి పేర్మిఁ
గనఁ బెంచఁ దొడంగె నిజోటజమ్మునఁ. ౧౫౨

క. ఉద్దయు నొద్దిక నద్దుఁ
ముద్దుఁ మురిపెమ్ము మురువు మాటలుగా భూ
భృద్గుహితృసుతుం డాతం
డుద్దాలకుసాఁకతమున నొలసెఁ బ్రవృద్ధిఁ. ౧౫౩

ఆ. ఎంత కొప్పదు విధి? యేడ మౌనికులేంద్రుఁ?
డేడ రాజుకూఁతు? రేడఁ గాను?
పడవియామలకముఁ గడలియుప్పును గూడి
యౌమె నొక్కరుఁడు రసాయనమ్ము. ౧౫౪

వ. అది యటు లుండె, ౧౫౫

సీ. కడుపుమీఁదుగఁ గన్న కొడుకు నెడమచేత
 పేరింటి పేర్గాము వెంట నంటి
నడునెత్తి మొత్తి యల్లడతల్లడము గట్టి
 కుడిపించుడు నగడు గుడిచి కుడిచి
కళవళంపడి కాలు నిలుచుపాటిని దాఁటి
 పూని విశ్వావసునాన యాన్న
పాత్మజ విడువక యరయుచుఁ గన్నులు
 వేనకువేలుగ విపిన మెల్లఁ
దటిసి లలి జడదారి యుద్దాలకునిఘ
నాశ్రమప్రాంత, మాపొంత ననువుపడిన
మేలిపికిలివిందులతోడి ఖేలనముల
విఱ్ఱవీఁగెడు నొక రాచకుఱ్ఱవాని, ౧౫౬

సుభద్ర కొడుకును గుఱుతించుట

చ. కనుఁగవ విందులం గుడువఁగాఁ గని ప్రేఁకనిచన్ను
దోయిచేపునొలపు స్వీయగర్భ మవుపోఁడిమికిన్ ధ్రువపత్ర
మీయ డాయ నరిగి మేలు బాలక! త్వదాకృతి, యెవ్వరి
వాఁడ? వుందు వెం? దొనరినతల్లిదండ్రు లెవరో యెఱిఁ
గింపుము నాకు నావుడున్. ౧౫౭

చ. విన వచియించె నవ్వెలఁతి, వీరజనిత్రి! పవిత్రగాత్రి! పా
వనుఁడు మునీంద్రుఁ డొక్కరుఁడు పక్కము చుట్టము

నన్గదంబ్రడి; యాఘనుకృప గంగపాలయియిఁ గ్రమ్మఱ
నిమ్మెయి నిమ్ము గంటి; నాజననిమొగ మ్మెఱుంగువిధి
సాలదఁ; బేరిఁట నాసికేతుఁడఁట. ౧౫౮

సీ. అనుడు నెక్కొల్గొన్న యరుసమ్ము పేరిటి
రసముపూరమ్ము పారమ్ము మీఱి
క్షణమున మానసకాసార మది యెల్ల
వెల్లువలుగ నిండి విరిసినకను
దమ్ముల బాష్పామృతమ్ముగా సారమ్ము
నన తోఁగి మయి పైఁడినవలతీవ
యమరినపులకాంకురముల నీరంధ్రమై
చెన్నారఁ గన్న నయ్యన్నమిన్న
కడఁగి నానోముపంట, నాకన్నతండ్రి,
నానిధానంబ, యం చక్కనం గదించి
నాక్కుచుం జెక్కుఁ బల్మఱు నొడల నిడు
చుఁ గుడిచె వచింపఁగారాని సుగ మొకండు. ౧౫౯

వ. పదంపడి పొసంగినకనుమూఁతలతో నియత్త జుహా త్తని
పించి నించుప్రేమాతిశయమ్మువలనిగాఢద్యమ్ము నంచుకిం
చుక యెడలించికొనుచుఁ గొండొకవడికిం దెప్పరిలి యప్ప
డంతి యి ట్లనియె. ౧౬౦

మ. కనునయ్యుత్తారకాలమంద ధుని నిక్ గారుణ్యముం బాసి
త్రోసినరాకాసి యదే, ధ్రువమ్మనలు పూసెం బో సుఖ

ద్రాహ్వయమ్మున కీయూసున నాసికేత! తొలి యేపున్నె
మ్ము చేఁ జేఁ బొనర్చు నెఱిం గంటినొ కన్నుపండువుల
కూర్పుల్ గొల్పితీ మెల్పునన్. ౧౬౧

చ. అది యటు లుండెఁ బుత్రక! మహామహితాత్ముఁడు కూర్మి
పేర్మినిం గొదఁ గొనఁబోనిమానితుఁ డకుంఠతపమ్మున
కిమ్ము నమ్మనిందిరదయితుపుణ్యమాశ్రమపదమ్మునకున్
ననుఁ గొంచుఁ బోదె, తత్పదముల వ్రాల్చి మస్తకము
పావనజీవన నౌదు నాదటన్. ౧౬౨

వ. నావుడు— ౧౬౩

మ. అదె రారమ్ము ప్రఫుల్లహల్లకమరందాస్వాదహల్లోహలో
న్మదభృంగస్వనహృద్యమా సరసుపొంతం బొల్చు నత్తీర్థ
సత్పదుపుణ్యాశ్రమ, మంబ! కన్గొనితె, పూర్వద్వేషమున్
మాని యొండుదెసం బ్రీతి మెలంగుచున్నయది జన్తువ్రాత
మాచెంతలన్. ౧౬౪

మ. అని యుల్లాసము పొంగువాఱుమది నొయ్యన్ సింగఁడుం
బూరఁ డౌచు ననుంగుంగొమరుం డతం డిటు లిటంచు
జిన్ని చేఁ జూపుచొప్పున నప్పైఁదలి మానిరాట్టునుటజమ్ముం
జేరఁగా నేగె దేహనిరూఢిం దనరారుదుష్కరతపస్యాసిద్ధి
నా బుద్ధిమై. ౧౬౫

తే. హరువుమీఱమి వెలుపలిదైన యరుగు
పైని బ్రుసి కమండలువు మున్నైనన పరిక

రమ్ము లమ్ముని సాష్టాంగ్రణామ ప్రాదిసీమ
తల్లికిం జనియునిక నందనుఁడు నుడువ, ౧౬౬

సీ. మేలయ్యెఁ గడు, ననుకూలమై కాలమ్ము
కలిసి రావలయు నీకరణిఁ గాదె
ఘనఫలావాప్తికి, నని యామకొనినకె
లస మోముకొనఁగ నా లలితగాత్రి
మునుకొని యాశ్రమమును నలువలఁకులు
సమ్మార్జనమ్మునఁ జక్కబఱిచి
యలికి ముగ్గులు వెట్టి యందందు దర్భాస
నమ్ము లమరిచి సందర్భశుద్ధి
బొసఁగ ముంగిట మొదవునెన్నొసటఁ బసుపు
కుంకుమ మ్మిడి యాబెయ్యఁ గుడుఁవ విడిచి
పూవు లక్షత లింధనములును జింక
తోలు సవరించి యుంచె నిల్లాలువోలె. ౧౬౭

తే. అచట సమ్మానికులకలశాంబురాశి
పూర్ణశశి గాంగజలములఁ బొదలునియతిఁ
బొనరిచి వగాహముం ద్రయీమూర్తి కెఱఁగి
ప్రణవమహితపరబ్రహ్మమును జపించి, ౧౬౮

సీ. సిగచందురుని రేక చిందిడా దిగజాతె
నా బూతిపూఁత మేనక వెలుంగ,

నొసటిచిచ్చుఁటకంటియె సఁగు కెంజిగి మెయి
నలమెనాఁ గావివల్వలు దలిర్ప,
మ్రింగినచేదు తోడంగు మొల్కు లనంగ
జడలు గడ్డములు మీసలు పొసంగ
నలువారుగజమజినము కకపాల మై
డాపలిచంకఁ గడంగి యిముడఁ,

బునుక కేలఁ గమండులువుగఁ, దలవిను
వాఁక చూడ్కుల దొలలు కృపారసమ్ము
జాలుగా, వెండికొండరాసామి గొన్న
తబిసివేసమ యిది? యనఁ ద్వరగ వచ్చి, ౧౬౯

ఉ. తొల్లిటియట్లు గాక కడుఁ దోరమ్మై రహిమీఱుస్వాశ్రమ
మ్మల్లనఁ గాంచి సంతసము నబ్రము నొందుచు నాసికేత!
యేసల్లలితుల్ పొనర్చి రిటు చయ్యన డాఁపక తెల్పు
మన్న నాతల్లి యటంచుఁ బల్కె వలితమ్ము కుతూహల
మొప్ప నాతఁడున్. ౧౭౦

శా. అంతన్ స్వాంతమునన్ గుబుగ్గొనునవేలానంద మిర్వొం
దఁ దత్కాంతారత్న మెచోట? మాట లివి పుత్రా!
బూటలా? యంచు నహ్వాంతం దీవలయింట నొక్కకులు
కుంభూదీవమై వింతలా కాంతుల్ చిమ్ము మెలంత కిట్లను
రసాత్కంర్యమ్మునన్ మౌని తాన్. ౧౭౧

చ. పొలఁతులమిన్న! యీ ప్రొసరేఁబొ పొసరించినచేఁత లెల్ల
నిల్లలిఁ గనుదోయి యీడవు ఫలమ్మును గాంచునెఱిం
గృతార్థతాకలితుఁడ నిం కిటం దడవఁగా జను తీవియ
కాలిక్రింద నిమ్ములు గులికెన్ మదాశ్రమము మునొఱని
మెట్టితిగా స్వయమ్ముగాన్. ౧౭౨

క. వినితే వనజానన! నీ
యనుఁగుంగొమరుం డితండ యవునట్టేఁడు నా
కును నట్టేఁడ యన నించుక
వనితా! మన వావి వరుస వలవదె తడవన్? ౧౭౩

ఉ. ఈమెయి నబ్బురంపడఁగ నేమిటి కిట్లవుఁగాత మంచుఁ
జొమోములసామి మోముపయి మునొఱని మున్నె
రచించి యుంచె నం దో మృదులాంగి! నా కల సుతో
దయపూర్వక మైన పెండ్లి తానే మొగి నోటిమీఁదుగ
విధించె విధిత్వముప్రౌఢి రూఢిగాన్. ౧౭౪

వ. అది యెత్తెఱంగునం బొసంగు? నెఱుంగ మదంతరంగమ్ము
గడుంగడుం గుతుకమ్మున కిమ్మయి యెసంగు నను దేని
వీను లిడి విడువక విను మని మును తనతోఁ గొన్న నాక
లోకనివాసాభిలాషమ్మును దల పెట్టిన యనన్యసామాన్య
తపస్యావిశేషమ్మును నశేషమ్ము లవయవమ్ముల సంశో
షమ్మును మునికుల మ్మును పాలవెల్లికరుళ్ళకుం బున్నమ
నాఁటియమృతాంశుమంతుండు సుమంతుని రాకయు నిజ
మనఃకేదారమ్మునం దల సూపి యేపొందిన బత్తిపేరింటి

**మో**కయు సుమంతుప్రశ్నోపక్రమణమ్మును స్వాభీష్ట
వివరణమ్మును దద్వర్ణితతత్తపస్యావిరమణపూర్వకసరూప
కన్యావతణైకశరణనిలింపపురీఫలావాప్తిప్రకరణసారమ్మును
బోడమిన తనమనోవిచారమ్మును సత్యలోకమ్మునకుం
బనివింటయుఁ బలుకుముత్తో యనుంగుమగనిం గనుఁ
గొంటయుఁ గర్జ మ్మానతీ వేఁడుటయుఁ గొమరుం డొద
వినపదంపడి పడఁతుక నొకర్తు చెట్టవట్టం గలాఁడవు
పొమ్మని ప్రామినుకులఱేఁ డాడుటయు నద్దానం గకవికలై
కొందల మ్మందు నెడందం దిరిగి మందాకినీతీరమ్మున కేతెం
చుటయు నెద్దియుఁ బొలుపొక కాలు గాలు బిడాలమ్మై
యెట్టకేలకుఁ దప మ్మొనరింప నిశ్చయించుటయుఁ
బాయనివనితారూపచింతనమ్మునం దవులుటయుఁ దపమ్ము
గంగం గలియుటయు రేతః పతనరీతియు భూపతనభీతియుఁ
దమ్మిపూ వొకండు పుటమ్ముగ ముడుచుటయు నద్దాన
రేతమ్ము గుప్తమ్ము సేసి భాగీరథీవారిపూరమ్మునం
జాఱవిడుచుటయు మున్నుగాఁ గల కత యెల్లఁ దెల్ల
మ్ముగఁ దూచా తప్పక పూసగ్రుచ్చినచొప్పునఁ జెవి
కెక్కం జెప్పి వెండియు నాతం డిట్లనియె. ౧౭౫

సీ. మఱచితివో యేమొ మెఱుఁగుబోఁడి! యనుంగు
చెలులఁ గూడియమాడి జలకమాడు
వేడుక తల మున్గి తాడిపోడవున నో
ప్పారునప్పట్ల భాగీరథీధు

నిం జేపడినదాని నెలతుక! విప్పి నీ
పూరక పరికించుచున్నయంతఁ
గొనకొని నీగర్భకుహరమ్మునం జేరె
మత్తేజ ముచ్ఛ్వాసమారుతమ్ము
మార్గమున, దాన నలి నెల మసలి చీర
చిక్కె నీ, కది దొసఁగను చింత గాదు
రంత, మంత మొందింపుఁ డం చలుక నిడియెఁ
గఱకుమాలల కాన నీకన్నతండ్రి. ౧౭౬

తే. వారుఁ గొని చని యానిసిఁ బరఁగుకూర్మి
నునుఱు గొన నొల్ల కా నూత నునిచి చనిరి;
సుదతి! వఱువాత విశ్వావసునిశుభాగ
మనము మున్నుగ నీయెఱింగిన తెఱంగ. ౧౭౭

వ. అటు లవ్వుటం జేసి, ౧౭౮

క. తగవా? మగువా! యీతెగ
బిగు వాఱనిసందియమ్ము బ్రీడాభర; మె
చ్చుగ నచ్చుపుబ్రేముడి క్రొం
జిగురాకుం జేత నింకఁ జేఁ గొనఁ గదవే. ౧౭౯

క. పాలితలోకోత్తరగుణ
జాలవు, శుభశీల! నిన్నుఁ జాలునియతి ని

ల్లాలుగఁ జేకొనువలఁతికి
ద్యోలోకము కేలఁ బండుటుసిరిక కాదే? ౧౮౦

క. అనవుడు నచ్చెరియ మ్మొ
చ్చినవెల పిరిగొనుడుఁ జిత్తసీమం బూదీ
వనెఱిం గంపించుచు ని
ట్లనుఁ జకితకురంగనేత్ర యాపె తపసికిన్. ౧౮౧

ఉ. ఓమహనీయ! మీయెఱుక కొక్క రవంత యెడమ్ము
లానెఱిం బ్రామినుకుల్ సెలంగమి తిరమ్మో, చిరంతన
ధర్మమర్మముల్ మీమది పేరిపేటిక లలిం బదిలమ్ములు
మానికమ్మొ, లానో మముబోంట్లపల్కు మహాదుక్తితిర
సత్కృతిదుష్ట మీ మొగిన్. ౧౮౨

ఉ. ఇన్నెఱిపోక వీఁక నడిపించెనుగాక ననున్ విధాత యే
యన్నెము పున్నెముం దెలియ కంతిపురిం దలిదండ్రిచాటు
లా కన్నెల కెట్లు గల్గు నధికారము? కోరిక యంకురించుఁ
గా కన్నిట నీడు జోడు నవు నన్నుఁ దనంతన చెట్టవట్టఁగాన్.

తే. కానఁ బనివిని యిపుడ మాకన్నతండ్రి
పాలికిన్ వాని యొడబాటు వడసి వచ్చు
వార యేనియు నున్నె మీపలుకుబడికి
నడ్డగల్గు యొకండు మహామునీంద్ర! ౧౮౪

ఉద్దాలకుఁడు సుభద్రం బెండ్లియాడుట

చ. అనవుడు నొప్పుచొప్పదియ యంగన! నందనుతోడ
నాశ్రమమ్మున సుఖ ముండు మీ వనుచు భూరితపోధనుఁ
డాతఁడుఙ విదర్భనృపుని డాయఁగఁ జని సుభద్రయెడఙ
దోసఁ గింత లేమి యవ్వనిత సుగాన నునికి తనవచ్చిన
చొప్పు నెఱుంగఁ జెప్పుడుఙ. ౧౮౫

చ. పొదలుముదమ్మునం బ్రిదిలి పో మది తేఁ డనుఁ గూఁతు
నీఁ బదింబది యిటు వేఁడఁగావలెనె? మానిప! మీకృపఁ
గంటి ధన్యతఙ, విదితగుణుండు విష్టపసువిశ్రుతకీర్తి
వరుండు యోగ్యతాస్పదుఁడు తనంతఁ దాఁ దటియుభాగ్య
మ దెంతటిగేస్తుకో కదా! ౧౮౬

శా. సంకోచింపక యంచుకించుక మదిం జార్వంగి నాకూఁతు
మీ రింకం గూరుచుసోమిదమ్మగఁ గొనుండీ యన్న మాని
ప్రభుం డంకూరించినకోర్కి నాశ్రమము నొయ్యం జేరఁ
గా నేగి యప్పంకేజాననఁ బెండ్లియాడె విధిలబ్ధ మైన
మర్యాదతోఙ. ౧౮౭

తే. వారు వారని సమ్మదప్రౌఢి రూఢి
మెఱయ గృహమేధిధర్మముల్ నెఱపుపాడి
మేలుబంతులమై మునుల్ మేలు మేలు
నాఁగ భోగించి రెన లేని భోగలీల. ౧౮౮

వ. ఒకనాఁడు ౧౮౯

సీ. పుత్రు నపూర్వచరిత్రచిత్రితు నాసి
కేతు నుద్దాలకఖ్యాతమౌని
ముద్దును మురిపెమ్ము మురువారఁగా దరి
జేరి సమిత్కుశ లేరి పరువు
పసుపున రమ్మని పసుప నుత్తముఁ డాతఁ
డానెజి వని కేగి వానిఁ గొంచు
నవుడెంచు నడుచక్క నను వయి కనుపందు
వులు గూర్చు నొకఁడు దేవలముహారువు

తెరువు గా నడకట్టుమంతర మచోట
నిలిచి యలవునఁ దల నూపి యలముకొన్న
నిండుకోరికి పేరిమి నిగుడఁ జలుపఁ
బూనె ఘోరము తపము మహానిరూఢి. ౧౯౦

తే. కడఁగి మానసాబ్జాంతరకర్ణికాస
నమున నిల్పిన భవుపూజన మ్మొకండ
కాక యెఱుఁగఁ డన్యంబు దుష్కరతపోఽవి
రాముఁ డా బాలుఁ డాత్మాభిరాముఁ డవుచు. ౧౯౧

తే. అవల నొకకొంతకుం దప మతఁడు మాని
విప్పి కనుదమ్ము లయపంపు వేగిరింప
దత్తరంపడుచుఁ జనె నింధనకుశాదు
లొప్పఁ గరపల్లవమ్ముల నుటజమునకు. ౧౯౨

ఉద్దాలకుఁడు కొడుకుం జా శపించుట

శా. ఆలో నేగుము నార్నెలల్ కినుక కిమ్మై కందనంగాయ
లో నేలన్ గాయపుసాకుల్ దికుల్ సెడి యుద్దే సీల్గు మం
చుం దపోజ్వాలాభీలము వాక్ఛరమ్ము సుతుపైఁ బాటించె
నమ్మౌనిరా ప్లైలా వేలు! భవిష్యవేత్త లుఱ రింతేఁ గన్న
వారేనియుణ్. ౧౯౩

తే. అంత మూలమ్ము నఱికిన యవనిరుహము
వ్రాలె నిల్చిన నమ్రమోలఁ గూలె నేల
మూఁతలం గొనుకనుదమ్మిపువ్వులతోడఁ
బుత్త్రిఁ డాతఁడు; రిత్తయే మునులనొడువు! ౧౯౪

తే. కొన్న చెమ్మటబొట్టులఁ జెన్ను సూపి
కలలు దఱుఁగని వానిమొగమ్ము నేల
పా లయియు నేలె నమృతము జాలువాఱు
నిండుచందురుకందనినిగ్గుజగ్గు. ౧౯౫

తే. కొడుకునప్పాటుతోఁ బాటు పిడుగడఁచిన
వడువునం గన్నతల్లి సుభద్ర స్పృహా దొ
ఱంగి క్రుంగినపస నుటజాంగణమునఁ
బడియె; సుతుఘాత మది మాతకడుపుకోఁత. ౧౯౬

సీ. ఒకకొంతవడికిఁ దా నొకయింత తెలివొంది
యా మునిసోమునిసోమిదమ్మ

దిగబాటి సిగమీాఱు వగపేరి కడలి పొం
గులు వాఱు కన్నీటియలలలోన
దిక్కఱి యుక్కిరి బిక్కిరి యాౌచు గ
ర్భజునియకుక్కణపమ్ము బుజముల నిడి
మోచికొంచును మాఱుమ్రోయఁ గెలంకు లె
లుం గత్తి కురరి తెలుంగు దోఁప
ననదపోలిక వాపోవుచు నతికరుణ
వృత్తి భువనపావని జాహ్నవీసరిన్మ
తల్లి దరిఁ జేరి బిరబిర దర్భశయన
మొక్కరుం డమరిచి పేర్చి యునిచె దాన. ౧౯౭

శ్రీదేవిదయ నాసికేతుఁడు పునర్జీవితుఁ డగుట

తే. అవల మొలబంటినీటఁ గృతావగాహ
నై నిలిచి మది నిలిపినయాదిశక్తి
యడుగుకెందమ్మిలే కంటికగ్గములుగ
మాని వెలిజోలిఁ జలిపె ననూనతపము. ౧౯౮

తే. ఎఱుఁగ దయ్యోగినీమణి యిన్ని నీళ్లు
లాకు నల మొక యింత యాహార మెదియుఁ
గడుపుసొద మాన్పికొన మాతృకాపదాబ్జ
యుగలచింతనామృతపాన మొకండె తక్క. ౧౯౯

సీ. ఆలలిఁ బవళులు రేలును దొమ్మిది
కడచి చనెంగాని, తొడిఁబడ దొక

వీసమ్మువాసియు నాసతీరత్నమ్ము
పూనినఘోరతపోనిరూఢి;
పదవునాఁడు జగమ్ము బందుగునరదమ్ము
పొడుపుగుబ్బలితల నడరువేళ
నట్టిపట్టుల నొప్పు నంశుమంతుల వేవు
రం గాదు పొమ్మన భంగపడని
పరువు మేనితళ త్తళ లిరవుకొనఁగఁ
దొత్తులై సత్తి సత్తులమొత్తముల్ సు
రాంగనలఁ గూడి కొలువ నప్డగ్గమయ్యె
నాకెకనుదామరలకుఁ ద్రిలోకమాత. ౨౦౦

తే. అంత నింతింత యనరాక యలముకొన్న
యరుస మాదృతి భక్తి విహ్వలతఁ గూర్పఁ
గూర్చి కై మోడ్పు నంచితోక్తుల నుతించు
నాపెకుం బ్రీత చిత్కల యనియె నిటులు. ౨౦౧

సీ. మేలు మెలంత! నీమెఱయుతపఃపరి
ణతి మేలుబంతివి సతులకెల్లఁ
గడుపులోపలిచల్ల గదల కంతిపురాన
సుగముండు నీకె యీయగడుగుడుపు?
లోదవినమీఁద నాపదములకన్కలి
నిఖిలతాపములుఁ గుందేటికొమ్ము

లై సిద్ధు లెనిమిది యరచేతియుసిరికల్
గా మనీషులు మిత్తి గడచువారు;

మేలిముత్తోరతనములమివులుభక్తి
సార మాఱని వరవులపేరి మధుర
ఫలములారగింపులఁ దృప్తి నోలయుచుందుఁ
గూర్చి వారల కోరినకోర్కు లెలమి. ౨౦౨

తే. భద్రశీలశాలీనతాముద్రితా! సు
భద్ర! నిర్ణిద్రనియతి నీమాద్రి నన్నుఁ
బాడితివి, నాళు లివి యిష ప్రతిపదాది
భావితము లాట పరకపైఁ బా వొకందు. ౨౦౩

ఉ. ఏకెలనం గలార లోక యించుక యంచుక యీడు రాఁ
గలా రో కలకంఠి! నీకు, నిఁక నొకఁడునా నొకఁడేని
యీప్సిత మిమ్మక మనమ్మ నిల్వరము నెన్నను, క్రన్నన
వేఁడుకొమ్ము, నీవాఁకిటఁ గట్టివై చితివి భావిని! కామగవిం
గృతార్థవై. ౨౦౪

క. అనవుడు నయోగ్యగిని యి
ట్లనుఁ గొనకొనుబత్తి యరుస మలముకొన జగ
జ్జనని! భవత్కరుణాలో
కనభాగ్యముకన్న వర మొకఁడు గావలేనే! ౨౦౫

వ. అట్లయ్యును, ౨౦౬

క. సుతిని సతికి గాక మఱొ
క్క తెరువుం గతి యున్నె? కన్నఘను శాపమునా
హతిఁ గూలిన సుతు నంచ
ద్గతిఁ గొనుకృపఁ గడుపు చల్లగా నొసఁగు మమా! ౨౦౭

వ. అని వేఁడుటయు, ౨౦౮

మ. అను నిట్లంబిక మానిపత్ని! యెపుడే నొపాటిదే సీతలం
పునరున్ వేఱొకమాడ్కి? చూడ్కి యమృతంపుంజల్లులన్
నిద్ర లేచినవాఁడట్లు తెల్వి నొందుట సుసంసిద్ధమ్ము
నీపట్టి; యిప్పునిఁ దా మెచ్చునొ యెచ్చునో కినుక
నీప్రాణప్రియుం డాత్మలోన్? ౨౦౯

క. మగఁడే మగువలమిన్నకు
మగుదా! చుట్టమ్ము పక్కముం దైవము తో
డు గతి, యతనితలలో నా
లక్కఁ దలఁపు నెఱింగి పోక కలికికిఁ దగ వా. ౨౧౦

క. కావున ననువవు చనవున
నీవల్లభు వేఁడుకొమ్ము నీలాలక! త
ద్భావ మ్మెటు లట్టుల యాఁ
గావుత మని చనియె జననికనుఁగవ కెడమై. ౨౧౧

వ. పదంపడి యమ్ముదిత ద్రుతగతిం బతిం దఱియనరిగి గిరికొని
నభక్తిభావమ్మున నడుగుకెందామరలపై వ్రాలి జాలువారు

సమ్మదాశ్రుపూరమ్మున నభిషేకించుచు వ్రేలిక్రొందలి
రాకుల ఘటితపాణిపుటమ్ము లను ఫుల్లకల్హారమ్ములఁ
బూజోపచారమ్ము ముగించి లేచి సాదరమ్ముగ నిబద్ధ
మ్మంజలి నలువారఁ దనతపోరూపమ్మును దేవిసాక్షాత్కా
రమ్మును వరప్రదానమ్మును దత్తద్విరచితవ్యవస్థయు
వినిచి ననుచుననురాగమ్మున ముద్దు మురిపెమ్ముల మురు
వునంగు ననుంగునిసుంగు చెంగునఁ జేతనతం గొని కను
పండువులు సేయుటో పాయని శాపోపహతి నా పగిది
రూపు సెడి భూతపంచకమ్మున లయమ్ము సెందుటో మీ
యభీష్టమ్ము సెల విం డని వేఁడిన ననూనగతి మతి నిరవు
కొను నరుసమ్మున నుక్కిరి బిక్కిరి యవుచు నమ్మునికుల
గ్రామణి యమ్మానినీమణి కి ట్లనియె. ౨౧౨

ఉ. ఓ సురవర్ణనీయసుగుణోత్తర! ఓశుభశీలశాలినీ!
యేఁస తలిర్ప నీమకర మర్థిఁ గొనం గల పేర్మి నాతప
మ్మానరి వాసి వన్నియ గడించెఁ గృతార్థుఁడ నింకఁ
బిల్వమా మూసినము త్తియ మ్మగుచుఁ బొల్పెసఁగన్
మననాసికేతునిన్. ౧౧౩

క. అనుసానుడిఁ దట్టుచు వీఁ
పున నిద్దుర లేపినట్లు బుడుతఁ డతఁడు వి
ప్పినకనుదమ్ములతో లే
చి నలుదెసలు సూచి మ్రొక్కె శ్రీజాహ్నవికిన్. ౨౧౪

వ. పరుగుపరుగున నుటజమ్ము సేరం జని చెనసినభక్తిభావమ్మునఁ గన్నతలిదండ్రులపదమ్ములపైఁ  ద్రాలుటయు వారుం గారాము కూరిమిఁతోఁ జేయిం గలిపి పేరిమి మీఱఁ గొడుకు లేనెత్తి చంక నిడుకొని ముద్దాడుచు నమందానందమ్మునఁ గందళితమ్ము హృదయారవిందమ్మునుండి కనుకొలంకుల వాలున జాలువాఱు రసపూరమ్మున మునింగి వచింప నలవికాని యొక మహాసుఖమ్మనుభవించి మించి; రా పయి నపాయ మ్మెయెడం బొరయని తపోనిరూఢి నాదంపతులు మునికులమ్మునకుం దులలేని యలంకారమ్ములుగ భాసిలిరి. కావున ద్రోవదీ! నవరాత్రావసరమ్ముల భువనేశీపదరాజీవసేవనప్రభావవైభవ మ్మింతింత యనఁ దలము గా; దవ్విధి మునుంగు నంచితులఁ దేటిపాఱఁ జూడ దండధరుండ గుండె లవిసి బెండువడునని తనసోదరుం డంబురుహోదరుం డాదరమ్మునం దెలుప నలుపము కాని తెరువున మది నిరవుకొన్న భక్తిభావమ్మున నప్పాండవపట్టమహిషి మహిషాసురునుసుఱుపేరింటిపూరిపుడుకకు సుడిగాలి యా లోకమాతకుం బ్రీతిఁ గూర్చి పేర్చువ్రతమ్ములు శతమ్ములుగఁ జేసి కడవరాని కశ్మలమ్ము లనాయాసమ్ముగఁ గడచె. ౨౧౫

క. భూమాయితాకృతి! భట
స్తోమాయితహరిపురోగసురనాథ! శిరో
దామాయితసోమకలా!
వామాయితవామభాగపరమాయోగా! ౨౧౬

శా. లీలాతాండవ కేళికాకలనపాలీ పాండితీమండితా!
శూలాద్యాయుధశాలినీశివకలాశుంభత్కళాసంజితా!
మూలాధారనికేతనై కవిహృతిస్ఫూర్తిప్రభాభ్యంచితా!
కీలాలాగ్నిముఖాష్టధారచితసాక్షీభూతమూర్త్యాయతా!

ఉపే—అనాద్యవిద్యాపిహితాత్మసంవిద్ఘనప్రకాశప్రసితప్రసార
ప్రణీతసంసారసరస్వదూర్మిప్రణున్నమగ్నానులభస్వభావా!

కవిరాజవిరాజితము—

కవిమధురోక్తినికాయనికామవికాసిమహోజ్జ్వలతామలతా
సువివృతభావవిశుద్ధసమృద్ధసుశోభనవై భవు నీ కృతి నా
బ్రవిమలగాత్రికరంబు తిరం బమరం గొని పొంగిన రంగ
మహీధవవరు మాన్యు వదాన్యు సుగణ్యుని ధన్యుఁ బొన
ర్పవె నేర్పు మెయిన్. ౨౧౯

గద్య— ఇది శ్రీ శ్రీవత్ససగోత్రపవిత్ర, చిదంబరపౌత్త్రి
నాగభూషణసుధీవరపుత్త్రి, శ్రీబాలాత్రిపురసున్దరీ
గర్భశుక్తిముక్తాఫలాయమాన, ప్రభాకర, లక్ష్మీ
నరసింహశాస్త్రిసమాఖ్యానప్రణీతం బైన
కాలభాగవతము సప్తమస్కంధమున
నాశ్వినమాహాత్మ్యము
తృతీయాశ్వాసము.

శ్రీరామ

కాలభాగవతము - సప్తమస్కంధము

# ఆశ్విన మాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము

శ్రీమహితప్రణవశిర
స్సీమమహాభూమిలసితచింతితభావ
స్థేమా! భూమమహాకృతి!
సోమారుణవహ్నినేత్ర! శోభనపత్రా! ౧

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదుల కిట్లనియె నట్లు
వినిచిన, ౨

క. విని వీనువిందుగాఁ బృథు
జనవిభుఁ డను మానిచంద్ర! చనఁ దనివుం జు
బ్బనచూఱలు క్రోలి భవ
ద్ఘనవచనామృతరస మ్మొకరవం తేనిక. 3

క. ఓసంయమి! యెద్దానం
జేసి పసందై పులు దిగిచిన మేల్చినుకుం
బూసహరారంగున బుద్ధి వి
భాసిలు నద్దాని నెనరు వఱలఁ దెలుపవే. ౪

సద్బుద్ధివ్రతము

క. అని వేఁడిన వేడుకతో
డ ననుచు కెలసమున మునితిలకుఁ డను జేఁడా!
తనరును సద్బుద్ధివ్రత
మన నొకరుఁడు దాని వితము నాలింపు మిఁకన్. ౫

క. చెన్నడరెడు నేఁడవు నెల
వెన్నెలదొరపొడుపునాఁడు వేఁకువతఱి మే
లొన్నట్టిఁడ యై తద్వ్రతి
చన్నీటం జలుపవలయు స్నానము విధిమై. ౬

క. వర మధిప! నదీస్నాన
మ్ము రెండవురకము తడాగమున నధమము కూ
పరసాచరిత మ్ముస్నాం
బురతిస్ఫీతమ్ము కాకిబ్రుంగుడు సూవే. ౭

సీ. అటులు నిర్వర్తిత మవగాహనమ్ముగాఁ
దీర్చి యాహ్నికవిధుల్ కూర్చునియతి

నాతరంగిణిదరి నంశుమంతుఁడు స్వస్తి
కాపదమున కెక్కి క్రాలు వేలఁ
బొనరుపఁ జను నిసుమునఁ గొనకొనుబత్తి
పొదల సరస్వతీమూర్తి యొకఁడు;
నెమ్మి హుమాయి కరమ్ములు నాలుగు
మణికిరీటమ్ము నమ్మహితమూర్తి

కెడఁద భావింప నవుఁ; బదంపడి కొనంగఁ
బ్రాఢి యర్చానిరూఢి యావాహనాస
నార్ఘ్యపాద్యస్నపనవసనానులేప
నాదు లుపచారముల దేవి నవును గొలువ. ౮

క. లప్పమ్ములుగా నావడ
లప్పమ్ములు నప్పడములు నానేయి చవిం
జొప్పడ మృదుదివ్యాన్నము
లప్పన మొనరింప నొప్పు నప్పావనికిఁ. ౯

వ. అవలఁ దొలఁగక హత్తినబత్తి యచ్చుపడఁ బచ్చకపురపు వీడియ మ్మొసంగి యేనుంగులపై వారువమ్ములపై నరద మ్ములపైఁ బూలపాలకీలలోఁ జాలినమంతరమ్ములబలమ్మునన కూర్చుండం జేసి యూరేగించి కరకమలమ్ములు ముకు లించి యపరాధక్షమాపణ మడిగి త్రిఃప్రదక్షిణక్రమము నిర్వర్తించి యా చిచ్ఛక్తి నిట్లని వినుతింప వలయు.౧౦

తే. జనని! సద్బుద్ధి, సత్కాంత, సత్తనూజు
సద్యశమ్ము, సచ్ఛీలమ్ము, సద్ధనమ్ము,
సత్సమాదృతి, సద్విద్య, సత్సమాగ
మమ్ము దయసేయుము భవమ్ము వమ్ముగాఁగ. ౧౧

వ. అని సాష్టాంగ మ్మెఱంగి, ౧౨

సీ తనపౌనర్చినయవ్రతముఫలమ్ము భగవ
త్యై సరస్వత్యై యటంచు దార
వోసి భూసురవర్యు వాసి దొఱంగక
పరితుష్టుఁ బొనరుపవలయు, నవల
నచ్చపువెలివల్వ నాచ్ఛాదితము సను
పర్ణమ్ము నౌ క్షీరపాత్రముఁ స
దక్షిణాకమ్ముగఁ దత్కరకమలమ్ము
ల నతిభక్తి నిడి పడయవలయు మ
హత్తరాశీస్సు, లయ్యెడ నాదరమున
శ్రవణ మొనరింపఁగా నొప్పుఁ జెవులత్రుప్పు
డుల్లఁ బ్రాఁబలుకుల వేల్పును ల్లసితము
నాల్క నటియించుపలుకులనవలకతలు. ౧౩

సీ. పొలిపొని వేదవేత్తలశుభాశీఃపరం
పరల నక్షత లూని మస్తకమున
దేవి! యావాహిత వై విధి సేవిత
పాదరాజీవవై వఱలితి విటు

దయఁ గూర్పుమా మద్వ్రతమ్ము సాఫల్యమ్ము
నని మ్రొక్కు లిడుచు నయ్యాదిశక్తి
నత్తరంగిణీసీర మందు సంత్యజియించి
స్వస్థానమును జేరఁ బనుపుమీఁద

వలయు నైదువరాంద్రఁ బాఁతుల నతిఘులఁ
గూర్చుచుట్టపక్కాల మేలోర్చువారిఁ
గొఁడుకుకూఁతుంద్ర నెల్లరఁ గూడి మాడి
పేర్మి దేవీప్రసాదమ్ము స్వీకరింప. ౧౪

క. రాజిలునిరూఢి నీవ్రత
రాజమ్మున వాణిఁ గొలుచురాణుఁ దలిర్పం
గాఁ జాలుప్రోడ సుమతి
భ్రాజిష్ణుత నొజ్జబంతి వసుధాస్థలి కా. ౧౫

తే. తివుటఁ బూనరింప నా సుబుద్ధివ్రతమ్ము
పావన మ్మేటియొడ్డున దేవలమున
మొదవులం గట్టి యిడు కొట్టమున నివాస
పదమునం బ్లక్షభూజప్రవరముదరిని. ౧౬

వ. అది యటు లుండె, నృపాఖండలా! వినుము, కొండొక కథానకమ్ము స్మృతిపథమ్మున కవతరించుచున్నయది, యద్దానిం బూనినకుతుకమ్మున నిదె వివరించువాఁడ. ౧౭

సుమందానందనుచరిత్రము

మ. మును మాహిష్మతి నేలెఁ జాలినబలమ్మున్ ధైర్యమున్
శౌర్యముం దనసామ్మె హరువొందఁగా నరులకుం దాపమ్ము
దీపింపఁజేయు నెఱిం దద్వనితాముఖాబ్జములసొం పువ్వ
త్తునం బెంపఁ బార్వణచంద్రుండుగఁ జంద్రసేనపతి
దుర్వారప్రతాపాఢ్యుఁడై. ౧౮

తే. దాయమూఁకలకందనగాయలోని
గాయ మా ఱేఁడు ధర్మమార్గప్రవృత్తి
మాఱుసమవర్తి, వఱలుసంపన్నతాని
రూఢి జాడుబే డను నీశ్వరునివయస్య. ౧౯

తే. వానిదేవేరి కైరవబాంధవాస్య
రూపసంపద లతికాంతచాపునేపు
నూపు నాఱువు తూఁపు, సంలాపకలన
నాడుకోయిలమిన్న, యాఖ్యన్ సుమంద. ౨౦

తే. వారు వారనిపేరిమి కీరుతులకు
నాకరమ్మగ నాకలోకాధినేత
యతనికూరుచు దేవేరియట్టు లనుభ
వించి రతుల మైశ్వర్యమ్ము నేంట్లుఁ బూండ్లు. ౨౧

సీ. కలితమ్ము సుఖమూతఫలరసానుభవమ్ము
కంచమ్ములోపలికటికిఱాయి

వలగొన్న తొయ్యలివలపుతీవ మొగమ్ము
నవకమ్మునకు నుష్ణపవనుపఱువు
కంది కుందని యందచందాలదగఁ గొన్న
ప్రేక్షకేక్షణముల కెదురుప్రొద్దు
తలత్రిప్పుడునకు నస్తవ్యస్తపుంబను
లకు దారి దీయు నంతకు దలారి

కడఁగుచీదరకొంప రోగాలగంప
యేవగింపులమొగము వాపోవుసుగము
త్రొళ్ళప్రాకుకిక్కపడక మూగాళ్ళనడక
ముదిమి నడునెత్తిఁ బడియె నప్పుడమిదొరకు. ౨౨

క. ఆదనుకన్ సాధ్వి సుమం
దాదేవికిఁ గడుపుచల్లనగ నొక నాగ్లే
నాదటఁ గాయలు గాయం
గాఁ దగు విధి గలుగదయ్యెఁ గలుషం బేదో? ౨3

ఉ. దయ్యము దూరి వంగడము తామరతంపరమై యెసం
గుచొప్పియ్యెడఁ గానరామి మది నేచిన నెవ్వగ మేర
మీఱి యా తొయ్యలి యొక్కకుత్తుకగఁ దోడిద లోక
ముగా మెలంగుమేల్నెయ్యపు నేస్తకత్తెలకు నెక్కొను
సంతతివాంఛఁ దెల్పుదుర్. ౨౪

చెలులు సుమందను సంతతికై వ్యభిచరింపు మనుట

చ. అని రిటు లమ్మెలంతలు సుమాంగి! యెఱుంగవె తొల్లి
వాడువాటినముదిమోముగోము తవు తేనిమగంటివి?
యూయెంబోయె జవ్వని వొక యీడుజోడునడిప్రాయపు
వానిని జెట్టవట్ట కేయనువున సంతతిం గనెదు? వట్టిప్రయ
త్నమ సేయఁ బూనుమా. ౨౫

క. "తగవే స్త్రీధర్మపథ
మ్ము గంగపాల్సేయు నీవుపొచ్చెపుఁబలు? కి
ట్లగుఁ గాక ముదుక, కొడుకుల
మగనికృపం బడయవలయు మానిని" యనుదే? ౨౬

చ. పరువపుకోడెగానితమిపాయనికూటమి నందగాఁడు, సు
స్థిరబలశౌర్యధైర్యపరిదీపితతేజుఁడు, వాడువాటి యీ
వురుమనువాఁడు వృద్ధునకుఁ బుట్టుట నిక్కము రోగి
రోగికిన్; విరసపుఁ బల్కు యిద్ది? చెలి! బీజమునట్టిద
యంకురమ్మనన్. ౨౭

క. కావున వే లిఁకఁ బలుకం
గా వలెనె? తరుణి! తరుణు నొకనిఁ దమి వారం
గా వెదకి చెట్టవట్టి ర
సావేశ మ్మడరఁ బడయు మనువపుకొడుకున్. ౨౮

చ. అనుడు సుమంద నిర్మలశుభావహసద్గుణబృంద యిట్లనున్
జనునె కులాంగనామణి మనమ్మునఁ దోఁకొనుగాక పుత్త్రి

లం గనుకుతుకమ్ము, నెమ్మిఁ జెడుగడ్డి దినఁడె? జని యట్లు,
పిల్లిబారిన పడు నీరువై చెడుచు రెంటికిఁ గూలదొ నార
కమ్ములఁదె? ౨౯

వ. అది యటు లుండె, ౩౦

ఉ. అచ్చపుశీలసంపద లతాంగులకుం దలకట్టునై, లస
త్సచ్చరితానువర్తనముచాయలఁ దప్పని నేఁ దనూజుపై
నిచ్చ భోజుంగుఁ గూడి యిటు లీలువు నాఁడిపాలు
సేయఁగా వచ్చునె? తెడ్డు నాకి యుపవాసము మాన్పి
కొనంగ నేటికిఁదె? ౩౧

తే. పసిఁడివంటియనమ్మును వమ్ము సేసి
యంగడిం బెట్టి చేజేత నైన కాని
వారినోళుల నొక పప్పుబద్దవోలె
నానుమందురో నన్నిఁక నవలలార! ౩౨

తే. కానిమీఁచెప్పుచేఁతఁడికముల కొఁడి బి
గించి యిరువంకలఁ దరమ్ము లేఁడు ఘోర
నారకములఁ గూలుచుచుప్పనాక నవుదె?
కొడుకు లొడవరయేనియుఁ గొఱ య దేది? ౩౩

వ. అని ప్రత్యాఖ్యాతలై మాఱు వలుక మోమోడియు నెఱ
జాణ లచ్చెలులు తెచ్చికోల్నగవు మొగములపైఁ దచ్చన
లాడ నవ్వామ కీమెయి ననిరి. ౩౪

క. గోలా! తెలియవు నీ వే
గోలయు, నిల వెంగలి తనకుం దోఁచినదే
మే లనుఁ, గా దనుపాటన
నీళులు కనుకొలఁకులందు నింపు నఁట కదా! 3౫

తే. అచ్చో ముచ్చో యెఱుంగక యడ్డమైన
యల్లికల నగ్గ మవువారి నంగడి నిడు
టబల! వ్రాయసగాండ్రు లోనైనవారి
కూడుగద! దాని కై వెఱ గూడునట వె? 3౬

వ. అంతియకాక, ఓకుటిలకుంతలా ! మే మొక్కటి నొడువు
వార మూరక చీకాకునం గకావికలుగాక పొచ్చెమ్ము పో
విడిచి నెమ్మది నెమ్మది నీవ విచారించుకొనుము. 3౭

సీ. కనువిందుగా మాఱునవిల్తు నొకనిఁ గ
న్నంతనే పోయెనే యసము మాసి?
మురిపెమ్మునకు నొకపరిఁ బల్కరించిన
పాటనే దాఁటెనే భావశుద్ధి?
యెసఁగినకసమున నెద నొకించుక తల
పోసినంతన చన్నె పున్నె మెల్ల?
నెక్కొనుకెలసాన నక్కునఁ జేర్చిన
మాత్రనే యాలువు మంటఁ బడెనే?
శ్యామ! మగనినెమ్మెనునఁ బ్రేమపాత్రుఁ
డతనిగాత్రమ్మునందున నవ్విధానఁ

బొరయునంతర మేయది? మూ ర్తిభేద
మైన నే మాయె, నొకరుఁడ యంతరాత్మ. ౩౮

క. కాంతారత్నమ! సంతత
సంతానాభావచింత సదమద మూ వా
రింతే నిహపరముల సుఖ
సంతానముఁ గాంచి మించఁ జాలినవారే? ౩౯

క. చెలి! కృతక క్రీతకము
ఖ్యలు నందనులు తలక్రింది కొఱవులు; వినితే
చెలువకు నైవచ్చెడువా
రలు కడుపునఁ గన్నకొడుకు రమణుఁడు సూవే. ౪౦

చ. అని నెఱవాదిదంటలు వయస్యలు జాణతనమ్ము నోముకో
ననువవుపలుక లన్న మలయాలపుమంత్రపునీళ్ళ సల్ల
ఫుల్లనలిననేత్ర య త్తరుణి లావతి త్రావినమచ్చుమందుమ
త్తునఁ దల యూఁచుచుఁ మునిఁగెఁ దోఁకొనునూహలఁ
దా నపోహలఁ. ౪౧

తే. అట్లు చింతించి యొకకొంత యమ్మెలంత
మిన్న యొడబడినట్టుల మిన్నకుండెఁ
గిమ్మనం బోక పెదవులఁ గ్రమ్మ స్మయము;
సందు దొరకిన యువతు లేచాయఁ బోరు? ౪౨

వ. అనంతరంబ యవ్వాలంతులు వయస్యలు, ౪౩

చెలులు సుమందకు రాచకోడెగాండ్రపటములు చూపుట

మ. పురి మాహిష్మతి నీడుజోడు లయి సొంపుం బెంపునుం
గాంచి మించిరసశ్రీమహితాత్మతం జెఱకువిల్లెట్టిక సిగం
గొట్టు సుందరరూపమ్ములకోడెగాండ్రఁ బోలు పేదక
బల్వరక వ్రాసి చూపిరి నామాద్యభివర్ణనమ్ము లెసఁగక
వేర్వేఱ దేవేరికిక. ౪౪

వ. అయ్యరవిందనయనయు మనమ్మున నాముకొన్నకుతుక
మ్మామకొన నారాచకోడెగాండ్రప్రతికృతులన్నియు విడు
వక కన్ను లింతింతలుగ నఖశిఖపర్యంతమ్ము సవిమర్శ
మ్ముగఁ జూచి చూచి యాలో మెఱపు మెఱసినటు చటు
కునఁ జూపుమీనులకుం బోనంబులు వెట్టుచు మిట్టిపడు
రూపవయోలావణ్యాతిశయంబుల శేవధియో యన నొప్పు
నొకరునిచిత్తరువు చిత్తమ్ము పేరింటి విత్తమ్మును మొత్త
మ్ముగ నువ్వెత్తునఁ దుడుముతోఁ బరిగొనుడుఁ బొడమిన
చెమ్మటల సిందూరతిలకమ్మును నెమ్మోనిగందపుంబూఁ
తయు నించుక యార్ద్రంబులుగా సడలిననీవి నల్లన బిగిం
చుకొనుసాలో గిలిగింతలు వాఱి నిబ్బరపుంగబ్బిగుబ్బలు
పొంగులువాఱు రసావేశమ్మున నుబ్బి తబ్బిబ్బు లవుచు
మొగమ్ము సవరించుకొనుపాటి యంతర మ్మిడక గాటం
పుటిఱకాటమ్మున నిడి బిగించిన కంచుకముం బ్రిదిలించి
యొడలించికొని వెలికింబాఱు నుద్యోగమ్మున కాయత్తమ్ము
వడు కెఱింగి కరపల్లవమ్ముల నల్లన మిసిమిదువ్వల్వపయ్యె

దచెలంగు తెరం గప్పుచు నొప్పులు గులుకు తీయమావి
క్రొందలిరుజిరావజీరుపసం బొసంగిన వింతకసమస
లెసక మెసంగ రసతరంగమ్ములు పొంగారు నమృతపునడబావి
కెమ్మోవిపై నిసిలెంతలువాఱు చిఱునగవుల నెడనెడం
బర్వ మురువ్వులు నూవుచు దాడిమీబీజమ్ములతీరు మెఱ
యించు నెఱజాణతనమ్మున నొడని దంతమ్ములపేరింటి నును
చినుకుంబూసల మెఱుంగులు నిద్దంపుచెక్కుటద్దాలతళుకు
లం బెళుకులం బ్రోదిసేయం బున్నమచందమామగోమ్ముం
బురుడించు నెమ్మోముబ్రాల్చి పొంగినతమకమ్మునం దొం
గలిరెప్ప లెడనెడ నెత్తి చిత్తరువును దోడ్తో మునుకొను
సిబ్బితి నెయ్యంపుజెలికత్తియలను గనుంగొను చిన్నెలు
వన్నెలు నొలికించుచున్నంత, ౪౫

ఆ. ఆవులించుపాటం బ్రేవులు లెక్కించు
ప్రోడ లచ్చెలులును బూవుబోండి
యిచ్చ యెఱింగి నేర్పునెల్లపోకలు పోయి
యతనిం గొనియ వచ్చి రంతిపురికి. ౪౬

మ. చెలువౌ గందపునూనె సంకుమదముం జేకొంచు నమ్మించు
బోడులు వేడ్కం దల యంటి వెంట నిడి నల్గుల్ దాన
మాడించి యిమ్మల గోర్వెచ్చనినీట నొత్తి తడి
మేల్పూంతల్ మెయిం బూసి దువ్వలువల్ గట్టంగ నిచ్చి
చేసి రతనిన్ స్వాద్వన్నసంతుష్టునిన్. ౪౭

తే. వాఁడుఁ గుడిచి గబ్బునఁ ద్రేఁచి పసిఁడితూఁగు
టూయెల నుపవిష్టుండుగా నువిద యొత్తు
ప్రీతి ముడిచి క్రొందలిరాకుచేత నొసఁగెఁ
బచ్చకప్పురపుబీడియ మెచ్చఁ గులుకు. ౪౮

సూర్యాస్తమయచంద్రోదయములు

ఉ. అంతకు మున్నె సంతతికృతాదృతి పుల్గుహులుమాయిజోదుర
ధ్వాంతయుబీరువ్రొవనిమహానతి నెమ్మది దండడింప
భూకాంతునికాంత సిద్ధ యయి గర్భకలాపముదీక్ష కక్షు
లింతింతలు గా దినాంతమున కెంతయు నువ్విళులూరు
చుండఁగాఁ. ౪౯

ఉ. సిగ్గిలియో స్వగాథ కెదఁ, జెయ్యులసాకిరి యాట నాపెవా
నెగ్గులు సూడ నోడియొ, దినేశుఁడు వాజులఁ ద్రోలి
వేగఁ బ్రత్యగ్గిరి తుంగశృంగతలమందుననుండి పయోధి
దూఁకె న ప్డగ్గలమైన కినుక వదనాబ్జము కెంజిగిఁ జిమ్మ
రోదసిఁ. ౫౦

వ. అంతఁ గ్రమక్రమమ్మునఁ దేజమ్ము లడంగి మింట మినుకు
మినుకుమను తారకలు ప్రకటాకృతిం బొదలఁ దొల్త్రొలఁ
జరమదిశాంగనాననబింబంబునం గమ్మకస్తురిచుక్క నా
నొలపునఁ బొడసూపి ప్రవృద్ధమైన కాలపూరుషుండు నిజ
పేటికం బదిలపఱచియుంచినదాని నొయ్యన నప్పుడ వెలికిం
దీసి మడతలు విప్పి యొప్పిన నెన రతిశయితమ్ముగాఁ బవ

లెల్ల నుచితవ్యాపారమ్ముల నలసి సొలసి విశ్రాంతిం బొర
యు లోకమ్ముల కనామయమ్ముగ సుఖనిద్ర సేకూరుతలం
పునను నొడ్లకంటం బిడుకఁ బ్రాఁమి యభిసారికలకోరుకులు
కొదలు వొదలక కొదకొని సఫలమ్ములుగా నైవచ్చు పై
కాఁపుదల యవు తెకువునం బనిచిన కప్పుదుప్పటి యన
నిఱులు వలంకులఁ గ్రమ్మకొనునుత్తరక్షణమ్మునన యరి
విరహివర్గమ్మునకును జారచోరులకును దారలకును
దాపమ్మును గోపమ్మును వాడి వెలవెలనై యఱమోము
సూపుడును; వెన్నెలపులుంగుజంటలకును సౌధోపరితల
మ్ముల నలరువిలుకానికలనల నడుము గట్టి గట్టిపట్టునఁ
బెనంగు నడికాఱునాలుమగలకుం బోనంబులును గెలసం
బులును బొసంగించుచుఁ బొడుపుకెలనుకలికిమిన్న కిలకిల
నగవు వెన్నెల లోముకొన నమృతపుజల్లులు వెదజల్లుచు
యామినీకాంతాశుద్ధాంతాంతరమ్మున వెలింగించిన విద్యు
ద్దీపమ్మొ నాఁ గలువలచెలికాఁ డంబరంబున డంబుమెయి
నలరారునయ్యవసరమ్మున. ౧౧౦

సుమంద బొజుఁగుం గూడి కొడుకుం గనుట

చ. పనిగొని చంద్రసేనవిభుపట్టపుదేవి సుమంద తాఁ బులుం
దినుచెడుడొకఁడై రతికి దీటవునీటునఁ బూవుబోండ్లు సూ
పినపువుపాన్పుపై మరునివేసమునం బవళించియున్న యూ
తనిఁ దఱియంగ నేగె; వనితల్ దమి వాఱిన నేర రెంతకున్?

ఉ. ఆతఁడు మోవి మోవి, వదనాంబుజముఁ వదనాంబుజాన, నుజ్జనేతులఁ జేతులన్, గనులఁ జెల్వపుగన్నుల గారవించు చున్ బ్రాఁతిగ నేగి తా నెదురు వారనికౌతుక మువ్పతిల్ల సాకూతదరస్మితం జెలువఁ గొంచును గొంకక చేర్చెఁ దల్పమున్. ౫౩

వ. అనంతరంబ, ౫౪

చ. ప్రణయభరస్వయంగ్రహతరంగితహృత్కమలాల, నర్మభాషణములఁ, గూర్పుముద్దుల, సుసంభృతముత్పులకాంకురమ్ములన్, మణిరశనారవాల, జఘనస్థలకంపనచాతురిన్, విటాగ్రణి కతగానికిన్ నృపునికాంతకు నెచ్చె రతిప్రసంగముల్. ౫౫

తే. కాన నిసి కోకిలకలరవానుకారి
యాపెకూజిత మొరుచెవి కంచుకంత
సోఁకఁగానీక నెచ్చెలుల్ సుతులు మేళ
వించి మొఱయించి రపుడు విపంచి సరవి. ౫౬

క. ఆతీరున నన్నవవన
జాతానన బోజుఁగుఁ గూడి స్మరసమరకలా
చాతురి రాత్రిందివములఁ
బాతరలాడి తమి గర్భవతియై మెఱసెన్. ౫౭

తే. నెల మసలి చీర చిక్కడు నిక్కవమ్మ
యవుపదంపడి చెప్పించె నువిదమిన్న

యాతనికి స్వస్తి చెలులచే; నవసరమ్ము
గడచు వెనుక నల్లుఁడు తోడ్తుకొడుకుగాదె! ౫౮

తే. నెలలు తొమ్మిది యమ్మాయి నిండువిూఁద
నొకనాఁటిమూర్తమున నృపోత్తముని యు
నుంగుదేవేరి కనియెఁ దనూజుఁ బార్వ
ణామృతమయూఖనిభము నెమ్మోము వాని. ౫౯

చ. చెనసినకోరికల్ గొన్న మహీపతిమణి గర్భము దాల్చి
యున్న పొల్పును విని పొంగి సింగఁడును బూరఁడు నొ
ముదిరాజు నోజ వందనములు భక్తిఁ దెల్పుచు విధా
తకు వీనుల సోఁకినంత నందనుజనివార్త దానము
లొనర్చె ద్విజాళికి నాలు వేలుగాఁ. ౬౦

ఉ. అంటిన ప్రేమభావమున నాసుకుమారుఁ గుమారుఁ గన్న
క్రొల్గంటియుఁ గూర్చు నెచ్చెలులుఁ గా లటు మోపఁగ
నీక నీఁగనేఁ గంటికి ఱెప్పలై విడక కాచుచుఁ బెంచిరి
పైఁడిబొజ్జ! మాయింటికి దీపమా! యనుచు నేనిక
కొమ్మన దాదిబొమ్మనక. ౬౧

ఉ. వేమఱు నయ్య యయ్య యని పిల్చునిసుంగును ముద్దు
గొంచు నానోములపంటగా యనుచు నొడలఁ బెట్టుచు
నెత్తుకొంచు నాభూమిపసోముఁడుం బ్రమదభూధర మెక్కె;

నెఱుంగనేర్చువారా మహిఁ దండ్రికొడుకు-లు యథార్థ
పరస్పరబాంధవస్థితిన్. ౬౨

వ. అట్లు లల్లారుబెల్లమ్ముగఁ బ్రవర్ధమానుండు కొడుకునకుం
జంద్రసేనుండు యథాకాలంబుగఁ జౌలోపనయనాదులు
విధివిధానమ్మున నిర్వర్తించి, నిఖిలవిద్యాపారంగతు లుపా
ధ్యాయులచే నెల్లకలలుం జెప్పించె; నాతండును దల యెగ
కట్టినదిమొదల లన్నింటం దిట్టయై యట్టిరు తోడిచెలిమికాం
డ్రం గూడి క్రీడార్థమ్ములుగ నాచరించు కొఱగాముల
రాఘవునకును వేనునకు నెందుం దీసిపోని వాసి గండర
గండండై గండు మిగిలి, ౬౩

సీ. తొల్దొల్త నిగడబద్ధులఁ జేసి పితరుల
గోరమ్మె కూడుగాఁ గార నునిచి,
చేతురు తన కింకఁ జేఁతజికము లని
ప్రాఁతప్రెగ్గడలకు స్వస్తి సెప్పి,
సేనాపతిత్వానఁ జెప్పుచేఁతలలోని
కిల్లాకుబంటులఁ గీలుకొలిపి,
కుత్సితాత్మకు లొకకొందఱు చెలికాండ్రఁ
గోశసంరక్షఁ బ్రవేశపెట్టి,

యాక్రమించి గద్దె యవని నేలఁ గడంగె
నెరికేనిఁ దేరిపారఁ జూడ

రానిబలిమికలిమి రావణుండై పర
భావినీనిరూఢభావకలన. ౬౪

ఆ. దాన మన్నఁ బోడముఁ దలయేరు, జన్నమ్ము
మాట చెవికి సోఁకుపాటి గాదు,
తవుల దెద కదండ్యదండ్య సమీక్ష లే
దెచట వానికత్తి కెదురుకత్తి. ౬౫

క. చెడఁ బోడ వర్యోల్లడయే
ల్పడిపాలం బడి తోడిఁబడి ప్రజ యల్లడత
ల్లడముం గుడుచుచు నెలుఁ గిడి
విడువక సీరాముతమ్ముఁ బిలువం దొడఁగెన్. ౬౬

వ. అనంతర మొకనాఁటిప్రొద్దుపొడుపునఁ దమ మునుపొన
రించిన పున్నెమ్ముల పంటయో యన దరిసెన మొసంగి
చక్షుఃసాఫల్య మొనగూర్పు లోకానుగ్రహసంగృహీత
నిరంతరసంచారవ్యాపారుఁ డంగిరోమునిశేఖరునకుం గృత
ప్రణాములై యమలులు మాహిష్మతీపురీధరామరవరులు
తమక్రొత్తరాజుపుట్టువునం గల గుట్టుమట్టును బెడతలం బట్టి
బుగ్గిం గలిసిన వానిబుద్ధియుఁ దమపడుపాట్లును విన్నవిం
చిన విని యమ్మునీంద్రుండు దయారససాంద్రుం డవుచు
వారల కిట్లనియె. ౬౭

క. వినుఁడు సుబుద్ధిం గూరుచు
ఘనవ్రత మొకరుఁ డెసంగుఁ; గడకొనుతమి దా

ని నోనర్చునయే మీనృపుఁ
డనిమిషపతియంతవాఁడ యవుఁ దవుపేర్మిన్. ౬౮

క. అనునంతన వా రిట్లని
రనఘా! స్త్రైణప్రమత్తుఁ డతికోపనుఁడుం
జెనఁటి యతండు వ్రతమ్మును
బొనరించెడువాఁడె? పాడిఁ బోలమేతెరి సూ. ౬౯

క. అవునెడ నాజాడన మీ
ర విలసిలునియతిఁ బొనర్చి వ్రత మయది ఫలం
బవనీధవార్పణ మ్మునఁ
డవిరళగతి తేఁడు నెనయు నమలమనీషన్. ౭౦

మాహిష్మతీమహీసురుల సుబుద్ధివ్రతము

వ. అని సవిధానమ్ముగా సుబుద్ధివ్రత మ్ముపదేశించి యంచితుం
డమ్మునికులతిలకుండు యథేచ్ఛం జనియె. వారును వారని
కౌతుకమ్మున నట్ల కావించి మించునంత ననంతాకాంతుం
డును దొంటికలుషమనోభావం బెడలి పులు గడిగిన
ముత్తియమ్మై ధర్మసేతువుల నుల్లంఘింపక దిలీపనహుష
నాభాగాదుల కితండ జోడని లోకమ్ములు వేనోళ్ళం
గొనియాడ ధర నకంటకమ్ముగ నేలి విమవనిసుబుద్ధివ్రతా
చరణపరాయణత్వమ్మునఁ దుదిఁ జంద్రలోకమ్మును
జూఱంగొని కృతి యయ్యె. నృపాగ్రణీ! ఇషమాసప్రో
క్తమ్ము లీదృశమ్ములు వ్రతములు గోరంతలుగఁ గాన

వచ్చియుఁ గొండంతలు ఫలంబులు సేకూర్చు నంతియుఁగాక, బ్రాహ్మణులును, వైశ్యులును, రాజన్యులును, శూద్రులును, స్త్రీలును, నేజాతివా రవుంగాక యిద్దాని ననుష్ఠించి రేనిఁ దత్తత్ఫలంబు లవికలంబులుగఁ బడయం గలవారని వెండియుఁ బితామహసుతుండు పృథుమహీపతి కిట్లని యనియె. ౭౧

గణపతివ్రతము

క. తత మాశ్వినమాసాజము
సితపక్షచతుర్థినాఁడు చెనయకునికి నే
గతి నడ్డంకులు శ్రీగణ
పతిపదపూజన మొనర్ప వలయుఁ భక్తిన్. ౭౨

వ. స్వర్ణాదిధాతువులచే యథాశక్తి గణపతిమూర్తి నిర్మింప వలయు; నుక్తదినమ్మున, ౭౩

క. కొనకొని వఱువాతన మే
లుకని ధుని నఘమర్షణావగాహనిరూఢిం
దనరి కృతప్రాతర్విధు
లనువుపడ వనస్పతి నిటు ప్రార్థింప నవున్. ౭౪

తే. ద్విజమలాపనోదనచణవిమలమార్గ
మా, యపామార్గమా! రూపు మాయఁగా న
నుగ్రహింపుము ద్విజశుద్ధికై గ్రహించి
నీయిపురుకొమ్మ ద్రుంచిన నా యఘమ్ము. ౭౫

వ. అవల, ౭౬

సీ. సరవి మధ్యాహ్నవసరము శ్రీగణపతి
పదము లర్చింప నైవచ్చు వేల;
కడఁగి తీర్థము లాడి కర్మసాక్షి కెఱఁగి
మును కొనఁ జనుఁ దదర్చనము విధికి;
నావాహనము సేసి ధ్యానించి యడుగు కెం
దమ్ములు గడిగి యర్ఘ్యమ్ము నొసఁగి
యమరినపంచామృతముల శుద్ధోదాన
స్నానమ్ము సేయించి నవ్యవసన
గంధమాల్యాదులన్ మణికనకభూష
ణములఁ గైసేసి యావల ననలు దొడుగు
భక్తిలత వలగొన విఘ్నపతినిఁ గొన్న
యిరువదొక్కపత్త్రులఁ బూజింప నొప్పు. ౭౭

తే. తనరునవయవనామపూజనవిశేష
మది ముగియు మీఁద ధూపదీపాదు లవలఁ
గ్రమఘుమఘుమవాసనాకలితపాక
రసముచితము నైవేద్య మొసఁగ నగును. ౭౮

వ. ఆపయి హరితవర్ణమ్ములొండెఁ దెల్లనివొండె నైదేసి లేక మూఁడేసి పత్రమ్ములు వెలయు దూర్వాంకురమ్ములు మూఁడు మూఁడుగఁ గొని నామపఠనపూర్వకమ్ముగ విఘ్నపతి కర్పింపఁ గొప్పుఁ; జింతామణి, విఘ్నరాట్టు,

గణనాథుం, డఘువాశనుండు, సర్వవిద్యాధిపుండు, శాంతుండు, భక్తకామదఘుండు, ప్రభుండు, విభుండు, ప్రిప్రభుండు, భక్తిప్రియుండు, భక్తిగమ్యుండు, భక్తాభీష్టఫలప్రదుండు, విఘ్నేశుండు, విఘ్నప్రణాశుండు, గణపతి, గణాధ్యక్షుండు, గణార్చ్యుండు, గణేశ్వరుండు, ఫాలచంద్రుండు, ఫాలలోచనుండు, ఫాలలోచనతనయుండు, ధూమకేతుండు, కశ్యపుం, డానందకరుం, డానందమయుం, డఖండుం, డాఖండలవినుతుండు మున్నగు నామమ్ము లవ్విఘ్నపతి కెంతేఁ బ్రియంకరమ్ము; లట్లు నామమ్ముల కొక్క మూఁడుగ దూర్వాంకురమ్ము లర్పించి సదక్షిణాకమ్ముగఁ దాంబూలమ్మును మంత్రపుష్పమ్మును నివేదింపవలయు; నవల, ౭౬

సీ. బహుకుటుంబికుఁ బూజ్య వసుధామరేంద్రు నొ
క్కరుఁ బిలిచి కొలిచి చరణయుగలి
లెక్కను నిరువదియొక్కఁ డొక్కొక తెగ
కొ రుచ్యశాకభక్ష్యాదు లొప్ప
నమలమ్ము సంస్కృత మార క్తవసనస
మాచ్ఛాదితమ్ము వాయనము వీడి
యమ్ముతోఁ గూడ నత్యంతభక్తి నొసంగి
వానియాశీస్సులు పడయ లగ్గు

లగ్గలమ్ముగఁ గల్గు; ననంతరంబ
దంపతీపూజ విహిత; యిద్దాని విధివి

ధానముగ నాచరించు సద్వ్రతులు పొంద
రాని దొక్కరుఁ డేయెడఁ గానరాదు. ౮౦

ఆ. పుడమివేల్పు లొండెఁ బుడమియేల్గడ లొండెఁ
ఒరు లొండె వాల్గవార లొండెఁ
బ[illegible] ఘ్నుడిపూజఁ జలిపినఁ
దొఁక ముడిచి విఘ్నలోక ముఱుకు. ౮౧

సీ. పగగుండెగాలమ్ము పాండుమహీజాని
కానక కానక కానలోన
కన్నసంతానంబు కావునఁ గానక
కన్నసంతానమై కొన్నపొలఁతిఁ
గూరుచుతమ్ములఁ గూడి మాకందమ్ము
క్రింద మహామౌనిబృందములతో
రోజువుచ్చెడు తము రాజిలుకూరిమిఁ
జూడ వచ్చిన జగత్స్వామిసుఖదుఁ
గృష్ణుఁ దోడితెచ్చి కృష్ణాన్వితమ్ముగ
మ్రొక్కి కుశల మడిగి పాదలు నరుస
మెసఁగ ధర్మసూతి యిష్టసల్లాపాల
నడుమ ననియె నలిననయనుతోడ. ౮౨

తే. కంజలోచన! తలపెట్టు కర్జమెల్ల
రక్తికెక్కిని రంగమున కయిరాక నిరత

మంత రాయోపహతిఁ జెడి యడఁగు మందు
నీప్సితము; లేమి సేసియొ యెఱుఁగఁ జెపుమ. ౮౩

క. అన శౌరి యనియె ధర్మజ!
తనసుగమున కొల్లవరవు దల నిడుకొనుతో
త్తునకుఁ బరార్థముఁ జెఱచెడు
చెనఁటికి నీ చెప్పినట్టి చేటులు వొసఁగున్. ౮౪

వ. అనవుడు నట్టియనర్థమ్ముల బారిం బడక యెడగలిగి సుగ ముండు వెర వొకం డిరవొందునె? కరుణాకరుండవ యయి నా కానతిమ్మని ధర్మనందనుం డడుగ మధుసూదనుం డిట్లనియె. బావా! సత్కథాకాలక్షేపమ్మునకుం బ్రోవ తీసి, తిది నీక చెల్లు; నట్టియిక్కట్టు వొరయకునికికిఁ బురాణ ప్రసిద్ధమ్మై మహావ్రత మ్మొకం డలరు; నద్దానం బలు వురు తమతమకోరుకులు కొదలు లేక పడసి; రం దొక్క యితిహాసంబు గల దదియ నొడువువాఁడ నాకర్ణింపుము.

వీరబాహునికథ

తే. తనరు దుస్సహబాహాప్రతాపమంత్ర
మోహితాహితవాహినీవ్యూహుఁ డభిధ
వీరబాహుఁడు నాఁ బృథివీవరుండు,
రాజధాని యూవానిది రైవతకము. ౮౫

తే. ప్రాజ్యమై యకంటకమైన రాజ్యమున్, సు
వర్గవిభు హుజు త్తనిపించు వైభవమ్ము,

నడుగులోనన నడచునిల్లాలు పేరఁ
గౌశికీదేవి, యావిభుఘనత యసదె! ౮౭

తే. తీర్చి దిద్దినయొద్దికఁ గూర్చి పేర్చి
యెల్లనిలు వ్రేకయెడ వెకిరింత నిడుట
తాతబుద్ధికిఁ దవిలినప్రాఁతతెవులు
సుగ మెఱుంగఁ డాతఁ డొక సుంత యేని. ౮౮

తే. చేపడినపనిమొగ మొగిఁ జేద్పడి చెడి
యెడఁద గాసట బీసట నెనయు, నిల్లు
ముల్లకింపగ నెంచు నప్పుడమి తేఁడు,
దయ్య మడఁచినవడువున దైన్య మొందు. ౮౯

తే. ఆతఁ డాయుని;-కిం గతమైన యఘము
పుట్టఁపూర్వోత్తరము గుట్టుమట్టు నెఱిఁగి
కొనఁగ నేరుచుమేరకు ననద యవుచు
వీటఁడింబోలెఁ జనె నెటో వీడు విడిచి. ౯౦

వ. అటులు తలకొని తలబీకనకాయ యై యెందును నిలువనీక బిగాదపగిది వెనుదవిలిన మనోవైకల్యమ్మునఁ జనిచని యొక దట్టంపుటడవిం బడి భయంకర మద్దానిమధ్యభూమిం బ్రవేశించి పోవువాఁడై కట్టెదుటం బొడకట్టిన యొకపాటి తీవలయింటిదరి కరుస మ్మొరవుకొన నరగ నరిగి యందుఁ బ్రాపంచికవిషయమ్ములకుం దవ్వై పరబ్రహ్మమున మన

మనసంధించి మించునైకాగ్ర్యమున దివ్యసమాధినిష్ఠుండై యలరుతాపసకులప్రవరు నొకరునిం గనుఁగొని కొనకొన భక్తివినయసంభ్రమమ్ములు కరకమలమ్ములు ముకుళించి నమస్కరించి సాంజలిబంధంబుగఁ గట్టెదుట నిలువంబడి యుండెఁ; గొండొకవడి కమ్మహాసీయుండును సమాధి సాలించి కనుతామరలు విరియించి చూచినపాటన మహా రాజుగ గుఱుతించి సముచితరీతిం గారవించి నీ వచ్చిన చొప్పు నెఱింగింపు మనుడు ధన్యుఁడ ననుచు నా రా జన్యశిరోమణి యి ట్లని నొడువం దొడంగె. ౯౧

సీ. తాపసోత్తమ! రైవతకము నేలెడువాఁడ
 వీరబాహుండఁ బేరఁ బృథివివిభుఁడఁ
బాయదు రాలచ్చి పగతురు మెదపరు
 నో రాత్మసములు తనూభవులును
మాఱట శుక్రులు మంత్రు లన్నిట భటు
 లెల్లడసుగముఁ జింతించువారు
లేదటు లయ్యును లేశమే సుఖము నా
 కయిరాదు చేసినయత్న మొకఁడు

నమ్మవారినిఁ జేయఁబోఁ దిమ్మన యయి
వెక్కిరించు నపయశమ్ము నొక్కపెట్టఁ
దలను బీటము వెట్టు నద్దానఁ గలఁత
మివిలి కీసరబాసర యవుచునుందు. ౯౨

తే. విడక కాకమించులదొరకొనకుగాము
వితము నను వెన్ను దన్ని పేర్వెతల ముంచు
నంతరాయామయమ్మున నంతవాఁడ
నింతవాఁడన యవుచుందు నెడపక ముని! ౯౩

తే. దానవైన చీకాకిది మానరాని
తెగువ్రాక మానసమ్మున రవప్రకొనఁగ
వీతెఁడింబోలి విడనాడి విమలచరిత!
యిల్లు వాఁకిలి యవుదెంచి తిటు లటవికి. ౯౪

వ. నానదునెత్తి నటించుపీడాస్వరూప మ్మెట్టిదో యద్దాని వద
లించుకొని తెలుపిం బను తెరు వెయ్యదియో సదయ
హృదయా! నెల వ్రెసంగఁగదె యని వేఁడిన నమ్మౌని
చంద్రుం డి ట్లను. ౯౫

సీ. భూవర! విను, తొంటిపుట్టువునఁ బురంజ
నుం డన్న రాజచంద్రుండ వీవు,
సరిసమానము లేని శౌర్యధైర్యాదులఁ
బగతుఱగుండెల బల్లె మయితి,
షండపాషండులు సంగడీఁడులు, సదా
క్షుద్రప్రియుండ వభద్రమతివి,
కలుపులబడిసేఁతకాఁడ వై చేజేత
నెందఱికుత్తుక లీవు దఱుఁగ

లేదు? శఠుఁడు ధూర్తుఁ డసత్యవాది కృపణుఁ
డోరులసొమ్మును బెల్లమ్ముపరువున దిగ
మ్రింగు మునిముచ్చు పేర నుద్ధృతుఁడు నీ పు
రోధసుఁడు, లేదు తద్వచోరోధ మెందు. ౯౬

తే. ఆకృతిం గొన్న పాతకలోక, మిచ్చి
పుచ్చుకొనునీలగ్రద్ద, యప్పుడమివేల్పుఁ
గడఁగి నిల్పితి ధర్మాధికరణపదవిఁ
బెత్తన మ్మిచ్చి పేనును నెత్తి నటులు. ౯౭

సీ. అధికారగర్వాంధ్య మలముకోఁ గనుఁగవఁ
గ్రమ్మఁ బౌర లైనకానివారి
నెల్లరఁ దనమది కెక్కినదే నిర్ణ
యమ్ముగ దండించి యదయవృత్తిఁ
బేదసాదలఁ బట్టి పిండి పిండము సేసి,
యడుగ నిచ్చిన యర్థులర్థమందు
సాఁబాల తనపాలుగాఁ బాపఁ డాపాపి
యొకమె వేలును గోట్లు గడనసేసెఁ

జెప్పఁ దలకొన్న నాతనిచేఁతటికము
లేండ్లుఁ బూండ్లును బట్టు రాజేంద్ర! యాగ
రాసు మానిసి కాఁడు రాకాసి; నీకు
వానిదవుమాట దాఁటఁగా రాని బాట. ౯౮

సీ. వీరబాహుండ! యిటు వినుము బ్రహ్మస్వహా
రణదురాహుండు నీదునముగునుద్ధృ
తునిచోదనమ్మునం దులువలు మెయిం గొన్న
పాతకమ్ముల యన వచ్చువార
లక కాని, బహుకుటుంబికుండు సదాచారి
తుదిదాంక వేదముల్ సదువుకొన్న
బ్రాహ్మణసురునకు దేశకాలపాత్రమ్ముల
రీతు లెఱింగి చేజేత నొకట-

కాసు వీస మొసంగినవాసిం బోవు
తప్పిదారినయే నీవు; తదసదాచ
రణ మసత్ప్రతిగ్రహణమ్ము ధనము దుర్వ్య
యమ్ము కతముగం గొంటి వీ యగడు లెల్ల. ౯౯

తే. పూజ్యరాజేంద్రిరాకుచభూషణా! పు
రాతనకృతిఫలముగ నప్రాప్తవాంఛి
తార్థుండవ యయి దుర్విఘ్నహాతిని బడితి;
కట్టి కుడుపక విడుచునే కడకు బోసంగు? ౧౦౦

వ. కన సకంటక మిట్టి రాజ్యవైభవ మెట్లు లోనగూడె నందు
వయేని దానికిం గల కారణ మవశ్య మ్మెఱింగింతు నవ
హితమతి నాకర్ణింపుము. ౧౦౧

తే. ఆపురంజను వెన్కటిదయినపుట్టు
వున మహాసేనభూజానిమణి వవక్ర

విక్రమార్కుఁడ; వైకతటి వేఁటతమక
మడర నడవి కరిగితి భటాన్వితముగ. ౧౦౨

తే. అందు సంధింపఁబడు శర మంచుకంత
వమ్ము గాకుండ మెకముల వందలబడి
పట్టి పాలార్చి చీఁకట్లు వడుడు నచట
విశ్రమించితి మించిన వేడ్కి మెఱసి. ౧౦౩

వ. మఱునాఁడు బ్రాహ్మముహూర్తమ్మున మేల్కని ప్రాత
ర్విధులు నిర్వర్తించి వలయుపరికరములు గొని మఱల
మృగయావిహారమ్మున కున్ముఖుండ వై యున్న యయ్య
వసరమ్మున. ౧౦౪

సీ. కనుదామరలకు నగ్గమ యయి తళుకున
వడివడిఁ బేరెమువాఱు నొకట
పోతరించినయెనుబోతును వెన్నంటి
కాలిపరుంగున గట్టు పుట్ట
మిట్ట పల్లము నాక మివిలినతద్వధో
ద్యమమున బహుయోజనములు సనితి
పావనాంతరమున నీవు; పో తదియును
నలసి సొలసి దగ యగ్గలముగఁ
దగిలినటులు తాలదప్పు మచ్ఛోదమ్ము
దేవఘూతమునందుఁ దివిరి దుమికి

మునిఁగె, విడక దాని ననుసరించియు కనుల్
వేలు గాఁగ మడుఁగు వెదకి తీవు. ౧౦౫

క. తోడిఁబడి యట నద్దానిద
యడపొడ గనరామి నెచ్చి యచ్చెరువు మెయిం
దడిసినవలువలతో వడ
వడ వడఁకుచు మడుఁగువెలికి వచ్చితి మగుడన్. ౧౦౬

తే. మిపులు శీతవాతమ్మున మేను ముడుత
లు వడ నలుగడల్ సూచునాలోన దైవ
మనిపిన ట్టిషమాసకల్యావగాహ
నార్థ మేతెంచినద్విజకులాగ్ర్యు నొకని. ౧౦౭

వ. కన్నులకలిమికి ఫలమ్ముగఁ గనుఁగొని కొనకొనుభక్తిభావ మ్మున నమ్మహనీయునడుగుకెందామరలకు శిర మ్మంట మ్రొక్కి లేచి సవినయమ్ముగ మెయిం దాల్ప వలువ యొకం డర్థించితి; వాతండును నిండినయాదృతిఁ దనకై కొనివచ్చిన యొకపాటి నీరాటవిపంచె మడిసంచినుండి వెలికిం దీసి సంతసమ్ము తనసొమ్ముగ నొసంగి, నిర్మలా మృతపూతమ్ము దేవఘాతమ్మునం గృతస్నానుండై దరి నిష్టమూర్తిం జపించుచు నుపవిష్టుం డయ్యె; నీవును దద్వస్త్రధారణమ్మున నపుడ పొడసూపిన యరుణునకుం దీసిపోనిభాసల నుల్లసిల్లుచు నప్పాఱుఁ జేర నరిగి పునః పునఃప్రణామమ్ములఁ దనిపి సనకయ యవ్వాని సుప్ర

సన్నం గావి చుకొని, మహాత్మా! వినేయుండఁ గాదనక నా యీ యుపాయనమ్ము గ్రహించి ధన్యుం బొనర్పుఁ డని విడక పదింపది ప్రార్థించి యెట్టకేల కొప్పించి నవరత్నమ్ముల నిమ్ముల తళుకుతళుకున మెఱయు స్వర్ణాంగుళీయకమ్ము ద్విజవరువేలం దొడిగి తదాశీస్సులతోడ సెలవుం గొని భటులం గలిపికొని పురమ్మునకుం బనివింటి. రాజపురందరా! యాశ్వినమాసస్నానమ్మునను, సత్పాత్రమ్మున స్వర్ణమ్ము నీఁ జాలుటను నిట్టివైభవం బెనయఁ గల్గితి; విది నీవెనుకటిపుట్టువులకత. ఇంకఁ బ్రకృతమ్మున నిను మను దిని పించుదుఃఖంబు లడంగి యఖండసుఖంబులు సంప్రాప్తించు నుపాయంబు సెప్పెద వినుము. ౧౦౮

తే. ప్రాప్త మీమాఘమాసమ్మునఁ బ్రతిదినమ్ము
నినుఁడు పొడసూపకయమున్న యెసఁగుకోరిక-
మంగళోదకభరితతరంగిణి నవ
గాహ మెలయువ్రతమ్ముగఁ గైకొనఁ జను. ౧౦౯

క. ఆ మాఘవరమునఁ దొలి దవు
సామున నాలుగవునాఁడు సలుపఁగ నగు సూ
శ్రీమద్గణేశపూజన
మేమఱ; కది తొలఁచి కష్ట మిష్టము గూర్చున్. ౧౧౦

క. ప్రకటగతిఁ బొనర్చిరి మును
కకుత్థ్సుఁడు జయంతుఁడున్ సగరుఁడును మున్నా

సకలలోకమునీశ్వరులు రా
జకులాగ్ర్యులు దాని విఘ్నశమనేచ్ఛవృత్తై. ౧౧౧

వ. కావున నీవు నాశ్వినమాససితచతుర్థి నర్థిమెయి శ్రీగణేశ వ్రతమ్ము విధిం బాయక యనుష్ఠించునది. దాన లగ్గు లగ్గలమ్ముగ నెఱయంగలవాఁడ వని తద్వ్రతవిధాన మా మూలాగ్రమ్ముగ నానతి యొసంగి యెసంగె. వీరబాహు నృపపుంగవుండును భృగుసనాముఁడ త్తపస్వికులోత్తంసుఁ డాచార్యుండుగ నయ్యొడన యావ్రత మప్రతిహతనిరూఢిం బొనరిచి మునియానతి నిజనగరిం బ్రవేశించి యేటేట నిష మాసమ్మున గణపతివ్రత మాచరించువాఁడై తొల్లిటి కలంతం బాసి సుఖం బుండెఁ; బృథుపృథివీధవా! శరన్నవ రాత్రావసరమ్మున శుద్ధపంచమీతిథి నుపాంగలలితావ్రత మ్మనుష్ఠేయ మ్మై యొప్పు; నయ్యది త్రివిష్టపమ్ముల యందును ద్రిదిష్టమ్ములయందును నలభ్యం; బద్దాని సర్వ లోకహితం బభిలషించి నీ కే వివరించువాఁడ; నప్రమ త్తత నాకర్ణింపుము. ౧౧౨

ఉపాంగలలితావ్రతము

తే. పర్వతేంద్రాత్మజాశివప్రణయకేలి
కాసుఖోల్లాసమైన కైలాసమునకు
మునుకొనినసమాదృతి మునిజనబిడౌజు
లెల్ల గొలనాఁటిప్రొద్దున నల్లనఁ జని, ౧౧౩

తే. సకలందు నానందవిక్రముఁ గాంచి నించు
భక్తిపేరిటిబీజమ్ము పరువు నరసి
చిత్తకేదారముల మోసు లెత్తఁ గరక
మలములు ముకులించి యని రిమ్మాడ్కి గాఁగ. ౧౧౪

తే. దేవదేవ! మహాసేన! దినదినము భ
వన్ముఖాబ్జనిర్గలితశుభదకథాసు
ధారసముఁ గ్రోలఁ జాలియుఁ దనివు సనవు
మామనములు కర్ణాంజలిస్తోమ మెసఁగ. ౧౧౫

తే. క్రొత్తక్రొత్తబోజుఁగులకుఁ గులట లటులు
నిచ్చక్రొత్తలు కతలకు నిచ్చ దోడుగు
మాచెవులత్రుప్పుడులు దుల్ల మహిత మర్థ
మానతీఁగదె యొకరుఁ డీశానతనుజ! ౧౧౬

క. ఎది పౌనరించినపాటన
కొదకొని కొద లొదవఁబోక కోర్కులు సమకూ
రుఁ దవుఫలమ్ములతో న
య్యది విశదగతి నెఱిఁగింపు మమరినకూర్మిన్. ౧౧౭

చ. అనుడుఁ గుమారుఁ డిట్లను మహర్షికులాగ్రణులార!
మీపౌనర్చిన దవు ప్రశ్న మిద్ది వివరింపఁగ రాని ముదమ్ము
గూర్చెఁ బావని త్రిపురాంబకూర్చుకత వల్కెనం దవు

భాగ్యముం దనంతన యయివచ్చె నొచ్చె మఱి ధన్యుఁడ
మీయనుకంపపెంపునన్. ౧౧౮

శ్రీపతిగోపతులచరితము

క. వినుఁడు భృగుక్షేత్రమ్మున
ఘనుఁ డవనినిలింపుఁ డొకఁడు కాలిలుం బేరం
జను గౌతముఁ డయి, పేరిమి
ననుపముఁ డాతం డెఱుఁగనియది లే దెదియున్. ౧౧౯

తే. విమలవైదికాచారపవిత్రవర్త
నమున నెల్లలోకములకు నమలుఁ డతఁడు
మేలుబంతి, పంటవలంతి మేలు గాంచె
వాని మోచియ తల నిచ్చ వసుమతి యయి. ౧౨౦

తే. నిట్టనిలువునఁ బండిన నిర్మలత్వ
ధనము ప్రస్ఫుటగతి నొప్పె నన నెరసి త
ల యొకరుఁడు ప్రముగ్గుబుట్ట యాపయిని వాని
కడుపునం బుట్టి రిరువురు కొడుకు లలర. ౧౨౧

క. కృతినై జాతాదులు సం
స్కృతులు విధిం దెలిసి సలిపి క్షితిసురజనతా
పతి లలి శ్రీగోపూర్వులఁ
బతులం బొనరించె సుతుల వఱలిన పేళ్ళన్. ౧౨౨

మ. అగున బ్లైన్నియొ యేండ్లు బూండ్లకు గురుం డంచుం
గుమా ళ్ళించు నమ్ముగురం గూర్చిన ముండదైవ మది
యొప్పం బాసి కారమ్ము కన్నుఁగవం బెట్టుక సౌఖ్యరాశి
బుధనంద్యున్ గౌతముం బ్రేతరా ణ్ణగరిం జేరఁగఁ బంపెఁ
గన్నపసికూనల్ దీనులై చేడ్పడన్. ౧౨౩

తే. నాల్గుపురుషార్థముల నిజనాథుఁ బాయు
మేర కింత సందొసఁగని మేలి యొట్టు
లెసఁగఁ గొన్న తత్పాణిగృహీతి మగని
తోడిదే గతి గా సొదఁ గూడి యరిగె. ౧౨౪

తే. కలఁగి కలసినచుట్టపక్కాలు కొంద
ఱాగతికి నెడందఁ గటోటకాదు లోలి
నాచరించి రంచితు లాద్విజాగ్ర్యదంప
తులకు నవుచు శ్రీపతిగోపతులకు నండ. ౧౨౫

మ. అనదల్ పెక్కులు రాని పుల్గులు పితృవ్యాపాదఖేదా
యుధ ప్రణీతాంతఃకరణుల్ కుమారుల ఖిలవ్యాపార
పారీణుఁ డప్డు నిరాతంకత గౌతమానుజుఁడు తోడు
న్నిడయుం బోలెఁ జేర్చి నిజావాసముఁ బెంతు నన్న
తవళిం జింతించి యర్థిత్వమున్. ౧౨౬

క. గోపు పినతండ్రి ప్రోపున
శ్రీపతిగోపతులు సుఖవిశేషమునక ద

వ్వే పదివే లామడ తే
రూపున రూపింపరాని రొంపిఁ బడి రటుల్. ౧౨౮

వ. అట్టు లున్నవాఁ డున్నపాటిద, లేనినాఁడు గోడునం బడి
తలిదండ్రులతలంపులతో లోలోఁ గాలువలై వెల్లువలై
పాఱు కన్నీటిదారల పరమాన్నంబుగ మ్రింగి పొట్ట నింపు
కొనుచుఁ, జెడుగ అపుడొక్క పినయబ్బయు వానిచానయుఁ
గొడుకుకూఁతుండ్రును నవ్వారల యంతపొంతలతలగొట్ల
మారులును నవారి జారవిడుచువాక్ఛరమ్ములకుం దల
లొగ్గి తప్పించుకొని యెటెటో యొడ్డునం బడుచు, నా
గడుసుగ రాసుపంచం బడఁ ద్రోసిన విధిఁ లోలోఁ దెగడి
కొనుచుఁ, బుట్టువుతోడం బట్టువడిన యోరిమిపేరిమి
పేరిఁటి బంగరురవణమ్ముల ననుపమానమ్ముగ మెఱయుచు,
బ్రాహ్మణ్యమ్ము బీరువోకుండ లోకమ్మున కొకింత వెఱచి
యెట్టులో యొకట్టులు పిసిఁడి పినతండ్రి బుజమ్ములం బడ
వైచిన సూత్రమ్ముల మర్యాద నుల్లంఘింపక గాయత్రీ
దేవీమతల్లియ తమ కూర్చుతల్లిగ ముువ్వేళలఁ జపించుచుఁ,
గంటికి ఱెప్పలై కాచి ప్రోచు నొజ్జలతలలోనినాల్కలై
మది కెక్క నడుగునీడల నడచుచు, నేమఱి యుక్కెక్క
నీక చదువు సంత సాగించి యవు ననిపించుకొనుచు, శ్రీపతి
గోపతు లొకపాటిఁ దల యెగకట్టి లోకమ్ముచిటికెన కెక్కు
నంత కమ్మునిముచ్చు గౌతమావరజుండు లుబ్ధత్వమ్ము
తనసొమ్ముగ నవ్వారల కలములై యెల్ల బెల్లమ్ముగ దిగ

గ్రమింగి యున్నవియు లేనివియు నొకకొన్ని కానిపద్దులఁ
దనక ఋణపడినబడుగులం బొనరించి యుంచెఁ; ననంతర
మొకనాఁడు, ౧౨౮

మ. కడుపారం గనినట్టి బిడ్డలటులే గారాము నిండారఁ బ్రే
ముడిఁ బోషించితి వింతదాఁక దయ మమ్మున్ నీఋణ
మ్మిమ్మఁగ నేర్చెదుచొప్పేయెడఁ గానరాదు పరమప్రీ
తాత్మ పిన్నమ్మ మాయెడలం గల్గిన మాఋకామగవి
యెంతేఁ దోడు లీయన్నలున్. ౧౨౯

క. తృణమో కణమో యొకరుఁడు
మునుకొని మాకన్నయయ్య ముల్లె మనమునం
గొనకొను నెనరున నిడి దీ
వనలతో మముఁ బనుపుమయ్య ప్రథితవిచారా! ౧౩౦

మ. అనువౌ ధర్మపుఁ జొప్పుఁ దప్పని పర మ్మాస్తిక్యముచ్చై
శ్శ్రవమ్మునకున్ మూలముగా స్వయమ్ము కడపం బూనార్వర
మెందేని జీవనముల్ మే మిఁకఁ బిన్నతండ్రీ! చెడ నొ
వ్యక్తిత్వముం గాంచు పైని నెవాఁ డర్హుఁడు చూపుగుజ్జ
మయి మనికిం గుందికుట్టాడుచున్? ౧౩౧

మ. అని నెక్కొల్లును ప్రశ్రయావనత హెచ్చై వేఁడు స్వభ్రా
తృనందనులం జూడ్కులఁ గాల్చివైచుకినుకన్ జామోఁది
యాధూర్తుఁడున్ ధనమా? ధాన్యమ? దాఁచిరే యిచట

మీఁతాతల్ భళా! యిందు కం డన ని ల్లెల్లను గొల్లగొట్టి
మగలా హా ర్వర్వి మర్యాద సూ. ౧౩౨

క. అని నోటికి వచ్చినచొ
ప్పునఁ బదరి పదరి పరార్థభుక్కునకమ్మొ
యునికి వెడల నడఁచెం జ
య్యన; ధన మే కూడు గుడుప దవని నరులచేఁ? ౧౩౩

సీ. సారధిషణు లక్కమారులు గిరికొను
వెఱ దల మునకలై పెతరుల మదిఁ
దలపోసి దీనత విలపించుచుం గటా!
యెట్టిగోరమ్ములు సుట్టి పెట్టి
తి తల నిటుల్ పట్టి తీఱని పగ విధి?
యే మనం జను నిను నిట్టు లుండ
మాతోంటిపుట్టులచేఁతఱికమ్ముల
ఫలము? లటంచు మా ర్వలికికొనుచు
నంటు సొం టొక కఱిపూసయంత యంటి
పూని నాయన్నవారలుఁ లేనిమారు
మూల బ్రతుకుద మింక నం చాలలిం బ
యనము సాగించి రపు డుత్తరాభిముఖత. ౧౩౪

శ్రీపతిగోపతులు దేశాంతరమునకుఁ బోవుట

క. అటు లలిఁ గోటలు పేటలు
నటవులు దాఁటి యొకకొన్నియామడలపయిన్

బటుధిషణు లమ్మహీసుర
వటువులు కనుఁగొని రొకండు పత్తనవరముŋ. ౧౩౫

తే. ఆపురోపకంఠమ్మున నమలకమల
సురభిలామోదసుమధురతరమరంద
రసనమాస్వాదమత్తాళిరమ్యగీతి
కాకృతాహ్వాన మవు కమలాకరమున, ౧౩౬

తే. కడిగి దూరప్రయాణాన బడలుపడిన
యడుగు కెందమ్మిపువు లొగి నాచమించి
మను పఠనపూర్వకమ్ముగ మునిఁగి వార్చి
ప్రణవరూపిణి గాయత్రిఁ బ్రస్తుతించి. ౧౩౭

వ. మరల బయనమ్ము సాగించువారలై యక్కుమారశేఖరులు,

సీ. ప్రథితవీథీచతుష్పథదర్శనీయమ్ము
మహితగోపురవారమండితమ్ము
దేవతాయతనచిత్రితము వియత్కష
ప్రాసాదరాజీవిరాజితమ్ము
మంజులమంజరీమండలభరనమ్ర
చైత్యాయతము సురస్వాంతహారము
నిరతాగ్నిహోత్రిభూసురముఖనిర్గల
చ్ఛ్రుతిరవశ్రుతిపుటసుఖద మసమ

మాపురమ్ము సేరి యటనటం గల విచి
త్రముల కెడఁద నబ్బురమ్ము వడుచుఁ
జని చని యొకపద్య శ్రాంతతమెయి నుప
విష్టులై రొక గృహవేదిపైని. ౧౩౯

ఆ. ఆగృహమ్ముభర్త యఖిలాగమరహస్య
వేత్త వైశ్వదేవవిధులు సక్క
దీర్చి యపుడె ముదము పేర్చి ముంగిటఁ గనుం
గొనియో వారల హరితనువుల నటు. ౧౪౦

క. వర్ణనకు నొప్పునొప్పన
స్వర్ణవిజిత్వరము తనువువర్ణమున స్ఫుర
ద్వర్ణిత నయి రయ్యగ్రిమ
వర్ణసుతుల్ గేస్తుకనులపండువు లెలమిన్. ౧౪౧

ఆ. కొనకొనునరుసానఁ గుశలమ్ముఁ బ్రశ్నించి
తోడి తెచ్చి యడుగుదోయిఁ గడిగి
కొలిచి ఋషులఁ బోలె లలి నిష్టమృష్టాన్న
తుష్టులం బొనర్చెఁ దొడరి వారి. ౧౪౨

తే. పేరిఁట వివేకుఁ డాగృహివిభునిసత్క్రి
యాకలన మొద లంట రూపణిన దేశ
బంధుసంత్యాగఖేదాన వత్స లిరువు
రటులు భుక్త్వోపవిష్టులై రపుడు డోల. ౧౪౩

సీ. అనుపమానవివేకధని వివేకాహ్వయ
　　　గృహిలోకరాట్టు నమ్మహితులాఁగ
మనమున ధన్యతఁ దనకును దనపూర్వు
　　　లకు నిష్ట యంచుఁ దలంచుకొనుచు
మాఱట విష్ణు లమ్మాన్యాతిథులపరిసా
　　　దము శేషముఁ బరమాన్నముగఁ గుడిచి
శరణముల్ బ్రహ్మవర్చసమున కవ్వారి
　　　పై వత్సలత యెంతో పాదుకొనఁగఁ

　గుఱఁగటం జేరి కూర్చుండి కోర్కె లూర
　నడిగె నివ్విధమునఁ జెప్పుఁ డన్నలార!
　యెవరు మీ? రెట నుండువా? రేరికడుపు
　పంట? లిటు రాఁ గత మ్మేమి? వావి యేది?　౧౭౪

క. అనవుడు శ్రీపతి యిటు లను
　ననఘా! మాతండ్రి గౌతమాఖ్యుఁడు విద్వ
　ద్వినుతుఁడు, శ్రీపతిగోపతు
　లను వారము, సోదరులము యువుదుము వావిఁ.　౧౭౫

తే. కతముగాఁ బూర్వజనికృతకర్మఫలము
　కనులు విప్పకమున్న మాకన్నతండ్రి
　విబుధపురి కేగె నంత మాపిన్నయయ్య
　సాఁకతమునఁ బెరిగితి మీదాఁక నెటులొ.　౧౭౬

తే. ఆతఁడుం గానిచో ప్పాన నడుగు వెట్టి
మొత్తముగ మ్రింగి మాయయ్యవిత్త మెల్ల
నిల్లు వెడల నడఁచె మము నింక నేమి
పలుకఁ గలదికుడ్ మ్రొకుడ్ నెవ్వలన లేదు. ౧౪౭

తే. అంత గతు లాఱి ఘోరగహనములఁ బడి
కూడు నీళులకుఁ నోచుకొనక చావు
లెట్టులో తప్పి కన్నులు లొట్టవోయి
చేరినార మిచోటికి క్షితిసురాగ్ర్య! ౧౪౮

తే. ఆశ్రయప్రదానమ్మున నాదరించు
పనిఁ దనర్చుటఁ గూరిమిఁ దినఁగ నిడుట
నీవ తండ్రివి మా కిఁక నిర్మలాత్మ!
యుడుపమవు మావ్యథాగభీరోదనిధికి. ౧౪౯

వ. అని తమయుదంతమ్ము సాంతమ్ముగ విన్నవించిన, ౧౫౦

క. జలజలన దుఃఖబాష్ప
మ్ములు కనుకొలఁకుల స్రవింపఁ బూర్ణకృపాని
ర్మలమానసుఁడు వివేకుఁడు
పలికెఁ గుమారులతో మిపులువాత్సల్యమునన్. ౧౫౧

తే. పనియ లే దింకఁ దొల్లిటివగలతోడ
మఱచిపొం డది యెల్లఁ గుమారులార!

లేదు మీది నాది యటన్న భేద మంచు
కించు కీయెడ నుగ ముందుఁ డిచ్చు హెచ్చు. ౧౫౨

వ. ఇట్టనిలువునం బండిన నా పుణ్యమ్మును నన్నెమ్మన్నెఱిఁ
దనకుం దానుగ మిమ్ములం గొనివచ్చె, నేను గా దనం
బోకుఁడు, భవద్దర్శనస్పర్శనాలాపశ్రవణభోజనాధ్యాపనా
దుల నేనును నానందరసపూర మ్మనుభవింపవలయు, ననిన
వారును మహాప్రసాద మ్మని వివేకునాశ్రయమ్మున ననపా
యత రోజు పుచ్చుచు నాతనియెడ నెల్లవిద్దియలు నేర్చి
నేర్పరులై తకుఁగంగలశిష్యవర్గమ్మునకుం దలమానికమ్ము
లుగ మెలంగుచుండి; రటు కొన్ని నెలలు సనినయావలఁ
బ్రాప్తశరదవసరమ్మున నాచార్యుండు విధేయులు వినే
యులతోడం గూడి యొండొక మహావ్రత మ్మఖండనియతి
నాచరింపంగడంగె; నట్టితఱి శ్రీపతిగోపతులు గురువరునిం
దఱిసి కృతసశిరోభివందనులయి; మహాత్మా! మీరాచ
రించు పవిత్రమ్మ వ్రత మ్మెయ్యది? అద్దానఁ గలుగు
ఫలం బేరూపంబు? విధానంబు మాబోంట్లకుం దలంచె?
యెఱిఁగించి కృతార్థులం బొనరింపుఁ డని వేడిన వేఁడుక
పొడమి వివేకోపాధ్యాయుం డవ్వారల కిట్లనియె. ౧౫౩

క. పావన ముపాంగలలితా
దేవీవ్రతరాజ మియది దేవర్షి జనే
డ్భావితము, దీన సమకురఁ
బోవనితమి గానఁబడదు భువి దివి నెపుడేఁ. ౧౫౪

క. చదువును సంధ్యయు విత్త
మ్ముం దనూజుల గోధనమ్ము బుడమిం బడయన్
మదిం గోరు వెరవరుల కొకం
డిదియే తపువెరవు నిక్క మింత వినితిరే. ౧౫౫

క. వ్రత మిది పాయనినిష్ఠం
బ్రతిసమ నొనరించుచుండు వ్రతముగ ననుడుం
గుతుకమ్మున శ్రీపతిగో
పతు లద్దానివిధిం దెలుపం బ్రార్థించుటయున్. ౧౫౬

క. మునుకొని వివేకవిబుధా
గ్రణి వల్లె యని వివరించెం గా దన; కపుడే
యొనరించిరి విద్యాకా
మన మనమున నెకొ్కనం గుమారులు దానిన్. ౧౫౭

తే. పూత మవ్వ్రతముప్రభావముననచేసి
విద్దియుల నెల్ల నందియల్ వేసినట్టి
చేతు లైరి; రెండవునేటం జేసి రవ్వ్ర
తము వివాహార్థ మాయన్నదమ్ము లెలమి. ౧౫౮

తే. ప్రాప్త మవు మాఘమున గుణవతి యటన్న
కన్నియం దనకడుపునం గన్న దానిం
గుతుక మగమంత గాంగ శ్రీపతి కొసంగి
పరిణయ మ్మొనర్చె వివేకవరమనీషి. ౧౫౯

తే. అంతఁ గొంతకాలమ్మునననంతరమున
ననువయి పరువమ్ము సమర్త లగవు తగవు
లద్దు ముద్దు బంతులు దీఱునవల నొకటి
సేసెఁ గూఁతు నల్లు వసుంధరాసురుండు. ౧౬౦

తే. అనలుఁ బనలు వైచునరితి నసఁగి పెనఁగి
కొదలు దాఁకని కోర్కులఁ గూడిమాడి
పలుకులుం జేఁత లొకఁడుగఁ గలసిమెలసి
చాల యలరించి రయ్యు నయ్యాలుమగలు. ౧౬౧

వ. ఒక్కశరత్తుశరత్తున నయ్యన్నాదమ్ములు, ౧౬౨

క. నిజము భృగుక్షేత్రమ్మున
కుఁ జనునవలఁ దమదునిల్లుఁ గోల్పోయినము
ల్లైఁ జెయింగొనుకోరికి పొద
లఁ జలిపిరి నియతి నుపాంగలలితావ్రతముల్. ౧౬౩

తే. పలికి రొకనాఁటిప్రొద్దున నలఘుమతులు
క్షితి సుపర్వకుమారు లీక్రియ వివేకు
నకు మహాత్మ! నీప్రాపున నొకరవంత
యెడ రెఱుంగక సుకముంటి మిన్నినాళ్ళు. ౧౬౪

క. కలితమతుల్ మీకును జి
త్కలిక యుపాంగలలితాజగన్మాతకు ని

స్తులకృప గలిగెను మాపై
విలసిల్లితి మాత్తవివిధవిభవుల మవుచున్. ౧౬౫

తే. ఇంక నిజదేశమున కేగు నిచ్చ పొడమె
డు నెద నాన తిం డన వల్లె యని వివేక
పండితుఁడు తీర్చి యంపకపువిందు
లనుపఁ బూని యల్లునితోడ ననుఁగుగూఁతు. ౧౬౬

వ. విలువగల వలువలును దళుకుతళుకున్న మెఱయు పసిండి
సొమ్ములును గానుకలుగా నొసంగి సముచితగతి నల్లుని
వానితమ్ముని బహూకరించి మఱునాఁడు వఱువాఁతన
పయనమ్ము సాగించె; నట్లు వారు చండకిరణుండు స్వస్తి
కాపద మధిరోహించుదనుకఁ బ్రయాణించి మధ్యేమార్గ
మ్మున నొకకొట్టిక విడిసి; రది యటు లుండె నయ్యెడ
భృగుక్షేత్రమ్మున, ౧౬౭

సీ. రహి నుపాంగలలితామహీసుమ్మునం దొంటి
చలపాదితన మెల్లఁ బులుఁగు లేక
సమసి గౌతమునను జన్ముఁడు ముకుపచ్చ
లాఱని సుకుమారు లగ్రజునికు
మారులు వాక్ఛరాసారమ్ములం బడ
ల్పడి మఱుమాట లేయెడన లేక
యరిగి రేదిక్కున నటె దిక్కు మ్రొక్కు తె
వ్వానుల మెగమ్ములవాత కయిరొ

యేమి తలఁచెనో విధి యిఁక నేది గతియొ
యనుచు నెకొ్కలుగొను వగ ననువు దప్పి
హీఁడి యయి తన్మార్గగవేషణమున
వ్యగ్రము మది వెలలె నుత్తరాభిముఖత. ౧౬౮

శ్రీపతిగోపతులు స్వగ్రామమున కేతెంచుట

వ. అమ్మెయి నెల్లపల్లెలు పట్టణములు గహనమ్ములు గహనమ్ములు విడువక యెల్లయెడల నడలుపడువాఁడై యరసికొనుచుఁ జనిచని యొకనాఁటియపరాహ్ణసమయంబునకు వివేకాదులు విడిదల గావించుకొనియయున్న గృహంబునన తానును నుపాంగలలితాకృపాబలము చేఁజేతం గొని వచ్చినటులు విడిసి యున్న మఱునిమునమ్మనన, ౧౬౯

ఆ. తడవఁ బోవుతీవ తనకాలిక్రిందన
దొరకినటులు కన్నుదోయి కెలమి
విందువెట్టు ననుఁగుబిడ్డలఁ గని గిరి
కొనినసమ్మదమునఁ దనువు పొంగి. ౧౭౦

వ. సరయుమ్మగ నక్కన గదియించి యానందాశ్రువులు రాల్చుచు బంగరుబొజ్జలారా! నాబొజ్జనఁ బాలుపోసితిరి నానోములు ఫలించె, నని ప్రేమాతిశయమున నెలుంగు ఆపడఁ బలుకుచు నన్నలారా! కుశలమే, యని యవ్వా రివలన నాఁడు మొదలుగ నేఁటిదనుకం గల కత యెల్ల

సవిస్తరమ్ముగ నెఱింగి కుఱంగటన యది యెల్లఁ గని
విని వెలపడు వివేకోపాధ్యాయునడుగుకెందామరలపై
వ్రాలుడు నమ్మనీషియు నాదరభరమ్మున లే నెత్తి కౌఁగి
టం జేర్చి కలిసినక్రొత్తచుట్టఱికమ్మునకుం దవుపలుకుల
సముచితగతి గారవించె. ౧౭౧

క. ఆలో వివేకునానతిఁ
జాలినభక్తిఁ బ్రణమిల్లు సదమలగుణజా
లాలంకృతఁ గోడలి నవు
మే లనుచుగా మెచ్చి మఱచె మేను నతండుగా. ౧౭౨

వ. పదంపడి, ౧౭౩

తే. మరల సాగించి పయన మమ్మహితయశులు
చేరి రొప్పినతటి భృగుక్షేత్రమునకుఁ
జిరవిరహాభరాధీరు లాదరమున కవు
బందుగులయెదురోఁ కృపు డందుకొనుచు. ౧౭౪

ఆ. ఆపితృవ్యునింట శ్రీపతిగోపతు
లటులు శ్వశురముఖ్యు లాత్మబంధు
వులతో కొన్నినాళ్ళు నిలిచి రానందమ్ము
చిత్తసీమ నెగిచి చిందువాంద. ౧౭౫

వ. అనంతరంబ, ౧౭౬

తే. కడఁగి కొడుకుకోడండ్రమేల్కఁ పురముప
సంపు దిలకించుకెలసానఁ జాల సొమ్ము
పంచి యిచ్చి పితృవ్యుండు వారి నునిచె
నొక్కయింట వివేకుఁడు నొప్పుమీఁద. ౧౭౭

వ. అటులు కొన్నిదినంబులు కడచన్నయావల వివేకోపాధ్యాయుండును గూఁతునకు వలయు హితోపదేశంబు లొనరించి యల్లుని దీవించి నిజపురంబునకుం జనియె. ౧౭౮

క. గుణమణిఖను లా శ్రీపతి
గుణవతులగృహస్థధర్మకుతుకిత హారిదా
పణముల నమూల్యతమమై
గణుతిం గనె సవతు వైరయుకయె నానాఁటన్. ౧౭౯

తే. నతజనమ్ముల సవనిధానమ్ము వ్రతని
రతులకొంగున ముడిచిన రతన మయ్యు
పాంగలలితఁ గొలుచుపని నప్రమత్త
త యెసలార శ్రీపతి క్షితి నసము నెనసె. ౧౮౦

తే. తండ్రితరువాతఁ దండ్రియంతటియతండు
నగ్రజుఁడు శ్రీపతి కులశీలాదుల నను
రూపఁ జెలి నోర్తుఁ గూరిచి గోపతిం బొ
నర్చి యొకయింటివాని నానందపడియె. ౧౮౧

గోపతి యన్నింటు భ్రష్టుం డవుట

ఉ. వాఁడును జేడెతోడఁ బెడబాటలఁ బట్టినబుద్ధి నన్నిఁటం
దోడును నీడ యన్ననొడిఁ ద్రోసి గరా సయి కొంచు
సాముబా లాడిన దాటగా నడచు చన్వయకీర్తివనీదవా
గ్నియై యూడిచిపుచ్చె నచ్చుగ సముక్తము ధర్మముతో
ద్విజత్వముఁ గా. ౧౮౨

ఆ. అలముకొన్న విత్తయౌవనమదమునఁ
గనుల గంతలు వడి యనద వాఁడు
కడుపు చల్లగా జగము గన్నతల్లి యు
పాంగలలితసేవ లవలఁ ద్రోసె. ౧౮౩

ఆ. హేయవృత్తి నటులు హాయన మొకటరుఁ
డేగునంత కతని యెల్ల ముల్లె
కానరాని పోక కై నష్టగతి నొందె
గాలిలోన యిడిన కప్ర మట్లు. ౧౮౪

ఆ. అంతఁ గడుపుకూటి కావంతయే నోచు
కొనని లేమి మునిఁగి దినము వుచ్చు
గతికిఁ గాళ్ళు సాచి కయికొన్న యిల్లాలు
నార్తిఁ గుంద వగచె నతఁ డొకపుడు. ౧౮౫

వ. కొండొకవడి కమ్మడఁతి యూఱటం బెరసి మనమ్ము దిటవు
పఱచుకొని వానిని కి ట్లనియె. ౧౮౬

శా. వాకో సిబ్బితి గ్రమ్మ నెవ్వగలతోఁ బ్రాణేశ! యెవ్వేళ
త్రెప్పె కన్దోయికిఁ గూర్మిపేర్మి మనతోడై కాచు మీయ
న్నవౌ వాకుల్ సుంత తొలంగకున్న నవునే పాట్లిమ్మె
యిం దుర్నివార్యాకారమ్మున? నింతకుం గృతమహానర్థమ్ము
లి ట్లుండెఁగా. ౧౮౭

క. ఆఱనియూఁకటి చిచ్చున
నూఱక సురిసి చనుతనువునుడు కేడుపులం
దీఱునె? త్రోడిజగమ్మున
నాఱడిఁ బడమే యధైర్య మడరించునెడన్. ౧౮౮

ఉ. కావున గుట్టుచప్పుడులు కాక యథాస్థితి నుండువారమై
పావనమూర్తి మీయనుఁగుభ్రాతృవరుం డనువాసరమ్ము దీ
క్షావసరమ్ముగాఁ జలుపు నన్నముదానములందుఁ బొట్టలన్
వావిరి నింపుకోఁ గలుగువార, మ టౌనెడ లేవు గోరముల్.

క. అన నది తెస్స సుమా క
ట్టనిప్రొయ్యియు వండక ప్రకట మ్మన్నముఁ గ
మ్మనిరుచు లెంతటివారికి?
వనితామణి! యిట్టియూహ పరులవశంబే? ౧౯౦

వ. అని యామెఁ బలుతెఱంగుల నగ్గించుచు నకిలించు నాఁ
టంగోలె నిల్లాలితోడ నదె బాటగ జీవయాత్రం గడపు
చుండె; నొక్కనాఁడు. ౧౯౧

తే. ఆతఁ డెప్పటిచాయ జాయాసమన్వి
తముగ నారగింపఁ జనునంతకె సహస్ర
సంఖ్య లతిథు లింటికి నెల్లఁ జాలి నిండి
యునికి నింత సం దేమెడ నొందఁ డయ్యె. ౧౯౨

వ. అంత నిలునలుమూలలుం గలయ వెదకి తుట్టతుదకు వంట
యింట నన్నముతాశి కనతిదూరమ్మున నాపెత్తో విందు
భోజనమ్మునకుం గూర్చుండి యుండె; నత్తఱి వడ్డనగాం
డ్రలో ధూర్తుం డొకండు తొందరవడి ముందు వెనుక లర
యక, లెండు, లెండు, యజమానునిసగ్గరివా రైన నేమా
యె? బ్రాహ్మణ్యమ్ము బుగ్గిం గలిపిన యలంతులు; వైశ్వ
దేవయోగ్య మంథోరాశిసామీప్యమ్మునకుం గుక్క-లటులు
తటుకునఁ బరు విడి యరుదెంచితిరి, యెంగిలి సేతురా? యని
విదలించి వైచుడు నవ్వాక్ఛరమ్ములం దఱుఁగంబడి కాలువ
గట్టు కన్నీటిదార లాపుకొనుచు నయ్యాలుమగ లన్నంబు
లేకున్న నేమాయె? బ్రతికి చలుపం గల జగదుద్ధృతి
యెట్టిది? కాయంబు సాపాయంబుగదా! యని తలపోయు
చుఁ గుడువకయ చివాలున లేచి శ్రీపతి చూపునం బడక
తమయునికిపట్టున కరిగి; రయ్యెడ గోపతి, పాపవిధిసేఁ
తకు నట్టిట్టవు పాణిగృహీతి నూరార్చుచు నల్లన ని ట్లనియె.

క. అలనాఁ డన్నకు నన్నిటఁ
దులదూఁగం బంచికొంటిఁ దొయ్యలి! పొలముం

దలవముం గలవల్లెము, నేఁ
డలఁతిన యయి కోలుపోతి నది యెల్ల నిటుల్. ౧౯౪

వ. అందులకుం దగిన కత యొకం డలరు; ధనయౌవనమదాంధ్యమ్మున నీవఱ కద్దానిగుఱుతు లెఱుంగనైతి; నయ్యది యెయ్యది యంటేని, ౧౯౫

సీ. పిసిఁడి మాదుపితృవ్యకసివ్రానిపలుకుల
పేరిములుకుల శరీర మెల్లఁ
దూటులు వడి నాఁడు, తోడన చనితిమి
కద వివేకబుధాగ్ర్యసదనమునకు,
నమ్మహాత్ముఁడు కూర్మి యగ్గలమై తలి
ర్పఁ దనపౌనర్భ్వ నుపాంగలలిత
పేరఁటిప్రవతరాజ మోరిమి బోధించె;
నలరునిరూఢిఁ దదాచరణము

వశమునం జేసి యంతటివార మైతి
మేము; మాయన్న విడువ నూహింపఁ డీద
నుకఁ దదర్చావిశేషముల్; వికలబుద్ధిఁ
దన్ని యేఁ గాల నద్దాని సన్నగిలితి. ౧౯౬

వ. కావున, ౧౯౭

క. ఎద్దానఁ బడసితి విభవ
మెద్దానిఁ మఱచి కఱచి తిమ్మోయి దైన్యం

బద్వానికూర్మిఁ గొను దీఁక
ముద్దియ! తములు; ములు వుచ్చ ములు వలయుఁ గదా.

క. ఇదె నాశపథమ్ము సదయ
హృదయ యుపాంగలలితచరణేందీవరముల్
మృదులము లగ్గ మ్మవుద
నకుఁ దినక్ ద్రావఁ గొనఁ గూరుకుఁ గాంక్షింపఁ జుమీ.

గోపతి యడవులకుం బోవుట

వ. అద్దేవీమార్గం బన్వేషింప నిదె పోవువాఁడ నని చివ్వాలున
లేచి నిలువక తదేకలక్ష్యమ్ముగ మిట్టలు పల్లమ్ములు
నూతులు గోతులు ననక కరువలిం బురుడించుజవమ్మునం
బరుం గిడి యెయ్యెడం గాలు మోపక యట నటం గనం
బడు తెరువరుల నజ్జగజ్జననిజాడ లడుగుచు నన్నపానీయ
మ్ములమాటఁ దడవుపాటిం గొనని నియతి గభీరకాంతా
రాంతరంబులం బడి యెల్లవలంకులం బరిభ్రమించుచుండె;
నటు లేనవునాఁటి ప్రొద్దున నినుమడించినక్షుత్పిపాసలకుం
గుఱియై బడలి సత్వంబు సడలిన యొడలు నిలువక
యొకచో విగతచేతనత నేలం గూలియు దేవీకృపావశ
మ్మునఁ గ్రమ్మఱఁ దెలివిం గాంచి నలుమూలలు దిలకిం
చుచు నొక్కయెడం గోచరించిన గోపాలు నొకని నెట్టటో
కృత్యాద్యవస్థపయిం దఱిసి యాదర మెసలార నోయీ,
నీ వెవండవు? ఎందులవాఁడవు? మీయొడయండు నెవండు?

ఈదేశమ్మునసమాహ్వయం బేయది? దయమెయి నోడువు
మనిన వాఁ డి ట్లనియె. ౨౦౦

క. మాయది యుపాంగవిషయము,
మాయొడయఁ డుపాంగనృపుఁడు, మాపురి వెలయుం
బాయక యుపాంగలలితా
ఖ్యాయిని శ్రీదేవి, నే నుపాంగుఁడ నభిధన్. ౨౦౧

ఆ. ఆయుపాంగలలిత యంఆచేతిలో రత
నమ్ము నాకు మాపురమ్ములోని
జనములకును నహహా! చల్లనివేళ మా
జననిపేరు దడవుకొనఁగ నయ్యె. ౨౦౨

తే. ఆయుపాంగమునుండియ యాలఁ గాచు
పనికి నరుదెంచినాఁడ నివ్వనికి నదియె
మాపురంబున కేగ నౌ మార్గ మనుచు
వివర మొకరుఁడు సూప నవ్విప్రవరుఁడు, ౨౦౩

వ. తోఁకొను కెలసమ్ము కొలందికి మివుల నబ్బిలంబునం
గోపకుఁడు తోడుగఁ దూఁకొని చని ముంగల, ౨౦౪

క. ఆమేదినీనిలింప
గ్రామణి యవ్వేలఁ గనియెఁ గనువిందులుగాఁ

గోమలసముద్యదినరు
క్ప్రీమహిత ముపాంగలిత చెలఁగునిలయముఁ. ౨౦౫

తే. శుద్ధసౌవర్ణకలశోపశోభితమ్ము
మహిత మా జగదంబికామందిరమ్ము
పొలచె శీర్షమ్ము భానుమండలముతోడ
నిమ్ము లొలికెడు నుదయాచలమ్మువోలె. ౨౦౬

క. అటుపయి హృత్పుటి నెకొ్ని
స్ఫుటభక్తిఁ దండమటులు ప్రమొక్కి యతండుఁ
నిటలతటమ్మున నంజలి
పుటి ఘటియించి వినుతించె భువనేశి నిటుల్. ౨౦౭

గోపతి యుపాంగలలితను స్తుతించుట

తే. సర్వమంగళమాంగల్య! సాధువాంఛి
తార్థసిద్ధిప్రదాయిని! యజ్ఞసూతి
ముఖ్యసర్వసుపర్వసంపూజ్యమాన
చరణరాజీవయుగ! నమస్కార మిదిగో. ౨౦౮

క. పొడసూప జగమ్ములు నే
మొడరు లడరకే సుఖింప నెగయులయాగ్నిం
బడి పులుఁగు మాయ నీవే
కడకొనుమూలంబు గద జగద్ధాత్రి! శివా! ౨౦౯

ఉ. ఎక్కటి నుక్కుతునక్క లసురేంద్రులు శుంభనిశుంభము
ఖ్యులం దక్కక పిల్లకాకియు నుదగ్రపరాక్రమ మేపు
సూప సమ్యక్కదనంబునన్ యమపురాతిథులం బొనరించి
సత్కృపాదృక్కుల నిల్పవో సురలఁ దీటినస్వస్వపదంబు
లన్ లలిన్. ౨౧౦

తే. నలిని బలుకులఁ జిత్తమ్మునం దనువునఁ
దవిలి కొలుచుసాదులఁ బ్రోచుదయ దలిర్పఁ
దోఁచుచుందు వీ విట్టి మూర్తుల ధరిత్రి
నంబ! చిన్మయమూర్తి! యుపాంగదేవి! ౨౧౧

క. ఘోరము రాగమయాంభః
పూరగభీరంబు దుఃఖపుంజావర్తా
పారము సంసారమకూ
పారమ్మున మునుఁగుననదప్రాపవు నీవే. ౨౧౨

క. తమిమెయిఁ గుటిలీకృత మం
గమునం గుండలిని యయి ప్రకాశముఁ గొను ని
న్ను మహామానులు మోక్షే
చ్ఛ మదిన్ రెట్టింప సతము జపియింతురు సూ. ౨౧౩

క. కనకారవిందబద్ధా
సనమున సనకాదియోగిజననుతపదజీ

వనజమ్ములఁ దవు కమలన్
నిను మనుజులు గొలుచువారు నిండినభక్తిన్. ౨౧౪

క. అమ్మా! కృతాపరాధుఁడఁ
జుమ్మా నీయడుగుదోయి సుస్థిరభక్తిన్
ముమ్మాటికి నమ్మితి నిఁక
సమ్మానముతోడ నేలు జాలుం గొనుమా. ౨౧౫

క. పాలితవిష్టపచయ! యి
ల్లాలున్ మఱి యెల్లవారు నన రోసితి ని
న్వేల నను నీట ముంచెదొ
పాలన్ ముంచెదవొ నీదుపాలం బడితిన్. ౨౧౬

క. అని యగ్గలమ్ము బత్తిం
గొని యగ్గించు ధరణిసురకులజుం డకృతా
శనముగ నయ్యెడ నిద్దురఁ
గొనెఁ గ్రుంకుడు నినుఁడు దీర్చికొని సంధ్యాదుల్. ౨౧౭

తే. అంతఁ జిత్స్వారవలిత యుపాంగలలిత
యగ్గమై స్వప్నమున స్వజనావనాను
కూల మా శుభాకృతి ననుఁ గూర్మిపేరి
యమృతముం జిలుకుపలుకుల నతని కిటులు. ౨౧౮

క. గోపతి! యెంతయు నరుసము
ప్రాపించెన్ నీ స్తవమ్మువలనఁ గనంగా

నోపితి నాపదయుగలము
రూపఱుతం బెడఁద లెల్ల రూఢిగ నింకన్. ౨౧౯

క. వడి నిద్ర దెలిసి కెలసము
కడకొన నీప్రోలు నేలుగడపాలికి నీ
వుడుగక పనివిను మాతఁడు
నడరుమహాదరమున నిను నర్చితుఁ జేయున్. ౨౨౦

క. పదపడి వదాన్యగణ్యుఁడు
సదయుం డాతేని నడిగి క్ష్మాసురనుత! పే
ర్మిఁ దదర్చనముకరండ
మ్మదవుపిధానమ్ము గొనుము ముదఁ మెదఁ బొదలన్.

వ. అంనతరంబ తదనుమతి నిజనివాసమ్మునకుం జని ననలు దొడుగు బత్తి హత్తఁ జిత్తమ్మున నను నిలిపి యనుదినమ్ముఁ బూజించుచుండునది; యద్దాన ననన్యసామాన్యంబులు వైభవంబులు వలయు నెల్లయీప్సితంబులుఁ బడసి లోకమ్మున వాసి కెక్కఁ గలవాఁడ వని యపుడ మెఱపు తీవియంబోలి యద్దేవి యంతర్థి వొరయుడు— ౨౨౨

గోపతి దేవీపూజాకరండపిధానముం బడయుట

సీ. పొడమునచ్చెరు వన్న కడలిలోఁ దలబంటి
మునిఁగి తేలుచు గౌతమునిసుతుండు

వీఁపు తట్టినయట్టు వేగ మేల్కాంచి యు
పాంగలలితకు సాష్టాంగ మెఱఁగి
ముకుసూటిగ నుపాంగభూపాలుపాలికిఁ
జని వానిచేయునర్చనల కలరి
దేవి చెప్పినయట్టు లావాని నడిగి త
ద్విమలపూజాకరండముపిధాన
వరము గైకొంచుఁ దొంటివివరముదారి
దుర్గమారణ్యమధ్యమ్ముఁ దూఁకొని కుఱఁ
గటన కన్నువిందులు గొల్పఁ గల స్వజనప
దమ్ము సేరె నిల్లాలు ముదమ్ము వొరయ. ౨౨౩

క. ఆసాధ్వీరత్నము మగఁ
డాసరణిం బ్రతిన సేసి యరిగినది మొదల్
గా సాదమ్మును నీళులు
నేసమయమ్మున నెఱుంగ దిప్పటిదనుకన్. ౨౨౪

వ. అంత ౨౨౫

క. గోపతి శుచియుం బ్రయతుం
డై పడఁతుకఁ గూడి మాడి యర్చించి కరం
డోపరిపిధాన మాయత
మై పొడమిన భక్తిభావ మసమానముగాన్. ౨౨౬

వ. కావలసినచుట్టపక్కమ్ముల నతిథుల నభ్యాగతుల నెల్లరం గూడి పారణమ్ము సేసె; నయ్యాదియ దైనందినవ్రతమ్ముగ

నమ్మహీతుం డొకకొన్ని సమ లయ్యుపాంగలలితసేవ
లవారిం బొనరిచె; నద్దాన సకలసంపత్సమృద్ధుండై లోక
మ్మున నోహో యనిపించుకొని యన్నకు ననురాగపాత్ర
మ్మగు నసమ్మ గడించుచుండె. ౨౨౭

తే. కలదు సర్వాంగసుందరి కలితలలిత
వచనరచన లలిత నా నుపాంగలలిత
కూరిమిం గన్న మురిపెపుకూఁతు రొకతె
గోపతికి; నాపె జననికిఁ గుత్తుక నెఱి. ౨౨౮

క. ఆలలిత యీడుజోడులు
బాలలతోఁ దవులునాటపాటలకు మహో
మూలము విధానముం బిత్రు
లాలిత కొని యేగుచుండు లలి ననుదినమున్. ౨౨౯

క. అనురాగవాగురం దగి
లినకతముననో ప్రమాదకృప్తినో మఱి యే
లన్నో కూఁతు నట్లు కా దను
పనిఁ గొనఁ బో రైరి కట్టువడి తలిదండ్రుల్. ౨౩౦

వ. ఒక్కనాఁటి శుభావహమ్మువేల లీలాకేలికోల్లాలిత లలిత
యూరి కనతిదూరమ్మునం గల దివ్యతరంగిణి ననుంగు
చెలికత్తియలతో విహరించుచు, ౨౩౧

లలిత శవమ్మం బ్రతికించి యింటికిఁ గొంపోవుట

క. సుడిబడుజలపూరమ్మునఁ
బడి వచ్చు నొకతరుణకుణపమ్మం గని లో
నడరినవెఱ నీళులు పయిఁ
బడ సాచ్ఛాదనముచేత వడివడిఁ జల్లెన్. ౨౩౨

తే. అమరుతత్ప్రిధానప్రభావమునఁ జేసి
క్రమ్మఱం గొన్న యుసులతో నమ్మహార్త
మున సముత్థితమై పొల్చె భుజగదష్ట
మా కళేవర మడఁగి విషార్తి యెల్ల. ౨౩౩

క. లలితయు లలితాకృతి ని
మ్మలు గను నా కోడెగానిఁ బొడఁగనునంతం
దలఁచెం జెలువునిఁగాఁ గొన
నిలఁ గన్నియ రూపవిభవ మెదఁ గొరుఁగదా. ౨౩౪

తే. పరిణయమ్మున్ప్రాయంపు మేల్పసిఁడిబొమ్మ
లలిత కుతుకానఁ దమతండ్రి నెలవునంద
విందు గుడువ నాఁ డరుదేర వేఁడుడు నతఁ
డట్లయవుఁగాత మని చనె నాపెతోడ. ౨౩౫

క. నడిస్రోవఁ గూర్చుపలుకుల
బడి గుణరాశిగ నెఱింగి వానిం బేరం

బడుచుం గుతుకము మది నా
తఁడు దన కనురూపుఁ డనుచుఁ దమి నను నిమ్మీ. ౨౩౬

క. ఓగుణరాశీ! యొక్కరుఁ
డేఁ గోరిక నొడువ సాహసించితి నిదె నీ
వోఁ గా దన కటు మెలఁగం
గాఁ గల వలఁతి వనునమ్మకమ్ము తిరమ్మై. ౨౩౭

క. మాయింట విందులు గుడుచు
నాయెడ నాపోశనమ్మునవసరమున నీ
వాయోడక కన్నియ నీ
మాయయ్యకు వేఁడుకొనుము స్మరసుకుమారా! ౨౩౮

వ. పదపడి మదనమోహితుండై మాయయ్యాయు నట్టుల పొన రించువాఁడు. లోకోత్తరచరితుండవు నీ కిల్లాలుగ శ్రేయమ్మొనయ వలయు నను నిచ్చ నింతగ బ్రతిమాలుచుంటి నని వానిచే నొప్పించె నది యెంతటి నెఱజాణయో! గుణరాశియు గోపతియింట విందు గుడుచువాఁడై యాపోశన సమయమ్మున లలిత చెప్పినచొప్పుం దప్పక ప్రవర్తించుడు నమ్మనీషియుఁ గలచుట్టపక్కమ్ములసమ్మతిం బడసి కూఁతుకుతుకమ్మున కలరుచు నొకశుభముహూర్తమ్మున లలితాగుణరాశిపరిణయమహోత్సవముం గనువిందులుగ జరిపి తనయిరవున కనతిదూరమ్మునన రమ్యమ్ము హర్మ్యమ్ము నిర్మింపించి కూఁతున కొసంగె; నంత, ౨౩౯

తే. చిలుకలుం గొరువంకలలలినిఁ గనుల
కద్దుకొన నొప్పునొప్పున నాలుమగలు
వార లన్యోన్యరాగంబు పరిఢవిల్లఁ
గాఁపురముఁ దీర్చుచుండిరి క్రాలుపేర్మి. ౨౮౦

క. చెవి కెక్క విని యునికిఁ ద
త్ప్రవిమలపూజాకరండరాజపిధాన
మ్మవిరళమహిమముఁ దోడ్తోఁ
దవులురహోవృత్తి లలిత దాఁ గొని చనియెన్. ౨౮౧

క. అద్దానగుణరాశికి
నద్దం బద్దు గనరాని యతులవిభవముం
దద్దయు నెవ్వం గుండియ
బ్రద్ద లవుగతియు సమకురె శ్వశురుల కెలమిన్. ౨౮౨

తే. సైప నోపక దారిద్ర్యతాపభరము
గోపతిలతాంగియు ననుంగుకూఁతు డాయ
నరిగి సేమమ్ము నడిగి మీయయ్య యాగ్ర
హించుచున్నవాఁడు పిధాన మీఁగదె యన. ౨౮౩

క. అమ్మా! యల్లున కీమా
త్ర మ్ముపహారమ్ము నీయఁ దగ వగునో! మా
న్యమ్ములె? మడులా? యని భ
ద్రమ్ముగఁ దా నంపి పుచ్చెఁ దల్లిని సుతయున్. ౨౮౪

తే. నాఁడు మొదలుగ నెమ్మది గూడు గట్టి
నెమ్మదిం బెద్ద గుట్టయై నింగి కెగసె
నొక్కపెట్టనఁ గూఁతుపై నోదవిన యిడు
గడ జనిత్రి కెప్పట్టున నడఁగఁ బోక. ౨౪౧

వ. అంత. ౨౪౨

గోపతియిల్లా లల్లునిఁ జంపించుట

తే. ఆముకొని యగ్గలమ్ముగ నచ్చలమ్ము
చెనఁటియై యాపె మొఱకులచేత నల్లు
నుసుఱు దీయించె నొకతఱి నుగ్రవనుల;
నెంత కొప్ప రీర్ష్యాళువు లింతు లుర్వి? ౨౪౩

తే. పిడుగునకు నుద్ది యవ్వార్త వీనుత్రోవఁ
బడినపాటన యాఱి తెల్వి పడి గుభాలు
న నిల విలపించె సుత కరుణముగ నశ్రు
పూరమునఁ గనువిరిపువ్వులు నిండ. ౨౪౪

తే. కురరిచందాన వందఁరు కూఁతుగోడు
నులివు నాలించి తల్లి య దొక్క యింత
యెఱుఁగనట్టులు తెచ్చికోలేడుపునఁ బ
రుంగువాఱుచుఁ జనియెఁ గనంగ నాపె. ౨౪౫

తే. విధికిఁ దల యొగ్గి దుర్గతి విధవ యైన
లలితకంఠెను దల్లియగ్గలపు బెడఁద

యాడ వినఁ గన రానిద యయ్యె భూమ్మ
తప్పెటలతోడ నిధనయత్నములతోడ. ౨౭౦

ఉపాంగలలితకూరిమి గుణరాశి మరల బ్రతుకుట

క. ఆలో నుపాంగలలితకృ
పాలోకన మన్న దుర్లభామృతలహరిం
జాల తడిసి జామాతృఁడుఁ
బాళిం బునరాగతాసుపవనుం డగుచున్. ౨౭౧

వ. కాలంబుసేఁత కొకయడుగున్న యేరి యుంచుకొనిన సమిత్కుశాదులతోఁ దొల్లింటికంటె ద్విగుణితమ్ములు సురూపవయోవర్చోవిభవంబులం గమనీయుండై దర్శనీయత్వంబు చెన్నడర నడరు వడివడినడల నిరవున కరుదెంచి లలితకును నెనరైన యైన చుట్టపక్కమ్ములకును నాగలమ్మగఁ గనువిందులు వెట్టుచు నెట్టెటో దొడ్డిత్రోవం బడి బ్రతుకు జీవుఁడా! యని యిలు సేర నుంకించు చెనంటియ త్తకుం గుండెగాలమ్మును గలపనబిండియు నవుచు నిల్లాలిపయిం బడినక్షణమాత్రవై థవ్యదోషమ్ముపశమింప శాంతికర్మమ్ములు యథావిధిం జరిపించి పూజాకరండపిధానానవరతసేవాదుల నేమఱక యనుంగు నంగనతో సుగం బుండె. ౨౭౨

సీ. పలుబాములకు నోర్చి పడసినపూజాక
రండపిధానమ్ము గొండికలయి

కోలుపోవుట గాక కూడుగఁ జేజేతఁ
గడఁగినచేఁతఱికములబలిమిఁ
బెద్దమ్మడగ్గరివిందులు మందులు
నై పడుపలుపాట్ల ననువు దప్పి
యవురు సవురు లాచుఁ దవిలినదారిద్ర్య
మెంతయుఁ గుడిచిర యేండ్లుఁ బూండ్లు

గోపతియు వానిపడఁతియుఁ; గొండొకతఱి
శ్రీపతిం జేరి గోపతి చెలఁగుభక్తి
భావ మిర వొంద రచితాంఘ్రివందనముగ
ననియె నిమ్మోయి దైన్యమ్ము నెనయునొడుల. ౨౫౩

క. తఱుఁగవు ధనధాన్యమ్ములఁ
బెఱుగవు ముఖవందిజనులవినుతుల కెపుడే
నెఱుఁగవు మచ్చర మొరుపయి
మెఱుఁగవు గౌతమకులమ్ము మేల్మిపసిఁడికిన్. ౨౫౪

క. అఱినకులాచారమ్ముల
మొఱటున నై యెటులు మెతుకు పొట్టకు నొకఁడే
వఱలనినిప్పచ్చరమున
మెఱుఁగుంబోఁడితో మివిలితి మిత్తికి నిపుడేన్. ౨౫౫

తే. పడెడు ననదన తొలి యిట్టిపాటులే ప్ర
పన్నజనకల్పవల్లి యుపాంగలలిత

కూర్మిం గొన్న పెన్నిధియును గోలుపోతి
నిప్పు డెప్పటికాళు లి ట్లెట్టు లయ్యె. ౨౫౬

క. అన్నా! ఒకకడుపునిసుంగు
లన్నాదమ్ములలో యింత యంతరమా! యీ
బన్నమ్ముల రాకయు నా
కెన్నన్ నేరనివెఱ వోడమించెడుం గడంకన్. ౨౫౭

మ. అనుడున్ శ్రీపతి యిట్లు వలుకు- ననుజా! యజ్ఞేయముల్
దైవచోదనముల్; పట్టణముల్ మహాటవులు కాంతార
మ్ములున్ జేండ్లవొల్చునగళ్ళున్ నిముసమ్ముమాత్ర నవు
చుండున్; గల్మియున్ లేమి బాలునిచేతం గల బంతిపాటు
లకు నీడుల్; లోకమే మిథ్య సూ. ౨౫౮

వ. అది యిటు లుండె— ౨౫౯

ఉపాంగలలితావ్రతప్రశస్తి

క. శ్రీయుతుఁడు వివేకోపా
ధ్యాయగ్రామణి మది దయ దయివార నను
ప్మేయ మ్ముపాంగలలితా
శ్రేయోదవ్రతమును వివరించెఁగద యచోన్. ౨౬౦

క. అద్దానఁ జేసియ కద వి
పద్దుస్తరవారిరాశి వడి లంఘింపం
దద్దయు నేరిచి కలుముల
ముద్దియ దా పెద్దకూర్మిఁ బొందితి మెలమిన్. ౨౬౧

తే. గోడబారుతన మ్మది కూడు గాఁగ
నడువఁ దొడఁగి నేఁ డా యూసుఁ దడవకునికి
నింత లోదవఁగనయ్యె నీ కింతవట్టు
నిజము; వ్రతరతు ననుఁ జూడ నెవ్వ వెఱచు. ౨౬౨

తే. ఆయెఁబోయెఁ దొల్లిటికత యాయతమ్ము
భక్తిభావమ్ము నలువారఁ బ్రత్యహమ్ము
నమ్మహావ్రతమ్ము నొనర్చునట్టి నియతిఁ
గొనుము శ్రేయమ్ము లతులము లెనయ నేర్తు. ౨౬౩

క. అని సవిధాన మ్మవ్రత
మును నుపదేశించె నతఁడు మునుకొనునిష్ఠం
బొనరింపఁ గడఁగె నని చె
ప్పినచొప్పును దప్పఁ బోనివిధి విపులముగాన్. ౨౬౪

వ. అట్టుల యాచరించువాఁడై గోపతి యుపాంగలలితకూర్మి
పేరిమిం జేసి శ్రీపతికిం గూరుచుసోదరుండ యన నవని
నెంతే వాసిం గడించెఁ; గావున సత్తములారా! యుపాంగ
లలితాదేవీవ్రతవైభవ మింతింత యని వివరింప వేయిపడ
గలవానికే నలవిగాదు; మీరడిగినకతమ్మున నాయెఱింగి
నంత నొడువ సాహసించితి; నింకఁ దద్వ్రతవిధాన మ్మొక
యింత వచింతుఁ; బాయక యద్దాని నాచరించుచు నభి
మతార్థసిద్ధిం బడయుం డని కౌమారీకుమారుం డీతీరున
నొడువం దొడంగె. ౨౬౫

ఉపాంగలలితావ్రతవిధి

సీ. ప్రథిత మాశ్వినశుక్లపక్షపంచమి యివ్వ్ర
తమ్ము ననుష్ఠింపఁ దవినప్రొద్దు;
హెచ్చుతగ్గులు లేని యచ్చంపుటేనవు
తిథితోడి పర్వపుదినము నరసి,
పఱువాఁత నానాఁట నెఱిఁగి నిద్దుర సము
త్థములు నలువదియెనిమిది దంత
కాష్ఠమ్ములం గొని, కాసారమున కొండె,
స్వచ్ఛాంబుపూరనిర్ఝరిణి కొండె,
నరిగి, పలు దోమి, యఘమర్షణావగాహ
నమ్ము పొనరిచి, యావశ్యకమ్ము కర్మ
మెల్ల నల్లనఁ దీర్చి, ధరించి మడుగు
పంచె లునికికి మగుడ రావలయును వ్రతి. ౨౬౬

క. సరసత రంభా స్తంభను
పరిష్కృతము మందిరమున భాసిలువేదిం
గిరికొనుబ త్తి జగన్మం
దిర లలితప్రతిమ మెలమి నెలకొల్పఁ దవుఁగ. ౨౬౭

ఆ. బంగరుఁ బైఁడి, వెండి యొండెఁ, దామ్రము నొండె,
నొండె రాయి, దారు వొండె, మృత్తు
వొండె, లలితప్రతిమ మొనరింపఁ దవునవి;
పూర్వపూర్వ మొసఁగు భూరిఫలము. ౨౬౮

క. అవల లభించు శుభద్ర
వ్యవిశేషములం బుఫుల ఫలాదులఁ బడునా
అవునుపచారమ్ములలలి
సవిధానముగఁ గొలువఁ జను జగదీశ్వరిన్. ౧౯౯

వ. గీతవాదిత్రనృత్యాదుల నద్దేవిం బ్రసన్నం జేయవలయుఁ, బిండికొలంది బొట్టెగదా; తనకుం దనతలంపున కనురూపమ్ముగ నెన్నిరీతులనేని నెంతయేని లలితాంబిక నుపచరింప వలనుపడు; ననంతర మాచార్యునిఁ, దక్కుంగల పూజ్యులఁ, దన యోపినకొలంది పూజించి నాఁటిరేయి దేవ్యుద్వాసనము నొడువవలయు; నీలలి నివ్వ్రత మాచరించునంచితులు కొమరులను, ధనధాన్యమ్ములను గోరుకొను నెల్లకోరుకుల నచిరకాలంబునన పడయంగలవార; లంతియగాక, ౨౦౦

క. ఉవిద యవైధవ్యము, క
న్య వరున్ వలరాజు గెలుచు నాకృతి గలవా
ని, వసుమతీశుం డని గెలు
పు, వినునతఁడు కోర్కె లెల్లఁ బొందుం దీనన్. ౨౦౧

వ. అని మును షాణ్మాతురుండు నిఖిలలోకకల్యాణకారణమ్ముగ నిమ్మహావ్రతమ్మును మానికులతల్లజులకుం బల్లవించు కరుణాళుత్వమ్ము స్వత్వమ్ముగ నుపదేశించె. ౨౦౨

క. భణనగణనమననవిరూ
పణసంస్ఫురణానుమానపథనవిషయతా
ప్రణుతానుభవానంద
ప్రణయీ! ప్రణవకతురీయపరమకలాత్మా! ౨౭౩

చ. స్వవిపులపూతసేతుతతిపాలనధుర్యసుధారసార్ణవ
ర్యవినుతపాదపంకజపరాగసుయోగ! యనంతభోగభో
గివిభువిభూషితాయతనకించనసంచయపాత్రమిత్రగా
త్రవిమలదీధితిప్రజితరాజతపర్వత! పర్వతస్తుతా! ౨౭౪

ద్రుత. తరణిబింబకృతస్థితిసుస్థిరా! హరిదనీకసమాకలితాంబరా!
సురపథాదృతశోభనకుంతలా! చరణసంశ్రితసాధ్వవనోజ్జ్వలా!

ఉపజాతి— ధీసంలసత్సత్యవతీస్వపత్యా
గ్ర్యసత్యనారాయణరాజపూజా
భ్యాసాత్తమోదాలసుఁడై కృతీశుం
డెసంగు నీకూర్మి గడించు వాసిఁ. ౨౭౬

గద్య— ఇది శ్రీ శ్రీవత్ససగోత్రపవిత్ర, చిదంబరపౌత్త్రి
నాగభూషణసుధీవరపుత్త్రి, శ్రీబాలాత్రిపురసున్దరీ
గర్భశుక్తిముక్తాఫలాయమాన, ప్రభాకర, లక్ష్మీ
నరసింహశాస్త్రిసమాఖ్యానప్రణీతం బైన
కాలభాగవతము సప్తమస్కంధమున
నాశ్వినమాహాత్మ్యము
చతుర్థాశ్వాసము.

శ్రీరామ

# కాలభాగవతము - సప్తమస్కంధము

# ఆశ్వీన మాహాత్మ్యము

## పంచమాశ్వాసము

---

శ్రీనిత్యసత్యసంశు
ద్ధానందకలాకలారసానుభవసుసం
దానితభావనిధానా!
స్థానభవాప్యయవిధాన! సదమలభానా! ౧

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదుల కిట్లనియె న
ట్లుపాంగలలితావ్రతమ్ము నొడివి వెండియుఁ జతురానన
తనయుండు పృథుమహీపతి కిట్లని వినిపింపంగడంగె. ౨

### దశాంగలలితావ్రతము

తే. పార్థివోత్తమ! వినుము సర్వప్రపంచ
భవికకారణమ్ము మఱొండు వ్రతము పరఁగు

ధర దశాంగలలితపేరఁ; దత్పరత సు
పర్వసురభి ముంగిటఁ గట్టివెచి కొంట. 3

క. మును మునిఁగి చింత వంతం
గొనుమనమునఁ గొంతిపెద్దకొడుకు ముకుందుం
గనుఁగొని ప్రణమిలి యిటు లనుఁ
గొనకొనునాదరము భక్తి కుదురుకొనంగన్. ౪

తే. వివిధయజ్ఞవ్రతాకృతి! విందు నే ద
శాంగలలితపేరివ్రతమ్ము; నద్ది పొసఁగ
నేమికతమునఁ? జలుపనో నెట్టు? లెట్టి
ఫలము లీ నోపుఁ? గూరిమిఁ దెలుపుమయ్య. ౫

వ. అని వేఁడుడు నమ్మధుసూదనుండు కౌంతేయాగ్రజున కి ట్లనియె. ౬

క. విను మిటు లయోధ్య యేల్గడ
వినుతయశుఁడు దశరథపృథివీవరసోముం
డనపత్యుం డయి కూర్చునె
లనాగ కౌసల్యతోఁ గలంగినమదితోన్. ౭

వ. వనమ్ముల కరిగి యందందుం గల మునికులతిలకుల సేవించుచు ధర్మరహస్యమ్ము లెఱింగికొనుచుఁ జరించువాఁడై యొకనాఁ డేకశృంగుండు ఋశ్యశృంగుం డను మునిపుం

గవుం దిలకించి యంకురించినభక్తివినయాదిభావమ్ముల
నోముకొనుచు నెఱింగి యవ్వానియానతిఁ దనవితమ్మెఱిం
గించువాఁడై యనపత్యతాశోకకృశత్వమ్మును విన్నవించు
కొనుడు నమ్మహానీయుండు కనికరమ్మున కిమ్మైన మాన
సమ్మున దశస్యందనున కిట్లనియె. ౮

క. ఓమానవేంద్రచంద్రమ
సా! మానక యింతమాత్రఁ జనునే వగవం
గా మానసమునఁ? గొమరుల
సామాన్యులు గలుగువారు సరవిన్ నీకున్. ౯

క. సకలేప్సితార్థసిద్ధుల
వికలత సమకూర్చు విబుధవిదితమ్ము వ్రత
మ్మొకరుఁడు; తత మద్దానిం
బ్రకటమతిం జలుపుమయ్య ప్రతివత్సరమున్. ౧౦

ఆ. ఆమహావ్రతమ్మునందుఁ జందురుకూర్చు
వెలఁది రోహిణిం దవిననిరూఢి
సుప్రసన్నఁ జేయుసువ్రతునకు నంద
రాని ఫల మొకండుఁ గానఁ బడదు. ౧౧

వ. అయ్యాది దశాంగలలితపేర నింపారుఁ; దద్విధివిధాన
మ్మెవ్విధిఁ బ్రథితి నెనయు నందువేని నవధరింపుము. ౧౨

క. లలి నిషముపేరినెలలో
 వెలిసామున దశమినాఁడు వే ప్రయతుండై
 కలుకొనుశుచిత్వమ్మునఁ
 జలుపఁగఁ దద్వ్రతముఁ గొనఁగఁ జను వ్రతి నియతిన్.

క. భావితము స్వర్ణకృప్తము
 దేవీప్రతిమమున నొప్పు తెరువు విడం బో
 కావంత సమర్పింపం
 గా వలయున్ గంధసుమముఖమ్ములు వెలయన్. ౧౮

క. దశమి మొదలొ౯ని యమ్మెయి
 దశవాసరములు గొలిచి త్రిదశసేవిత దా
 దశతనుసంకాశప్రభ
 దశాంగలలితం జతుర్థిఁ దవు విరమింపన్. ౧౯

వ. కూష్మాండమాతులుంగాదిఫలంబులు దశవిధంబులుగ, గంధపుష్పధూపదీపనైవేద్యార్ఘ్యాచమనీయాదులు దశసంఖ్యాకంబులుగఁ బ్రదక్షిణనమస్కారంబు లాసంఖ్యకుం దీసిపోకుండ దశాంగదేవీసేవావసరమ్మున నిరవొంద వలయుఁ; బూజావసానమ్మున మంగళవాద్యగీతనృత్యాదు లొనరింపింప నొప్పు; దినాంతమ్మునఁ జంద్రుండు పొడ సూపునాపయి నర్ఘ్యమ్మును, నైవేద్యమ్మును, శంఖోదకమ్మును, బుష్పఫలాదికమ్ములును గొని, జానువు లవనిం

దాఁకఁ బంచరత్నసమేతంబును, దశపుష్పఫలసమన్విత
మ్మును నవు నర్ఘ్యమ్మును, మూర్ధస్థితపాత్రసహాయమ్మున
రోహిణీమనోహరున కర్పింపవలయు; నయ్యవసరమున
రోహిణీప్రీతిం గోరి యిమ్మెయి వినుతింపవలయు. ౧౬

క. సమకూర్తు వెల్లకోర్కుల
సమానము నెనరు మెఱయ స్వచరణమ్ములు గొ
ల్చుమనీషులకున్ రోహిణి!
హిమదీధితితోడఁ గొనంగదే యర్ఘ్యమ్మున్. ౧౭

క. విదితము వ్రత మిది యీవిధిఁ
బది యేండులు విడక సలిపి వరుసన యాపైఁ
బదిమా ర్లుద్యాపనములు
గుదిరినతమిఁ దీర్పఁ నొప్పగుం బ్రోక్తవిధిన్. ౧౮

క. వరుసన్ ఋత్విక్కులఁ బదు
గుర నాచార్యాగ్ర్యు నొకనిఁ గుసుమంబుల నం
బరముల గంధాక్షతలన్
మురువుగ నెక్కొన్నభక్తి పూజింపనగున్. ౧౯

వ. ఆవల సహిరణ్యమ్ములును, సవస్త్రమ్ములును, సగంధాక్ష
తమ్ములును, నవు దశకలశమ్ము లందుకొని దశసంఖ్యా
కుల భూసురుల వేర్వేఱం బూజించి సుప్రసన్నులం
జేయం జను; ననంతరంబ, లెక్క- కెనిమిదియ యంగులమ్ము

లుండునటులు వెండితోఁ జందురుబొమ్మయు, నాలు గంగు
లమ్ములుగ రోహిణీప్రతికృతిం బసిండితో నేర్పఱిచి నూత
నకాంస్యపాత్రమ్మున నునిచి విధిం దెలిసి పుష్పమండ
పికామధ్యమ్మున స్థాపింపవలయుఁ; బూర్వోక్తవిధానమ్మున
లలితాదేవి నటన ప్రతిష్ఠింపంజను; నవల వేదశాస్త్రవిశా
రదుం డాచార్యునకు వరణ నొసంగి యారేయిఁ బురాణ
శ్రవణాదికమ్ముల జాగరణ మ్మొనరించి, ప్రభాతమ్మునఁ
బునఃపూజ ముగించి, "గౌరీ ర్మిమ" మంత్రమ్మున
దూర్వాష్టశతకమ్మును, "నమో దేవ్యై" మనువున సఘృ
తమ్ము పంచఖాద్యమ్మును, హోమము సేయవలయు;
నాపయి నొక పది మిథునమ్ముల వస్త్రాలంకారాదుల
నర్చించి వ్రతసంపూర్తికై సహిరణ్యమ్ముగ నావు నీ వలయు
నిట్టు లఖండభక్తియుక్తి నాచరించువారు పడయ నేరని
దేయెడఁ గలికమ్మునకేఁ గానరాదు. నీవును శ్రద్ధాళుండవ
యయి యియ్యదియ వ్రత మ్మాచరించునది; కొడుకులం
బడయ నోపుదు వని యుపదేశించిన, ఋష్యశృంగునకుం
బునఃపునః ప్రణామంబు లాచరించి కౌసల్యావల్లభుం
డదియ యేఁడు మొదలుగఁ బదియేండ్లును దశాంగలలితా
వ్రతమ్ము విధివిధానమ్మున నాచరించి సాక్షాద్వైకుంఠా
ధినాథు లక్ష్మీధవుఁ గడుపునం గనుమహాభాగ్యంబున నతి
శయించెఁ; బార్థివప్రవరా! మఱియొకండు కథానకమ్ము
వివరింతు, నవహితమతి నాకర్ణింపుము. ౨౦

సునందాచరిత్రము

క. సుమతిప్రణుతచరిత్రుఁడు
సుమతిసమాహ్వయుఁడు ధరణిసురవరుఁ డొకరుం
డు మహీస్థలి విలసిలె న
న్నమలగుణ యనుంగుసతి దయావతితోడన్. ౨౧

తే. ఆదయావతీసతి చల్లగాఁ దనదుక
డుపు మహర్షులఁ బోలు నేడ్వురఁ గొడుకుల
ముద్దు మురిపెమ్ము గట్టిగ మూట గట్టు
కన్నియ సునంద నా నొర్తుఁ గనియెఁ దమిని. ౨౨

ఆ. ఆ సునంద మిన్నుల నల్లారుబెల్లమై
కన్నతల్లిఁ దండ్రి నన్నలన్ ము
దమ్ము నా సుధారసమ్మున ముంచుచుఁ
బెరిగెఁ జంద్రరేఖసరణి దోఁప. ౨౩

వ. అట్లు కన్నకూఁతునకుం బదియేఁడులయీడు పైఁబడిన
యంత సుమతియు, ౨౪

తే. అందచందాలఁ బరువాన నన్వయమున
నన్నిటం దగి యీడు జోడైనవాని
విమలచరిత్రు వరు శమీకు వెదకి తెచ్చి
హెచ్చు ముదము పెండిలి సేసె ముచ్చటమెయి. ౨౫

క. ఆకన్యావరులమనో
జ్ఞాకారగరిమము రాగ మంటిన నెనరుం
బోకలుఁ బొడగని పడసిరి
వాకో నేరని ముద మిరువంకల విందుల్. ౨౬

వ. లాజాహోమమ్మనవసరమ్మున, ౨౭

క. కాని శుష్కతర మ్మింధన
మనలున నిడ నున్న వరుఁ దదంతరమున డాఁ
గిన నిడుపం డోకరుఁడు ది
గ్గునఁ గఱచెన్ మృత్యుదూతకుం జోడగుచున్. ౨౮

వ. అంత, ౨౯

తే. విసము తల కెక్కె, జాళువాపసిఁడిమిసిమి
నెసక మెసఁగు చక్కనిరూపు పస దొఱంగి,
క్రమ్మె నోర నుచ్చిలి, మూసి కన్నుదోయి,
వేగ మా శమీకుఁడు వోయెఁ బెద్దనిదుర. ౩౦

తే. పసుపుపంచెలతోడి దవ్వాధువు నెల్ల
చుట్టపక్కాలు నెక్కొన్న శోకమున ము
నింగి క్రుంగిరి; విధి నే మనంగ నౌర
వంతలోన నవ్వులు నువ్వు లయ్యె నచట. ౩౧

వ. అయ్యదనున, ౩౨

క. ముని ఋష్యశృంగునాశ్రమ
మునం దశాంగలలితవ్రతముం బొనరిచి నె

కొ్కను తమి నను(గు నెల(తతో ని
జనగరికి నరు(గునత(డు దశస్యందను(డున్. 33

క. విని మధ్యేమార్గమున న
శని కెనయై సుమతిముఖ్యసాధులశిష్య
మ్మునఁ బడి యడఁచు నెడరునొడు
పు నక్కటికము పడి డాయఁ బోయి యిటు లనున్. 34

క. ఏలా వగవ బలీయము
కాలమ్మున కొగ్గి తలలు కర్మమ్ములవౌ
జాలులఁ బుట్టుచుఁ గిట్టుచుఁ
గాలి పులు(గు నెడు నృకీటకమ్ముల కిమ్మై? 35

క. తల(పం బుట్టువుతోడన
తలఁ బీటము వెట్టు మిత్తి, తలి తండ్రి నిసుం
గులు పిన్నలు పెద్దలు నను
తలఁ పెక్కడు దానితలకుఁ, దరలదు వగలన్. 36

తే. చూచి మూర్తమ్ము మన యిడు సూత్రమునకుఁ
బేర్మిఁ బురి బల మెక్కు నూ కర్మసూత్ర
మొక(డు లెస్సయై యున్నఁ; దద్యోజితులు ని
జంబు తనయులు తనయలు సతులు పతులు. 37

క. తనకై అొమ్ములు వగులుచు
కొనుచు వగచునల(తులఁ గను(గొని కహాకహా న

వ్వా నుసుఱు ద్రోఱంగి చనునతం
డెనాంటిచుట్టములు వీర లెల్ల రటంచుఁ. 3౮

వ. కావున, 3౯

తే. ఇంక నింతకుఁ గొఱగానియేదు పుడిగి
కడఁగుఁ డవ్వలి పైతృకకర్మములకు
ననుడుఁ బొడమినజ్ఞానమ్మునన మనములఁ
దిటవుపఱచుక యవ్వారు దేఁకువ మెయి. ౪౦

వ. శమీకుకుణపమ్ము మోచికొనుచు దశస్యందనాగ్రేసర
త్వమ్ము తిరమ్ముగ శ్మశానవాటిం జేరి నిర్మింపింపంబడియ
యున్న చితం బరుండ డించి సమంత్రమ్ముగ శిరోభాగమ్మున
ననలు దరికొల్ప నున్న యయ్యవసరమ్మున. ౪౧

సీ. వినవచ్చె నెల్లరవీనులత్రుప్పుడు
డుల్ల నల్లన నొండు చల్లనిపలు,
కుడుగుఁ డీ జ్వలనసంయోజనోద్యోగమ్ము,
నీతం డుసుఱు వెండి యెనయువాఁడు,
కొండరాచూలికి వెండికొండదునీఁడు
కరుణమై నొడివిన తెరవు నిపుడ
వివరింతు, వివరించువిధమునకుం దూర
ములు చేటులు దశాంగలలితనోము
బలములకలిమి నెడగల్గి పులుఁగు నెడుట
నికుకవము, కాన సుతకు జనిత్రిచేత

దారవోయింపు మాచరితమ్ము తద్వ్ర
తమ్ముఫలము, లగ్గగు మీఁద, దశరథేశ! ౪౨

క. ధరణీధవా! ముచ్చుట్టులు
దిరుగును బో విష్టపమ్ము దిష్టమ్ము మహ
త్తర మేతద్వ్రతరాజము
గరిమముతోఁ దూఁగు పుణ్యకర్మమ్మున్నే? ౪౩

క. అని నోరు వాయి లేనిద
యనువుపడం గొన్న నోట నటు లాదేశిం
చిన వింతబూతమునకుం
బ్రణామములు వేలు కోట్లు బత్తిఁ జలుపుచుఁ, ౪౪

వ. దయావతి తాఁ బొనరించిన దశాంగలలితావ్రతమ్ము ఫలమ్ము జామాతృ్రాద్దేశమ్ముగ దుహితకు నర్పించె; నప్పుడ శమీకుండును బోయినప్రాణమ్ములం గ్రమ్మఱం గొని సుప్తోత్థితుం డెట్లట్లు లేచె, నవ్వానిం దోడ్కొని బంధుగులును బరమానందంబున నింతింత లవుచు నిరవుం జేరిరి; దశరథుండును శమీకువివాహమ్ము ముగిసిన పిదప నిజనగరికిం జనియె. ధర్మనందనా! విన్నయంతన పాపాతిపాపంబులు పటాపంచలు సేయు వ్రతమ్ము లిట్టివి సహస్రసంఖ్యలుగ లలితాంబికపేర నలువారు; నని వెండియుఁ బుండరీకాక్షుం డిట్లనియె. ౪౫

ఏకాదశీవ్రతము

క. కౌంతేయాగ్రజ! దత్తము
స్వాంతమునన్ వినెదునీకుఁ జండీదివ్యా
దంతము లింకన్ నొడువఁగ
నెంతే కెలసమ్ము మది జనించెదు నాకున్. ౪౬

వ. అట్లు కావునఁ బావన మ్మేకాదశీవ్రత మ్మిపుడ వివరించు
వాఁడ నాకర్ణింపుము. ౪౭

సీ. రమణ నేకాదశీవ్రతరతుఁడు దశమి
ప్రొద్దున దరిఁ గల పుణ్యాధునిని
నఘమర్షణస్నాన మాచరించి శుచిత
తోడిప్రయతత సంతోషదముగఁ
దీరిచి నిత్యవిధి యథావిధి సువర్ణ
మయు శ్రీమనోహరు మహితభక్తి
భావ మే పెసలారఁ బదియు నా ఉపచార
ముల సక్తి దఱుఁగక కొలువవలయుఁ,

ప్రార్థనాదులఁ దోల్తొల్త హరిఁ బ్రసన్నుఁ
జేసికొనఁ జను వ్రతముసంసిద్ధిఁ గోరి,
ధర్మనందన! యిదియ విధానముగ ర
మేశు నేకాదశిని సమర్చింప నొప్పు. ౪౮

వ. ఆనాఁ డుపవసించి వ్రతి, ౪౯

క. తులసీదళములఁ గమలం
బుల మునిసూనముల మొల్లపూవుల బిల్వం
బులఁ బూజ సేసి బహువిధ
ఫలముల నర్పింపవలయు వారక హరికిన్. ౫౦

తే. తనర గీతవాదిత్రనర్తనపురాణ
హరికథాశ్రవణాదు లనంతుదరిని
నాఁటిరాత్రి జాగరణ మొనర్ప
నొప్పు నిర్మలచిత్తత యొలపు గొలుప. ౫౧

వ. అమ్మఱునాఁడు ద్వాదశీతిథి రమాసహితుఁ బురుషోత్తముఁ బూర్వోక్తవిధివిశేషంబులం బూజించి భూసురసహితం బుగఁ దత్ప్రసాద మారగింపవలయు; నానాఁటినియమ మ్ములు నేమమ్మునఁ బరిపాలించి వ్రతపూర్తిం బడయ వలయు; నిమ్మెయి నిమ్మహావ్రతమ్మును విప్రక్షత్రియవి ట్ఛూద్రులును, బడంతులు నెల్లవారు హరితుష్టికినై పొన రిచి యఖండఫలావాప్తి నెసంగనోపుదురు; చూలాం డ్రును, బాలెంతలును, బాలురు, వృద్ధులు, నాఁకటి కర నిముసము తాళఁ జాలక నకనకంబడు వనదలు, రోగులు, మున్నగువారు వ్రతాచరణమ్మునకుం గడంగి నడుమన విరమించుకంటె సంకల్పంబు సేయకయ మిన్నకయుండి పొనరించునంచితుల కెగ్గులు దలంపక నిరంతరహరిచరణ ధ్యానపరాయణత దినమ్ములు గడుపుట లెస్స. మఱియు,

క. ద్వాదశిఁ బ్రొద్దునఁ బాత్రులు
భూదేవుల కీవు లొసఁగి పూర్ణమ్ము ఫలం
బాదటఁ గొన నేరుచు నే
కాదశినాఁటివ్రతము గొనుఘనమతి వింటే. ౧౩

తే. క్రొత్త దవు నుదపిరరమ్ము, గోఘృతమ్ము,
పసిండి, నూవులు, మేలిపావాలు, పాలు,
మాతులుంగమ్ము, పక్వకూష్మాండ మొందు
నొసఁగి హరి కైనవాఁడు కానోపు నాఁడు. ౧౪

క. సాలోపలమున సాక్షా
చ్ఛ్రీలోలుఁడు భావనావిశేషమ్మున కీ
డౌలలితాకృతి నిజభ
క్తాలోకనపథము నెనసి యలరుచునుండుఁ. ౧౫

క. కావునఁ బావనుఁ డవనీ
దేవునకుఁ మాఱుదేవదేవుఁడు సాల
గ్రావము ద్వాదశిఁ బ్రొద్దున
భావ మ్మొసలార నొసఁగు వలఁతి యలఁతియే? ౧౬

వ. అటు లవుట నిమ్మహావ్రత మ్మాశ్వినశుక్లపక్షమ్మున నవశ్య మ్మాచరణీయమ్మై యొప్పు; నెవాఁడేని యిచ్చ గింపకయు పనిబడి యుక్తవ్రతవిధానకలామాత్ర మ్మను

సరించునయేనియు వైకుంఠమ్మున సుఖ మఖండము చూర
గొన నేరుచు. ౫౭

గౌతమోపాఖ్యానము

తే. భానుసమభిధానమ్ము పూర్వరమునందుఁ
గలఁడు గౌతముఁ డనువాఁడు, బ్రాహ్మణుండ
కాని పుట్టువునన్, వాఁడు కడఁగుకర్మ
సమితి నెవ్వఁడో యను సందియము జనించు. ౫౮

క. ఆతఁడు నీతిం దప్పిన
చేఁతఁటికమ్ముల ధనమ్ము చేఁ దుడుచుకపో
బూతులజాతర రోతల
పాతర పెద్దమ్మమనికిపట్టును నవుచున్. ౫౯

వ. కూడుగుడ్డలకున్ మొగమ్ము వాచి దేశమ్ముద్రిమ్మరీఁడై
యాఁకటఁ గటకటంబడి యటమటించుచు నొక్కనాఁ
డొక్కవీట. ౬౦

తే. వ్రేలవైచుక తిరిపెపుజోలె చంకఁ
గమికెఁ డన్నముకొఱకునై కడుపు చూపి
కుక్కపోలిక ని ల్లిల్లు నెక్కుగడప
దిగుగడపగా విడక దిమ్మ తిరుగఁ దిరిగె. ౬౧

తే. కుడువ నిడఁ ద్రావఁ గూడ దేకొలఁదియేని
నేఁడు హరివాసరము పొమ్మనిన విడువక

యవుచుఁ గామవరపుజీడి యఱచువానిఁ
గినిసి త్రోలిరి వ్రతరతుల్ గేస్తు లెల్ల. ౬౨

తే. అట్లు లానాఁటిపవ లింత యన్నమునకు
నోమక దురంతమై డొక్క నులియవెట్టు
నంగదన యంగలార్చుచు నతఁడు గడపెఁ
గనులు మూయక హరిస్మృతి క్షణదఁ గూడ. ౬౩

వ. విజయాగ్రజా! భళ్ళునఁ దెల్లవాఱినపిదపఁ బాడువడిన యొకయింటిముంగిటం బరుండి సన్నని యెలుంగున నన్నమో రామచంద్రా! యని కూయిడు గౌతమునిపై నెక్కొన్న యక్కటికమ్మున వైష్ణవప్రవరుం డొకరుండు తనచేతం గల ఫలమ్ములోఁ గొంతభాగ మ్మొసంగుడు నతండును గనుల కద్దుకొని నారాయణునిపేరుపేరిఁటి సుధారస మ్మునం జోడించి యొకరవంత నంజుడు నది యుదర కోశమ్ము జేరియుం జేరమిఁ దనువుం దొఱంగి పట్టిన యిహలోకపుపీడ వదలించుకొనియెఁ; దదుత్తరక్షణంబ,

తే. వెలయుదివ్యరూపంబున విష్ణుదత్త
ముఖ్యు లవు విష్ణుపార్షదుల్ మొనసి కొలువ
భానునిభమైన దివ్యవిమాన మెక్కి
యరిగె వైకుంఠుదరికి నా ధరణిసురుఁడు. ౬౪

క. అటు లవుట ఘోరపాపపు
టటవులకు దవాగ్ని యిమ్మహావ్రతముం బ్ర

స్ఫుటవృత్తి నిషైకావశఁ
జటులతఁ బోకార్చి నరుఁడు సలుపఁగ వలయున్. ౬౬

అశోకవ్రతము

చ. అన విని కొంతిపెద్దకొడుకు కాదృతి పాదుకొనంగ నెమ్మదిన్
వనజదళాక్షు సూక్తితతిఁ బ్రస్తుతి సేసి యనున్ ముకుంద!
పావన మయి యెల్లసంపదలప్రాప్తికి సాధన మాచు
శోకమున్ మునుకొని దూరముం జలుపు పున్నెపునో
మొకఁ డానీతిఁగదే. ౬౭

క. అని వేఁడుకొన్న కృష్ణా
మనోరమణున కను నిట్టిమాడికిఁ గృష్ణం
డెన లేక యశోకాఖ్యం
దనరు మహావ్రత మొకండు దైవతనుతమై. ౬౮

వ. అయ్యది త్రిరాత్రదీక్ష నశేయ్యాఫలప్రదమై యొప్పు. ము
న్న యోధ్యానగరమ్మున వసిష్ఠుండు వైదేహి కియ్యదియ
కథాప్రస్తావమ్మున నుపదేశించె; నత్తెఱంగు నీ కెఱిం
గింతు నవహితమతి నాలింపుము. ౬౯

సీ. పది తేరులవలంతిపట్టపుదేవేరి
కడుపుమీఁదుగఁ గన్న కొడుకుమిన్న
కలనున మగఁటిమిఁ బొలియనేసి పడిత
లలపొలమేతరికొలము జేసిఁ

గూరుచు తనతమ్ములకుజ్జనితో నన్గ
పొలఁతితోఁ గ్రమ్మఱఁ బురము సేరి
పట్టాభిషిక్తుఁడై వసుమతి నేలెఁ బె
క్కేండ్లు ప్రజల కెల్ల నెల్ల యవుచు;
నొక్క తఱి సీతమ కొలమునొజ్జ ఘనత
పొగరిష్ఠు వసిష్ఠుఁ బెంపునఁ దనర్చ
నాదరమ్మున నడిగె నిట్లమ్మహాత్ము
నడుగుతమ్ములు కన్నుల కద్దుకొనుచు. ౨౦

మ. మునిముఖ్యా మును దండకాటవిని దుర్బుద్ధిం బులస్త్యా
న్వయమ్మున కంగారము రావణుండు ననుఁ గొంపోవుచున్న
యవ్వేల నిండినభీతిన్ ముకుళించుదృగ్జలజముల్ నే
విప్పానాలోన నాయనువాద మ్మెటుజాంగణమ్మునఁ
దయా రయ్యెన్ వెఱం గూర్చుచున్. ౨౧

క. మాయావి రావణుఁడు న
మ్మాయామహిజాతఁ గొంచు మాననిపోకం
బోయెన్ లంకాపురికి వి
హాయసమార్గమునఁ బడి భయంకరవృత్తిన్. ౨౨

తే. అట్లు రక్కసి తనుఁ గొని యరుగునపుడు
కడఁగి యాత్రొత్తసీత చెంగట నమరు న
శోకవిటపికి మ్రొక్కె; విశోక వౌదు,
తీఱు నితఁ డని యాశీర్వదించె నదియు. ౨౩

క. అది కని విని యున్కి౯ నె
మ్మదిఁ బొడలిన కౌతుకమ్ము మహితముగా న
య్యది మొదలుగఁ బొనరించితి
విదితాశోకవ్రతమ్ము పెక్కులుమా ర్లె౯. ౭౪

సీ. తత్ప్రభావమునన దాశరథులకు నా
పాటు నెఱిగించువఱకు నుసుఱు
దొఱఁగక పులుఁగులదొర పడియుండె న
త్తెఱఁగున; నాజాడయెఱుక గలిగె
సరగున సుగ్రీవుసఖ్యమ్ముతో శత
క్రతుసుతువధమును గలిసి వచ్చి;
కరువలికొమరుఁడు కాల్వనట్టులు శత
యోజనవిస్తీర్ణ ముదధి దాఁటి

సుమహితాశోకవనిలో నశోకవిటపి
మూలమున రాము జపియించు పుడమికూఁతు
సేమ మారసి లంకకుఁ జిచ్చు పెట్టి
యెత్తి వచ్చిన పొలదిండ్ల హేల నణిమె. ౭౫

ఉ. నమ్మినబంటు గంధవహనందనుతోరతతోడ నాయుదం
తమ్ము నెఱింగి రాఘవులు నంద్యగతి౯ వనరాశిఁ గట్టి క
య్యమ్మనఁ గాలు ద్రవ్వెడు బలాఢ్యులు క్రోఁతుల
తోడ ఘోరయుద్ధమ్మునఁ బుత్రమిత్రసహితమ్ముగఁ
గూల్చిరి పంక్తికంఠుని౯. ౭౬

వ. అయ్యెడ, ౭౭

క. అనిమిషులయానపైనిం
దనప్రాపున డాఁచికొన్న నన్నాతుచి రా
మున కొసఁగె వేయి నోళుల
జనకజ సంశుద్ధ యన్న చదలునొడులతోఁ. ౭౮

ఉ. అంత నిధాననాథునివిహాయసయానముపైని రామభూ
కాంతుఁ డయోధ్యకుఁ మగుడ గాదిలితమ్మునితోడఁ
గొంచు నఁ పంతము సెల్ల వచ్చి యిటు పట్టము గట్టుక
యేలుచున్నవాఁ డెంతయుఁ గన్నతండ్రియటు లెల్లజన
మ్ముల దైవతస్తుతా! ౭౯

క. మునిచంద్రమ! నాశ్రేయ
మ్మునకు జగత్క్షేమలాభమునకుఁ మూల
మ్మనుపమ మశోకసద్వ్రత
ఘనమహిమ మ్మింకఁ దెలియఁ గౌతుక మయ్యెఁ. ౮౦

వ. కావున గురుప్రవరా! మీ యొఱుంగని యర్థం బొకరుం
డున్నె! హృదయమ్మున దయ దయివాఱ నాకఁ తెలిం
గానతిం డని వేఁడిన నత్తబిసికొలమ్ము లేఁడును వేడుక
దళుకొత్త ధన్యుండ ననుచు నాజగన్మాత కిట్లని
నొడువం దొడంగె. ౮౧

పౌలోమి యశోకవ్రతముం జేయుట

క. ఓమంగళచరితా! విను
మా, మును మడియించి వృత్రు మఘవంతుఁడు సం
గ్రామమున, వెన్నవులు న
సామాన్యబ్రహ్మహత్య సమసినపేర్మిన్. ౭౨

క. కవిసికొను త్రిభాత్వమ్మున
దవిలిన విష్టపము పాలనమునకు దవ్వై
రవరవ నూడనిబాడె న
డవుల బిసములఁ దల దాఁచు లజ్జకు గుఱియై. ౭౩

వ. అంత, ౭౪

తే. పాడువడి చెడి పోలదింద్లవేడిచూడు
కులకుఁ గరగి నీ గ్గానున్న కులిశధరుని
పసిఁడిగద్దియ సహుపాష్యఁ బార్థివుఁ దోడి
తెచ్చి నిల్పి రేల్గడ గాఁగఁ ద్రిదశమునులు. ౭౫

తే. అతఁడుఁ ద్రైలోక్యరాజ్యమదాంధకార
మలముకొనుడుఁ గన్నుఁగవ గంతలను గట్టి
క్రింద మీఁదు నెఱుఁగక చరించె గురుము
కాఖిలర్షులు తనతొత్తు లన్న బుద్ధి. ౭౬

ఉ. అంతట వానిచొప్పు తనయాత్మకుఁ గంటక మాట
నెంతయోఁ జింతిలి జిష్ణుకూర్చునతి సేమము గా దిఁక

నాకవాసమర్ జింత రవంత యొడ్లచెవిఁ జేరఁగ నేరని
పోకఁ బోయె నా కాంతతపోభిలాషము త్వరం బొసఁ
గింప నాకంబు కానకుర్. ౮౭

చ. అట నియమించి బాహ్యముల నాంతరికమ్ముల నింద్రియ
మ్ములం దిటవును గొన్నరూాషి శచి తీవ్రతరమ్ము తప
మ్మొనర్ప నుతక్కటనియమమ్ము గై కొనియె గాలికి రాలిన
యా కలమ్ము యెక్కటి క్షుధ మాన్పనోగిరము గా; నెల
లా ర్చునుమీఁద నాదటర్. ౮౮

సీ. తనయనుంగుపినేయుఁ డనిమిషనాథుండు
బ్రహ్మహత్యకు నోడి పాటి చన్న
పదపడి తదమరావతి రోసి గహనగ
హానముల విరతి నెమ్మనము గోరఁ
గ్రుమ్మరుపనిఁ గొని ప్రొద్దుఁ బుచ్చు గురుండు
తలఁచిన విధిచొప్పుఁ దలఁగఁ బోక
చక్క నింద్రాణి యెసంగు నన్నెలవున
కేశ్వరి తత్పూజ లెలమిఁ గొనుచుఁ
బొదలుముదమున నను నిప్పగిదిఁ బులోమ
జాతనూజ! తనూలత చాయ దొఱఁగి
వాఁడిపో నీకుఁ బోలని వ్రతభరమ్ముఁ
బూని యిద్దాని నిం దుండఁ బొసఁగె నెద్ది? ౮౯

వ. డాఁపక యిపుడ తెలుపు మనుడు సునాసీరుఁడేవేఁ
శోకమ్మున నెక్కొలునఁ బొడము గాద్గద్యమ్మును నాఁకట్టు లెడ
లించుకొని కృతసశిరోభివందన యై గురున కిట్లనియె.

క. కృతమతి! హతద్విజుం డప
హృతవిభవుఁడు నష్టమతి సురేంద్రుండు పలా
యితుఁ డయ్యెంగద నాఁ, డే
గతి కయ్యెనొ యింతవట్టు గ్రమ్మరఁ డోలిన్. ౯౧

తే. ఎందు నున్నవాఁడొ యిపు డా శతక్రతు
వేదెసలఁ బడియెనొ యెట్టిదెసల?
నెలయుదాన నింక నెన్నఁ డా యమరేశుఁ
గలసి మెలసి సుగము లొలయు నియతి? ౯౨

వ. గురువరా! తఱుఁగక తిరమ్ము కరుణ కిరవవు మనంబున
నా కెఱింగించి తత్సమాగమోపాయమ్ము సెలవొసంగు
సుప్రసన్నతకుం గమ్మని దీనమ్ముగఁ బ్రార్థించు శచి
కాచార్యుం డిట్లనియె. ౯౩

క. వడి నడఁగుం గావుత సుత!
యడరినయెడరు, మది నుడుగు మాగోడు; తోడిం
బడి వృత్రద్విజహత్యం
బొడమిన దోసాన వేలుపులయొడయఁ డటుల్. ౯౪

తే. అతిభయంకరాకృతి వెంట నంటి పాఱి
పఱచు హత్యపేరిఁటిమారియుఁఅనిధాటి
కోడి చెడి పాడి యూడనిఁబాడి మాన
సముసరస్సున నొకఁడు బిసమ్మునందు, ౯౫

తే. డాఁగియున్నాఁడు; విడక తలమున నుండి
పెట్టినట్టిపీటన సందు వెదకు హత్య
కెపుడుఁ జూప నొల్లఁడు మొగ మించుకంత;
వాని యీనాఁటి చేడ్పాటు పలుకఁ దలమె? ౯౬

వ. అట్లయ్యును, ౯౭

క. కొనకొనునిరూఢి నీ కై
కొనిసఘనతపము మహిమ మకుంఠము గా న
య్యనిమిషవల్లభునఘమో
చనముతో నీతలఁపు లెల్ల సఫలత నొలయున్. ౯౮

వ. జపతపోయోగాదులకన్న మిన్నయై వేలుమడుంగు లనతి కాలమ్మునన యప్పటికప్పుడ భావుక సిద్ధిం గూర్చు విశేషాంశ మ్మొకరుఁ డే నెఱింగింతు, నాకర్ణింపుము. ౯౯

క. కామిని! నికామగరిమన్
కామినుల సమస్తకామనలఫలములు ను
ద్దామగతిఁ గూర్ప నోడని
శ్రీమహిత మ్మొకఁడు వ్రతము చె న్నలయించున్. ౧౦౦

క. మును వేఁడిన సావిత్రికిఁ
గనదంభోరుహాభవుండు ఘనము యశస్య
మ్మని నెక్కొనునక్కటికము
తనసామ్ముగఁ దెలియఁ బలికెఁ దవిలిన పేర్మిన్. ౧౦౧

క. అదియు నశోకముపేరిట
విదితమ్మై నియతిఁ జలుపు వెలఁదులశోక
మ్మున్ దొలఁచి కూరుచు శుభములు
సుదతి! శివ ప్రీతిదమ్ము సుమ్మది యెంతేన్. ౧౦౨

క. ఎల్ల గద యెల్లజగముల,
కల్ల శివావల్లభుం డనంతమహిమ మీా
సల్లలితవిటపిఁ బాయక
యెల్లపు డారచితసవిధ మేర్పడ వెలయున్. ౧౦౩

క. అన సుమహితములు పున్నా
గనాగచంపకవకులముఖమహిజములఁ గా
దని యేమి గని యశోక
మ్మున నిలిచెఁ బినాకపాణి మునుకొనుపేర్మిన్? ౧౦౪

వ. కూర్మిమెయి నా కానతీఁగదె యని వేఁడు నప్పూబోఁ
డికి నిలింపోపాధ్యాయుం డిటు లను. ౧౦౫

క. ఓలోలాలక! విను మతి
వేలమ్ము దయ వెలయించెఁ బృథివి భవానీ

లోలుఁడు లోకక్షేమము
మూలముగ నశోకమన్న పుణ్యవ్రతమున్. ౧౦౬

వ. దానంజేసి యియ్యాది శివవల్లభతామూలమ్మైన ముల్లోక
మ్ములఁ బొగడుం గాంచె; నింక నేతద్వ్రతవిధాన మ్మాల
కింపుము. ౧౦౭

క. పూను నశోకవ్రతదీ
క్షానియతి నెలర్చునెలఁత సాదము గొనకే
మూనా ళ్ళశోకతరుమూ
లాన జగన్మాలు శూలి లలిఁ గొలువఁ దగున్. ౧౦౮

తే. నారికేలమ్ము లొండె, ఖర్జూరఫలము
లొండె, ద్రాక్షపం డ్లొండెఁ, గొం చొకట నూట
యెనిమిది ప్రదక్షిణములు బాయనినిరూఢిఁ
జల్పునప్పొత్తి గొను శుభ మల్ప మొకొ? ౧౦౯

తే. లోకశోకాపనోదనోల్లోల! శూలి
వల్లభ! యశోక! కొని నాసపర్య లుక్త
ఫలము సమకూర్చుకృపకు నై వెలయు మన్న
యదియె తత్పరిక్రమమంత్ర మవును సాధ్వి! ౧౧౦

క. ఇమ్మెయి మూఁడవునాఁడు తి
రమ్మెవు నియతిఁ దెలనాలకాతుఁ గొలిచి య

య్యేమ్మనన వంశపాత్రవ
రమ్ములు సమకూర్ప నపు స్థిరఫలాప్తికి నై. ౧౧౧

క. శౌరి నీసరణి నశోక
త్రిరాత్రమహితవ్రతమ్ము దీరుచు చెలి వ
త్సరములు నూఱులు నిండం
బరఁగుఁ బసుపుకుంకుమముల బహుపుత్త్రికులన్. ౧౧౨

క. అను గురునిపలుకుబడి నె
క్కొనినమహాదృతిఁ బులోమకూఁతురు స్వాచా
ర్యుని నాచార్యునిఁ గాఁ గొని
యొనరిచెఁ దదశోకమువ్రత ముక్తమువిధిమై. ౧౧౩

తే. తత్ప్రభావమ్మునం జేసి త్వాష్ట్రిహత్య
వీఁపుకుం గబు రంది వేవేగఁ జెప్పి
కొనఁగఁ గాళులకుం బుద్ధి యనిమిషపతి
మానసము నిండఁ గెలసాన మానసమ్ము, ౧౧౪

వ. పాసి పులు గడిగిన ముత్తియమ్మై మెఱయుచు బిరబిర
నమరావతిం జేరి త్రైలోక్యరాజ్యరమాపరిష్వంగమ్మున
నున్మత్తుండవుచు శచీద్వితీయుండై కిన్నరగరుడోరగాదుల
కైవారమ్ములు గొనుచు నతిశయిల్లె; నటు లవుటం జేసి,

తే. రామునర్ధాంగి! విష్టపస్తోమకుశల
కారణమ్మగ నాఁడ నీ కైకొనిన య

శోకసద్వ్రతవిభవమ్ముఁ జొప్పు మా కొ
లందులనోడుల కందుకొలంది యొకొ౯! ౧౧౬

క. హారుఁ డంభోరుహసూతియు
హరి తా రరసి యరసి వ్రత మటు కూరిచి; రు
ర్వర నీకూరిమిఁ దఱుఁగని
గరిమఁ బ్రవర్తితమ యయ్యె ఘో న్మసుత! యదియుఁ౯.

క. చేకురె శుభోదయము నే
నీకద్దాని నొడువ నవు నెఱి సార్థక తా
శ్రీకలితుఁడ నని యమ్ముని
లోకవిభుఁడు వడసెఁ గొల్లలుగ నాపెనతుల్. ౧౧౭

వ. అని వెండియుఁ బుండరీకనయనుండు పాండుతనయాగ్రణి
కశోకత్రిరాత్రవ్రత విధానాదిక మి ట్లని వినిపింపం
గడంగె. ౧౧౯

అశోకత్రిరాత్రవ్రతవిధానము

క. శోకాపహ మ్మశోకా
నోకహమున దేవతాచయమ్మ సమస్త
మ్మోకాల మెడయ కడరెడు,
నాకులు కొమ్మలును శివమయమ్ములు సుమ్మా. ౧౨౦

క. లోకనికాయమ్మునకుఁ౯
సోఁకిన పొలదిండ్ల యెడరు సురియించిన మ

ర్యాకృతి సీతామహాల
క్ష్మీకాంతు నశోకముదరి సేవింప నగుర్.  ౧౨౧

క. ఆమేలిమూర్తమునఁ జను
సౌమిత్రిని భరతు శత్రుశమను ననిలజున్
భూమిజఁ దత్తన్మంత్ర
స్తోమమ్మున వేఱువేఱ సారిదిం గొలువన్.  ౧౨౨

క. వితతాశోకార్చనమున
న తదాశ్రితదేవతాగణమునర్చనముం
గృత మయి సమకూరుచుఁ గా
మితము లమితశుభఫలాప్తిమెయిఁ గాంతేయా!  ౧౨౩

సీ. రావణామయనివారణ! లోకరక్షణ!
రామభద్ర! యిదె యర్ఘ్యమ్ము నీకు;
నగ్రజపదసేవనాప్రమత్త! సులక్ష
ణా! లక్ష్మణా! యర్ఘ్య మందుకొనుము;
విమలకృపారసస్మిత! జనకసుతా!
సీత! యర్ఘ్యము గొను ప్రీతి కగుము;
చిత్కలా! దరకరశ్రీకలామల! రమ!
యర్పింతుఁ గైకొను మర్ఘ్య మిపుడె;
యనుచు వేత్వేఱ దేవతాగణముఁ దమ్మి
చూలి శూలి మేల్గటురాచూలి నాపె

యీరాడుబిడ్డ నాయమయన్గనత్త నాపె
మగని నమ్మ్యానిదరిఁ గొల్వ నగును బత్తి. ౧౨౪

క. ఈవిధి నీవిధిఁ దొలఁగని
భావమ్మెసలార వరము వ్రత మిద్దానిం
గావించు వా రశోకుల
మై విలసిలువార లిరవులై యనమునకుఁ. ౧౨౫

క. విను మిటు కుంతీనందన!
మును తుహినమహీధరేంద్రుపుత్త్రి వగచి తా
ననపత్యతకు నశోక
మ్మును గొడుకుగఁ గల్పనమ్ము పొసరిచి పొసరఁ, ౧౨౬

తే. జాతకర్మాదు లెల్లసంస్కారములును
వ్రాని కద్దానికిం దీర్చు రాణ మెఱసెఁ;
బరఁగ నద్దాని సేవించువారు నాకు
నెలమిఁ గూరుచువా రన్న పలుకుబడిని. ౧౨౭

వ. అయ్యది నేఁడును మందరగిరిపయిం దనరారుచున్నయది.

క. మఱియు నశోకమహీజ
మ్మెఱిమిఱి సమకూర్చుకొలఁది కందని యర్థ
మ్మెఱుఁగ నొకఁ డున్న దనున
త్తెఱంగు; విశ్వాత్మకమ్ము దివ్య మ్మది సూ. ౧౨౮

ఆ. అట్లు పూజ సేసి యయ్యశోకము విప్ర
వరుల కొసఁగ నొ నుపాయనమ్ము
నెసఁగునార్థ నాలకించి తత్కథఁ జల్పఁ
దపుఁ గొలఁదిమెయి ద్విజతర్పణమ్ము. ౧౩౦

వ. భావుకా! మును మునుకొనినతమి మనుష్యదేవగంధర్వా
దులు, ననసూయయు, నరుంధతియు, దేవకియు, సీతమయు,
ద్రోవదియు, సత్యయు, దమయంతియు, సావిత్రియు,
మున్నగు పూజ్యగాం డ్రెల్ల రిద్దాని నాచరించి యంతటి
ప్రశస్తిం గొన నేరిచి; రవారిపూజావిధి నొకింత వచింతు
నవహితమతి నాకర్ణింపుము. ౧౩౧

సీ. పొనరిచి రిమ్మ్ములు పొనరార రజతమ్ము
చే నశోకమ్ముఁ, బసిండిని గొని
శివు శివావల్లభు, సవ రొప్ప భూమిజా
సౌమిత్రిసహితు శ్రీరామచంద్రు;
నలిఁ దీర్చి రావాహనధ్యానసింహాస
నార్ఘ్యపాద్యాదిసమర్పణమ్ము;
పూజించి రంచితంబులు మంత్రములు చదు
వుచు నవనవములు పువులతోడ;

నారగింపు లొసంగి రిం పార భక్ష్య
చోష్య లేహ్య ప్రపూర్ణమ్ము సురుచిరాన్న

మెల్ల మధురఫలములు; గావించి రు క్త
విధిఁ బ్రదక్షిణము లొగి నెన్మిదియు నూఱు. ౧౩౨

తే. అలర గీతవాదిత్రనృత్యాదికమ్ము
లా యశోకమ్ము నఖిలదేవాశ్రయమ్ము
నిమ్ముకొనుబత్తిపేర్మిఁ గీర్తించి మించి
రప్పు డవ్వారు భువనవంద్యప్రశస్తి. ౧౩౩

వ. కావున భావుకా, ౧౩౪

క. ముల్లోకమ్ములలో విల
సిల్లెడు నెల్లరకు నిష్టసిద్ధులు గూర్పం
జెల్లు నిజ మ్మొకరుఁడ యీ
సల్లలితము వ్రతము నాఁగ సందియ మొకో-! ౧౩౫

వ. అది యటు లుండె, నాశ్వీనమాసనిషేవ్య మ్మపు
మఱొండు విశేష మ్మెఱిఁగింతు, వినుము. ౧౩౬

కోజాగరవ్రతము

సీ. పొదలునాదృతి నిషపూర్ణిమఁ జలుప నోఁ
గోజాగర మ్మన్న కూర్పువ్రతము;
నానాఁటిప్రొద్దున నమరు పదా ఉప
చారమ్ములం గల్మిసకియఁ గొలిచి,
వరుస నైరావణవాహుండు మున్నుగ
నెల్ల దిక్పతులఁ బూజించి విరుల

మలయు వేడుక గంధమాల్యోపహారమ్ము
లలర భూత్రిదశులయర్చఁ జేసి;
నారికేలోదకమ యశనమ్ము గాఁగఁ
గొని తనరు నడ్డసాళ్ళులకూర్చునాట
నాముకొనినకుతూహల మోముకొనఁగఁ
జలుప నవు నిశీథముదాఁక జాగరణము. ౧౩౭

తే. మానసము వొంగ వెన్నెలజేనిపండు
వెన్నెలలలోన యునిచి పా లన్నెటె నిర
వొందువ్రతము నాసక్తి పెంపొందఁ గొలువ
వలయు నానాఁడు కలుషములకలువకంటి. ౧౩౮

క. "కో జాగర్తి నిశీథే
భ్రాజద్ర్వతకృతమతి ర్వరాక్ దాస్యేఽహం
త్వే జత్కృపయా తస్మై"
నా జగదంబ హరిపత్ని నను చుప్రతిన సూ. ౧౩౯

వ. అద్దానం జేసియ యిప్పవిత్రవ్రతంబు కోజాగరాఖ్యం
బ్రవర్తిల్లె. దుల్లనినియతి నిద్దాని నాచరించునంచితులవైభ
వం బింతింత యని వివరింప నిలింపులకే నలవి గా; దిం
దొకట పురాణకథానక మ్మలరు; నయ్యది యెయ్యది
యంతేని, ౧౪౦

లలితోపాఖ్యానము

తే. కలఁడు మాగధవిషయాన వలితలలిత
శుభగుణమణీపరిష్కృతిశోభనుండు
లలితసాహ్వయుఁ డిలవేల్పుకొలముతేఁడు,
వానిసొమ్మెల్ల విద్దెలు వ్రతముఖములు. ౧౪౧

ఆ. నెత్తినేలల కయి నెగడునిప్పచ్చర
మునన స్రుగ్గి మ్రగ్గి దినము లటులె
కడపుఁ గాని యొడ్ల నడుగఁడు చెయి సాఁచి
దొరకుదానఁ దృప్తి దొరయు నతఁడు. ౧౪౨

తే. వానియిల్లాలు కోపస్వభావురాలు,
చిట్టుబుట్టాడు నొకపాటిసేఁతకైన,
సోఁకనీ దెప్డు ముల్లొకసుంత పయినిఁ,
గలహమున కంకకత్తె యై కాలు ద్రవ్వు. ౧౪౩

తే. కంటె? నాయప్పసెల్లెండ్రు కనకవసన
భూషణాంచితలై వేల్పుపూవుబోంట్లు
లెక్కసేయ; రెక్కరణి నాదిక్కు సెడిమోఁ
బ్రాఁతి సని యాపె పతిఁ గటికోఁత వెట్టు. ౧౪౪

వ. ఒక్కనాఁ డక్కలహకారిణి చండి ప్రయతత యతులితగ
జపపరాయణతఁ దనరారు కూరుచుపతిం దఱిసి దరు

లోరసికొనుకినుకఁ గనుమినుగనక యిమ్మాదిరి పదరం
దొరంకొనె. ౧౪౫

సీ. నాపాలిపాపపుందారిద్ర్యదేవతా!
తలఁపవు నీ వింటఁ గలిమి లేమి,
కడఁగుదు రేపాడి తొడరుబకధ్యాన
మునకు నెక్కటి నిటు ముక్కు మూసి,
చుట్టి పెట్టెం బగఁ బట్టి కట్టడిదిష్ట
మీఁదెస దెస లెల్ల నాదునఱుతఁ,
గాల్పనే చదువు వంగడము రూపమ్ము నా
యుస్సు నిర్భాగ్యదామోదరునకు?

నిరుగుపొరుగుల కెందునే నీడు రాక
యశ్రుధారలు పయ్యెద నద్దుకొనుచుఁ
జచ్చి చావక కాలమ్ము పుచ్చికొనెదు
దుర్గతికి నైతి నీకొన్నతొయ్యలి నయి. ౧౪౬

తే. ముల్లెఁ గట్టుక పుట్టిరే యెల్లవారు?
లేరు ధారణి నెందఱు లేనివార?
లూరకుండురె మందులై యొక్క కాసు
కిప్పెర గడింప కిట్టులు కడుపుకొఱకు? ౧౪౭

తే. చేరి కూర్కొని కూర్కొని చెవుల కెక్కఁ
బోరు వెట్టి చెప్పిన నెంతప్రొద్దు సుంత

వినవు పాషాణబుద్ధివి, కొనఁగ లేవు
దుష్టు మరగి దొంగతనంబొ దొరతనంబొ? ౧౪౮

క. అను ధూర్త కూర్చుతనయం
గనత్ప్రల్లదనమ్ము ఓుమ తగఁ విని లలితుం
డును గొన్న మౌనముద్రం
దనవిధి సాగించెఁ గిమ్మనక యవికలుఁడై. ౧౪౯

ఉ. దానికి నెంతయేఁ గినిసి దానవి కీడయి చండి మండుచుం
బూనినపూనిక ములుకు లనఁ బోలు దురుక్తుల మర్మ
భేదనం బానెజేఁ జల్లుచుం దగవు నారయ కాతటి
మోఁదె గేదెన ట్లానమితో త్తమాంగుఁ బతి నందినదుష్ట
కుమర్పడం జెయిక. ౧౫౦

క. పలుకఁడు పొడమిన సంతం
తలు మా ఱెది సేయఁ జనఁడు దైవముగతి యీ
లలిఁ గుదిరెఁ, గాక తీరదు
వలసినపని యనుమనీషఁ బొఱుఁ డతండుక. ౧౫౧

వ. అది మొదలుగ యాచ్ఞాదుఃఖభీరుత్వమ్ము మదిఁ గుదురు
కొన సదమద మ్మవు నయ్యవనినిలింపప్రకాండు నాచండి
యొక్క లెక్కకుం గొనక యునికిపట్టునం దనపట్టినదె
పట్టుగఁ బ్రవర్తించుచు నొకప్డు దేద్చుచు నింకొకతటి
నఱచుచు మఱొక యదనునఁ బ్రాఁతపాత్రమ్ము లటు

నిటు నైచి పగులంజేయుచుఁ గుడిచియుఁ గుడువకయు
నింకఁ బలుతెఱంగులఁ దనయిచ్చ మెయి నడరుచు నతం
డీఁదాఁ డన్నం గోఁదాఁ డనుచు రెట్టమతమ్ము తనసొమ్ముగ
లలితునకుం దలగొఱవియు బొమ్మలకుంపటియు నై
ప్రత్యక్షరాక్షసియో యనఁ దనరారుచు నుండె; నొక్క-
నాఁడు, ౧౫౨

తే. అననుకూలాద్వితీయుండు తనకుఁ బ్రాణ
గొడ్డముగఁ బ్రాప్తము యయిన కూర్పుతండ్రి
శ్రాద్ధ మయ్యెడి తీరు నేచాయ నంత
రాయహతి జెడక యను దురంతచింత, ౧౫౩

తే. మునిఁగి దరి దాపు గానక మూరుకొన్న
వగ నగ మ్మెవ్వఁ డయ్యవసరమంద
పనుప దైవ మేత్తేరిన యనుఁగునేస్తి
గణపతికి లలితుం డనుఁ దనదుకస్తి. ౧౫౪

లలితుఁడు హితునితోఁ జండినడఁతను జెప్పి వగచుట

క. చెలికాఁడా! వింటివ నా
పొలఁతుక చండికగొనమ్మ, పోల మి ల్లను ని
ల్లల పోల మను, నే మందుం
దలక్రిందం గొఱవి యద్ది నా కెవ్వేళన్. ౧౫౫

ఆ. ఇచ్చ వచ్చినట్టు లెచ్చినమచ్చర
మెదఁ గుదురుపడం జరించు నింట,
మెదపనీను నోరు; పదరు న న్నుఱక, ఆ
చండికతనఁ గట్టె గుండె గూడు. ౧౫౬

తే. రేపకడఁ దీర్పఁగావలె నాపితరుని
శ్రాద్ధకర్మ, మద్దానిపై ర్దడవుకొనఁగ
వలనుపడదు, సంభృతము సంభార మెల్లఁ
జెడిపె యాపె యేమంటిపా ల్సేయునదియొ! ౧౫౭

తే. కలసి వచ్చె నాదుర్దిన మలఘుయశుఁడు
జన్మదునితద్దినమ్ము నీజాడ నేఁడు;
సదయ! యుక్తిద్యుతిం బాపఁగదవె నా వి
పచ్చయాంధ్యంబు మిత్రత్వ మచ్చుపడఁగ. ౧౫౮

క. అనుచుఁ దా వగ నెక్కొ ల్దల
మునుకలుగాఁ బలుకులలితుఁ బుణ్యచరితుఁ గ
న్గొని సునిశితమతి గణపతి
యను సౌహార్దంబు వలను ననువుం జూపన్. ౧౫౯

క. లలితా! యమోఘభావుక
కలనాకలితా! లభింపఁ గలదొక్కొ సతీ
తిలక మ్మిట్టిది యెంతలు
సలిపినఁ బున్నెములు? నీక సమకురె నియతిన్. ౧౬౦

క. ఎఱుఁగవు వైదికవర్త్యుఁడ
వఱచేతక్ మెఱయుమణిద యవు నుపయోగ
మ్మఱిమిటిఁ గొన నవు వెరవుం,
గుఱి యవు దెవ్వేల నిట్టి గోడులక సఖా! ౧౬౧

తే. తలఁప విపరీతకారిణి తలిరుఁబోఁడి
వలఁతి విపరీతభాషణములన లోఁ గొ
నుట గడుంగడు లెస్స వే నుడు లిఁకేల
మోసగానికిఁ దవు మందు మోస మదియ. ౧౬౨

క. కావున నావిలతకు నిఁకఁ
దావల మొనరింపఁ బో కెద, వలయుపని నెం
తే విపరీత మనిష్టము
నావహిలం బలుకు, మడరు మట్టిదనడకుక్. ౧౬౩

తే. అంతఁ దల వైచికొని తాన యూపనిబరు
వంత యింతింత యనరాని పంతమునన
తీర్పు తీర్పడఁ దీర్చు, నందెదు సుగమ్ము
కడుపుచల్ల గదలక రాకొడుకువోలె. ౧౬౪

వ. అని బోధించిన, ౧౬౫

క. అవు నది లెస్స యటం చ
య్యవనిసురాన్వయసుధాంశుఁ డానాఁటి రెయిక్

మివులు నెఱిఁ గొన్నయన్నెఱి
తవులఁ గొనం గర్జ మెంచి తనవనిత కనుఁ౯.    ౧౬౬

సీ. వెలఁదుక! వింటివే, కులపాంసనుఁడు నాదు
తండ్రితద్దిన మెల్లి తఱిసి వచ్చె;
నామెడ నున్న బంధమ్మొ కా యది; యూర
కుండు, నేలా యీ బెడంద నాకు?
వెచ్చించి యొక కాని వెచ్చముల్ గొని వచ్చు
పని పేరె తడవ నెప్పాట నేని;
దూరులు నిజకులాచారమ్ములకుఁ బాఱు,
లవువారె వారు శ్రాద్ధాన్నభోక్త?
లే నిమంత్రణ మొనరుప నిట్టివారి;
మాలలో మాదిగలొ యెట్టి కూళలొ యరు
దెంచి భుజియించువాఁ రిఁక నేల వేలు?
కాదు నాఁ జూడఁ జా నీమొగమ్మ యేని.    ౧౬౭

క. అనవుడు నెచ్చినయచ్చల
మున భాలూకమ్ము పట్టుఁ మొనయఁగ నయ్యం
గన తోఁక త్రొక్కి న భుజం
గి నెఱి౯ నెఱయించుమాడికి కయి యను నిటుల్. ౧౬౮

సీ. మతి సెడి యయితివో మల్లామడి జడుఁడ!
పలుక నిట్టులు నాల్క వచ్చె నెటులు?

పాలఁ బోలిన మేలిబ్రహ్మవంశమ్మునఁ
బుట్టవో, నాచెయిఁ బట్టుకొనవొ?
కడగండ్లు సహియించి కడుపుమీఁదుగఁ గాంచి
పెంచి పెద్దలను గావించినట్టి
పితరులకుం బత్తి తిరముగ నిన్ని తి
లోదకమ్ము లొసంగునొప్పు దప్పి

కుడువఁ బాల్పడు దే యిట్టికూడుఁ? జూడు
మోప నీపని, యది యెల్ల నోపిక మెయి
నేన తీరుచుదాన; నం దేనిఁ గా ద
టంచుఁ బుడమి లే నని మది నెంచుకొనుము. ౧౬౯

సీ. అనుచుఁ బట్టినపట్టు వెనుకాడనీక తాఁ
గోడికూఁతలజాడ వీడి లేచి,
యల యిలు వాఁకిలి యలికి ముగ్గులు వెట్టి,
భాండముల్ శుద్ధితోఁ బదిలపఱిచి,
వలయుసంభారంబు వడివడి సమకూర్చి,
తిలదర్భదలముఖ్యముల నమర్చి,
యమలవిప్రుల బ్రాహ్మణార్థమ యర్థించి,
కూర్చుజ్ఞాతుల విందుఁ గుడువఁ బిలిచి,

భక్ష్యచోష్యలేహ్యాపరమాన్నసంపన్న
సురుచిరకలమాన్నసూపశాక
పాకములను వండి వడ్డించి పెట్టించె
శ్రాద్ధ మపుడు చండి శాస్త్రవిధిని. ౧౭౦

క. లలితుండును నాలోఁ దన
పొలఁతుక వెంగలితనమ్ము పొరయికకు విధిం
దొలఁగని పైతృకపూర్తికి
నొలయుచు నరుసమ్ము మఱచె యుగ్మలి తెఱఁగుల్. ౧౭౧

ఆ. వైదికుండు వాఁడు వారక క్రమ్మిన
బుద్ధిమాంద్య మన్న పొరల మునుఁగఁ
బాఱి, గంగనీటఁ బడవైచి రమ్మ యీ
పారణమ్ము లంచుఁ బలుకు పలుకు, ౧౭౨

చండి పిండములను మునుఁగునీటం బాఱవైచుట

ఆ. వినియు వినమి నిరతవిపరీతకారిణి
చండి, యిట్టు లేజడుండు నోడి వెఁ?
గుడువ నిడుదె కుక్కలకుం బురోడాశమ్ము?
జడుఁడ! నీక చెల్లుఁ జాయ లివ్వి. ౧౭౩

ఆ. అనుచు వాత వచ్చినట్టివే నుడులుగాఁ
బదరి పదరి యుఱక పారణమ్ముఁ
జక్కఁ బాఱవైచెఁ గుక్కలుం బందులు
దొరలు మునుఁగునీట దొసఁగు నాక. ౧౭౪

క. అది గని యొదవినకలఁకల్
సదమదమై గుండె లవిసి ఛాందసుఁ డాతం

డు. దనపురాకృతపాపం
బుఁ దూఱుచుఁ గడు నిలు రోసి పొదలినకినుకన్. ౧౭౫

ఆ. కూడు నీరు మాని "చూడికి కగ్గమై
కలిమికలికి మించుకరుణ నించు
నాఁడ కుడుతు" నంచు నాడినపాడియే
ప్రతిన గాఁగ నేగె వనులఁ బట్టి. ౧౭౬

లలితుఁడు విరక్తుఁడై వనులఁ గ్రుమ్మరుట

సీ. మహిసురుఁ డాతఁ డారహిఁకి నై హరు వతి
గహనగహనములఁ గడఁగి యొంటిఁ
గ్రుమ్మరి క్రుమ్మరి కువలయాలయమ్మృదు
పదదర్శనస్పృహ గుదురుకొనఁగ
నొకకొంతకాల, మొండొకమాని దవు నీడ
మనికిపట్టుగఁ బీట పొనరఁ బెట్టి,
శయ్యగా నుపలమ్ము శ్వసన మశనముగా
నలి నిరుపమ లవు నాళ్ళ గడపె;

నంతఁ దఱిసె సువికచాంబురుహరజస్సు
రభిలవిమలకమలరాజితకమ
లాకరమ్ము శ్రీమహామహాప్రక్రియా
రంభపూత మా శరత్సమయము. ౧౭౭

వ. అందుఁ, బ్రాప్త మ్మాసపూర్ణిమాపర్వమ్మున, ౧౭౮

తే. కాళియవ్యాళరాట్కులవశాళి మూల
ముగ నెసంగువంగడమునం బుట్టు గన్న
కన్నియలు ముప్ప రవ్వని నున్నవారు
రహిఁ మొదలిడిరి కోజాగరవ్రతమ్ము. ౧౭౯

నాగకన్యలు కోజాగరవ్రత మాచరించుట

క. మొగకొన్నయన్నవ్రత
మగణితమహిమాఢ్యతాసమాప్తి సమాప్తిం
దగునెటి నెఱయింపఁగ న
మ్మొగుదలు ముగు రెదలఁ, బొదలి పొదివినపేర్మిన్.

సీ. వెన్నెలదొరవన్నె మిన్నంటు భవనమ్ముఁ
దగఁ బొనర్చిరి సుధాధవళితమ్ముఁ,
బొనర దిద్దిన పిండిబ్రముగ్గుపూదీవల
మలక లేర్పఱిచిరి మండలమ్ము,
లెలయ కేవంక వంక లలంకరించి ర
నంటులతో నొండు మంటపమ్ము,
ప్రయతలై ద్వివిధమ్ము పారిశుద్ధ్య మెలర్ప
నై తాల్చి రమలభూషాంబరములు,
గొలిచి రెలమిఁ గలిమికలికి ధ్యానించి యా
వాహనాసనార్ఘ్యపాద్యసమభి
షేకవసనచందనాకలితవిభూష
ణార్పణముల విరుల నలరు పూజ. ౧౮౧

క. ఆపయి నాపరు వెడలక
నోపమసద్భక్తిమయిఁ బయోజాలయకుఁ
ధూపము దీపము రుచిరా
పూపమ్ము నివేదనమ్ము పోరి నొసఁగి రచో. ౧౮౨

ఆ. నెమ్మిఁ ద్రిఃపరిక్రమ మ్మమర నపచా
రక్షమమ్ము వేఁడి రాణ నెగడి
యలరుఁబోఁడు లలరి యాడిరి పాడి ర
ప్డాడలియెఱుక మఱుఁగుపడునిరూఢి. ౧౮౩

క. ఆమహితము నేమమ్మున
యామినిలో మొట్టమొదటి యామము సనె న
ప్డామెయి మొగకొని రటు క
న్యామణు లుత్కృష్టకేలి కతికుతుకితలై. ౧౮౪

తే. మూవు రాపూవుఁబోఁడులు పొదలఁ దములు
వారయుఁ బోమి నాలవుచేయి దొరయ నోపు
నెటులు పూరితి సద్వ్రత మివ్వ్రత మను
చింత నద్దానికై యరసిరి కరంబు. ౧౮౫

మ. అటు లింతింతలు సేసికొంచు నెఱి నేత్రాంభోజపత్రంబు
లాదట దిగ్వీథులఁ బ్రాఁకు నాగలతికాతన్వంగు లాభంగి
నొకట నీక్షించిరి మోద మీదృశ మనంగారానిదై

నెక్కొనఁగ స్ఫుటశోభాకమనీయకాయు బుధపూజ్యుం
బాయు నవ్వానిని. ౧౮౬

క. అంతం బ్రహసితవదనలు
కాంతాతిలకమ్ము లొక్కగంతునన సమా
క్రాంతసుగుణకలితు లలితుఁ
బంతమునఁ దఱిసి పలికిరి పలు కెలయ నిటుల్. ౧౮౭

ఉ. ఓమహితాత్మ! వందనము లోరిమిఁ గైకొనుమయ్య,
దివ్యవర్చోమహనీయ మాననసరోజము మీమహిమమ్ము
నింతయే నేమఱఁబోక వీఁకఁ బ్రకటించి రహించుటఁ
గొన్న కౌతుక మ్మ్యానుకొనంగ నంగనల మొక్కడు
వేఁడెద మానతీఁగదే. ౧౮౮

తే. పుణ్యమూర్తులు మీనామము యదమోఘ
వర్ణముల వర్ణిత మ్మవు వర్ణ మెనసె?
నిమ్ముకొను మీపదాబ్జరజమ్ము దాల్చి
హెచ్చె నేప్రాంత? మెందుండి యెటకుఁ బోక? ౧౮౯

తే. అనఘ! కన్నియులము, కాలియాహియన్వ
యమ్మువారల, ముందు మియ్యటవి నతముఁ,
గడఁగితిమి నేఁడు సిరిమించుకరుణ నెంచి
యాచరింపఁ గోజాగర మన్న నోము. ౧౯౦

చ. పృథునయసన్నుతా! వ్రతమమోఘఫలప్రదమౌ నెఱఁగన్
సమాప్తి మెఱయ మేము మూవురము వేడుక నాడిన
యక్షకేలికిం గమక మొనర్చి యిట్లు నెఱిగల్గు తురీయుని
కోస మాసమ్మైఁ గ్రమముగ దిక్కు లెల్ల వెదకం దల
కొంటిమి, కంటి మీడ నిన్. ౧౯౧

దే. నెమ్మి దయసేయు మిం కిట, నిఖిలసుజన
వినుత! ద్యూతకేలీపరాయణత కగుము,
పడయుము కడఁగి సిరితోడిఁబడనికూర్మి,
పేర్మి ముల్లోకముల మేలి పేరు గొనుము. ౧౯౨

క. అని పెనఁగొనువినయమ్మున
ననుచుపలుకుబడిని వినుచు నలినాస్యలదా
ననువును జనవుచు వలనుం
గనుఁగొని మది ముదము భ్రమము గదుర లలితుఁడున్,

క. అను నిట్లనుచున్ బాలా
మణులారా! మిమ్ముఁ బోలు మాన్యలచెవి సోఁ
కన రానిద నాకద, విన
మొనకొంటిర కాన వినుఁడు మొగి వినిపింతున్. ౧౯౪

తే. వఱలుమాగధవిషయమ్మువాఁడ, బ్రాహ్మ
ణుండ, లలితుఁడం బేర, ననుంగునొజ్జ

పేర్మిఁ బాయని కూర్మిమై వేదములను
సాంగములు గాఁగ నేరుచుననువు గొనితి. ౧౯౫

క. కొలమున్ శీలముఁ బరువము
వలనుం దిలకించి కన్నవారలు కూర్మిల్
సెలఁగం గూర్చిన నాచెలి
పొలుపె పొలుపు, దాని కొడ్లు పురుడులె జగతిన్! ౧౯౬

తే. చంక దుడ్డొకఁ డిడుకొని శంకఁ బాసి
డీ యనుం జండి పే ర్దగ వాయిఁ దెఱవ,
గ్రచ్చుపొద దానితగులమ్ము గ్రన్నన వద
లించుకొని బయల్పడుమాట లేనిబాట. ౧౯౭

తే. మాట లేటికి వేయి కైలాటకమ్ము
కాదు, నమ్ముఁడీ మది నిది, కన్నెమిన్న
లార! పెద్దమ్మకుం గావలసిన మనికి
నాతలం గట్టె బొప్పె లానాతికతన. ౧౯౮

తే. కసరి ముఱుఁగుసీటన పడ విసరి పదరి
గొనుచు నాతండ్రిశ్రాద్ధము గుంటఁ బెట్టె
నినుపగజ్జెలతల్లి యచ్చెనఁటిపీడఁ
గడవ గడియింప నొడమె నే వెడలితి నిటు. ౧౯౯

తే. అనుఁగుజెలికాఁడు గణపతి యన్నయట్లు
భాగ్యశాలిన నిజము తద్భర్త నవుట

సిందిరాభ్యుదుపాదారవిందములు భ
జించు నంచితల్ మి మ్మిట్లు కాంచఁ గంటి. ౨౦౦

క. అది యటు లుండెం జెప్పుఁడా
ముదితాత్మకులార! సిరులఁ బొందెను ద్యూత
మ్ముఁ దనర నాడుమ యనితిరి
కద, యది యెటు పొసఁగ నేర్చు గర్హ్యము దానన్?

క. ద్యూతము సర్వానర్థ
స్ఫీతము ధర్మద్రుమనిశితవితతకుఠారా
ఘాతము సుఘోరపాప
వ్రాతపరీతమ్ము భాగ్యపటువాతమ్మున్. ౨౦౨

చ. అని వనజాసనాన్వయసుధాంశుఁ డతం డటు పల్కఁ
బలుకులన్, విని నగ వాననాబ్జముల వింతబెడంగులతోడఁ
దోఁపఁగా నని రిటు లంచుఁ బండితునియట్టుల యెట్టెటు
వల్లెవెట్టు దీవును, బనులం దఱుంగువడఁ బో వెటులేఁ
గొఱగానివానికిన్! ౨౦౩

తే. మేలు నీజాలు, లలిత నాఁ గీలుకొన్న
యాహ్వాయ మ్మది చాటదో యాడుపోఁడు
ముల, నెఱుంగవు ధర్మువు, నలఘుగరిమ
మొం డనక దొరంకొను మింక ద్యూతకృతికి. ౨౦౪

క. అమలతరం మీషమాసవ
రము సర్వానర్థహరము ప్రథితతరమ్మం
గమలాప్రీతింకర మా
సమయముపర్వమున ద్యూతసక్తాదరముఁ గ్. ౨౦౫

తే. వేయు నేటికి? మముఁ గూడి, విప్రవర్య!
జూదమున డిగు మాపయిఁ జూచుకొమ్ము
నెమ్మిఁ గలుములకొమ్మ మేల్నె నరుతీరు
విభవమున నింద్రుఁ గ్రేణించు వెర వెరయుము. ౨౦౬

క. అను నప్పొలఁతులపలుకుల
మనమున నలరారుచుఁ గ్ రమాకలితకటా
క్షనితాంతార్థి యఃతం డ
ర్థిని నీకొనెజూదమునకుఁ దేఁకువ పొమవ గ్. ౨౦౭

తే. వారు వారనిపేరిమి వానిఁ దోడి
తెచ్చి నిజమందిరమునకు నిచ్చ హెచ్చి
యిచ్చి నారికేలోదక మెలమిఁ గ్రోల
నాడఁ గడఁగిరి పాచికల్ ప్రోడ లవుచు. ౨౦౮

లలితుండు నాగకన్యలతో జూద మాడుట

క. ఆసురతాణులతో భూ
మీసురుఁ డట జూద మాడె మెలపు లెఱిఁగి తా

నే సరి యీసరి కను నెఱి
వాసికిఁ గాఁ బంతగించి పందెము లిడుచున్. ౨౦౯

తే. అట్టు లాగోఁచిపాతరాయుండు నిండ
నోలయుఁ కెలసమ్మున తనపణమ్ములుగ నొడ్డి
వరుసఁ దోలసిపూసలపేర్లు ప్రాఁతపుట్ట
ముం దుదిం జందెములు నోడె ముల్లెకునయి. ౨౧౦

తే. అంతఁ దత్తరంపడుచు నే మనుచుఁ దొంద
రించు నమ్మించుబోండ్ల జయించి సిరి గ
డించుజతనము ఘనముగ నుంచె మించు
పణ మిదే యని మొగి స్వాపఘన మతండు. ౨౧౧

క. ఆజాణలునుం బాచిక
లోజం గొని నేర్మి వైవ నుంకించిరి రా
రాజత్కంకణకింకిణి
కాజాలము వీనువిందుగా మొరయంగాన్. ౨౧౨

క. అత్తఱి వేపడగలదొర
మెత్తనిమేల్మెత్త నత్తమిల్లినకమలా
యత్తాత్ముఁడు వైకుంఠుఁడు
హాత్తినసంభ్రమమున నను నబ్జజ కిమ్మె. ౨౧౩

తే. అతివ! కనుఁగొంటె నీకూర్చునడుగులొత్తు
బ్రాహ్మణోత్తముఁ డటులు సర్వమ్ము నోటు

వడియు నుడుగక తనమేన యిడుచునున్న
వాఁడు పండెమ్ముగా, నింక వలలవా కృప? ౨౧౪

తే. నెక్కొ-న ననుగ్రహాత్మకనిగ్రహమ్ము
బ్రోవ మదిఁ గొన్న పదదాసుఁ ద్రోయు నెంత
లెంతలం బడఁ జలపట్టి, యింతి! తేదు
మోస మసలునకే విధి పొచ్చె మెచ్చు. ౨౧౫

వ. అని యనలువైచు ననురాగమ్మునను యోగమ్మున ననుచు
కుతుకమ్మున ననుడు, ౨౧౬

క. ఘృణఁ ద్రిజగద్భవ్యప్రా
పణనిపుణాపణము లన్న పలుకుంబడికిం
గణుతిం గడియించుమృదువీ
క్షణములు తత్క్షణమున మణిశరణముసుతయుఁ. ౨౧౭

తే. బక్క-ప్రేవుల ప్రోవులఁ జిక్కి- బయలు
పడు నెముకలగూడు బడుగుబాపనిపయి
జాలుకొను పేర్మికల్మి నెక్కొ-లు గీలు
కొనఁగ జాల మడంచి మించునెఱఁ బఱపె. ౨౧౮

వ. అంత, ౨౧౯

తే. అతనునకుఁ జూడ నితఁడు జో డనుట కంచు
కించుకేఁ దొడిఁ బడక హేమించురూప

సంపదం గనువిందులు సలుపువానిఁ
గలవు దీఱఁగఁ గాంచు భాగ్యమునకు నయి, ౨౨౦

తే. అందచందాల ప్రోవు లయ్యిందుముఖులు
పౌషమ నివ్వెఱబరువు సమ్ముగ్ధలవుచుఁ
దత్పరిగ్రహాస్పృహా రహిఁ దలమునుకలు
గాఁగ నుక్కిరిబిక్కిరి గాఁ గడంగి, ౨౨౧

క. అని రీలలి వలగొనువల
ననువుపషం బడఁతిమిన్న లనఘాత్మా! నీ
యనిశతనూషణ మదియే
పని కప్పు? నోకఁ డేను నోడువువార మవారిణ. ౨౨౨

తే. అలరు నేనియు గెలుపు నీ దవుచు నేము
నీదుకిల్లాకుబంట్ల మానెఱేని మెఱియు
వార, మవునెడ మాచెయి పయిద, వలయు
మాచెయిం గొన నీవు మార్మాట లేదు. ౨౨౩

తే. అని కుమారీవరన్యాయఫణితిఁ గూర్చి
పేర్చువచనసందర్భమ్ము వెలయఁ బలుకు
కులుకులాడుల మది మెచ్చుకొనుచు వైది
కుఁ డతఁ డౌ నవె నంపులకుం బిరాన. ౨౨౪

తే. అంతట వలంతు లవు నా నెలంతమిన్న
లెలయుకెలన మ్మసమ మయి వెలయ నడ్డ

సాళులం గొని చెంగున నేలి వైచి
రవని, వారిపక్షిమ పందె మయ్యె నరిది. ౧౨౫

వ. అప్పురుసున, ౧౨౬

క. మి న్నంది పొదలుముదముఁ
గన్నియమిన్నలు ముపురు రకమ్ముగఁ దను కై
కొన్నప్రతిన కిది తగ వనఁ
గ్రన్నం గొని రతనిఁ బతిఁగ గాంధర్వవిధిన్. ౧౨౭

వ. అనంతరంబ, ౧౨౮

క. శ్రీకలితుం డాలలితుం
డా కన్యారత్నములతో హారు వమరు నసం
ఖ్యాకమ్ములు తద్రత్నము
లాకిడుత నకమునఁ గొన్న యుతఁద్రై నుతఁద్రై. ౧౨౯

లలితుండు వివాహితలు నాగకన్యలతో స్వగృహము సేర నేగుట

తే. పడయ నోపఁ దా నట్టు లప్పాటిపెరిమ
నొప్పువిభవమ్ము కత మపు నువిడమిన్న
చండిఁ గొనియాడి యాడుచు నిండు నెడఁద
జేసి పయనమ్ము స్వగృహమ్ము సేర నరిగె. ౧౩౦

తే. ఆపెయును రూపసంపద ననుచాపు,
విభవమునఁ బురందరుఁ, గానుపీనమునకుఁ

గానని నిజనాథు, నప్సరోంగన లనంగ
నగడు నమ్మాన్మపురం గని నెమ్మనమ్ము ౨౩౧

వ. ఇట్లు బానరించుకొనుచక్కఁ జక్క నెక్కొల్గొన్న కౌతూ
హలం బింతింత నా రాక లోనికిం గొని చని యనువవు
తెరువునఁ జనవు వారం గారవించి తొల్లింటిగడుసుదన
మ్మది యెల్లఁ బెల్లగిలి పో నవ్వారికిం దలలోనినాల్క గ
నొక్క కొత్తుకన్మై సపత్నీత్వంబునం గలగుండుపడి నడి
వీదిం గాఁపురం బిడుకొనుననదతనంబునకుం గుఱి గాక
సుకం బుండె. వింటివా, యివ్వ్రతపుంగవంబు తెఱంగు;
ఇయ్యది పొదలునియతిం బానరింప నోపు ప్రోడలయిలు
జాడల నేనాఁడేఁ ద్రొక్క దారిద్ర్యమ్ము వెఱచఱచి
పఱచు; వఱలునక్కటికమ్మున నక్కలిమి కలువకంటి
యెనింటఁ బీటం బెట్టి నెట్టనఁ బట్టువడిన మహానందాను
భావమ్మున నట్టువ మ్మాడుచుండు. మరియు— ౨౩౨

తే. అసదె యాశ్వినమ్మున నిమ్మహావ్రతమ్ము
నాచరించుస్నానపరుల దైన మేలి
పున్నె? మన్నెఱి కవువాఱు పొనరుబత్తి
మైఁ గథాశ్రవణమ్మున మలయువారు. ౨౩౩

వ. అనవిని కొం తేయాగ్రజుం డమందమ్మానందమ్మున వేఘాగుల
నవ్విహంగమపుంగవహాయు వినుతించి మించె. ౨౩౪

## ఫలశ్రుతి

క. అని యూరకున్న సన్మని
జనవినుతు హిరణ్యగర్భజాతుం దన్నిం
కను మా మహిమశ్రుతిఫల
ము నెఱింగింపు మని వేఁడు భూవిభుఁ బృథునృపా, ౨౩౫

వ. కనుఁగొని కొనకొనుసరుసమ్మున కావాసపదమ్మైన మాన
సమ్మున నిడారి యాజడదారి యాదారికి దూరమ్ము గాని
గానవమ్మున నిట్లను మనుముపచగపరంపర తిరమ్ముగ విని
పింపంగడంగె నృపపుంగవా! యిమ్మెయి పుణ్యకథాశ్రవణ
పరాయణత నీక చెల్లుఁ; జెల్లిన నయుఃథానుసారిత్వ
మ్మునం దలక్రిందులై యడుగుపొలమ్మునం బడి బడలు
పడు నున్న విపన్నులకిమ్మాసమ్ముమాహాత్మ్యమ్మువినికియు
సముత్తారకమ్ముపాయమ్ము. అయ్యదియ నీకు వక్కాణింతు
వాకర్ణింపుము. ౨౩౬

ఆ. పుడమిఱేఁడ! వేలు పుట్టులలో నాన
గూడి పెరిగి పెరిగి కొండలంత
లైన దోసఁగు లడఁచు నపుడ నూ మాశ్వివ
శ్రవణ మగ్గి తూలరాశిలీల. ౨౩౭

ఆ. ఆదియుగము వేల నతులతపమ్మునఁ,
త్రేత జ్ఞానలబ్ధరీతికలన,

ద్వాపరమున యజ్ఞరూపకృతిం, గలి
మాసమహిమ వినికి మలయు సిద్ధి. ౧౩౮

వ. తొలఁగింప నలవికాని నెఱిం బులు లలిం బులుముకొనిన మలమ్మునకుఁ నెలవైన కలికాలమ్మున సంశుద్ధతం బొరయు నవు వెర వనవరత పురాణశ్రవణ పరాయణత్వమ్ము కాక మఱొండు కంచుకాగడా ల్వైచి వెదకి చూచిన నెందుం గానఁబడ, దిది ముమ్మాటికి నిక్కువ; మ్మటు లవుట, ౧౩౯

తే. నలిని నాలుగు కొలముల నలరఁ బుట్టు
గాంచినట్టివారలు మచ్చెకంట్లు నెల్ల
రుం బొనర్చి ప్రాతస్స్నానముం బొదలు ని
యతిఁ బురాణమ్ము వినఁ జను నఘము లెడల. ౧౪౦

తే. అందు నిషమాసపరమునయుం దమంద
తం దవులుబుద్ధి నమ్మొలిచందమునఁ గ
డుం దనరని చెట్టలు పుట్టు లొంది వ్యర్థ
తం దగ ననాథశిశువు ల ట్లందువారు. ౧౪౧

తే. జన్మజన్మాంతరమ్ములజాలునఁ బడి
యాఁదలఁ బడు దొసఁగుల నీచాతినీచ
యోనులం బడి బడలువాఁడేని ముక్తి
నెనయువాఁ డాశ్వినముకథ వినునయేని. ౧౪౨

వ. తప్పిదారిన యావుంగాక యాఁకట్టుకొని పోని పడిన యిన్నె
లదవ్రుకత పనికి వెనుకంజ యిడక కడకొని తనపని తాఁ
దీరిచి తీరు; నిది యద్దాని కుగ్గఁబాలతో గలవడిన
గొనంబ మెఱుంగు లీను తెఱఁగున మణి కెవాఁడే నెం
దుఁ గేఁ బ్రమాత్మమ్ము నుపక్రమమ్ము నుపసంహారమ్ము
నల్పానల్పవ్యవస్థాకల్పనమ్ము నిమ్ముకొనియున్నె? పున్నె
మ్ములమూట యనం బోలు మేలికథానక మ్మొకగుండు
నలువాఱు, వినుము. మున్ను సత్యలోకమ్మునఁ బురాణ
కథావిధానవివరణసందర్భంబున నంబురుహాసనుండు నిండు
తమకమ్మున నే నడుగువడువున కనుపడిన యితిహాస
మ్మొకరుం డుపదేశించె; నత్తెఱంగు నీ కెఱింగింతు. ౨౪౩

చంద్రకాంతభూకాంతుఁడు భటులతో వేఁట కటవుల కేగుట

తే. పెరయఁ జంద్రత కాంతత పెరిమఁ జంద్ర
కాంతుఁ డను పేరు తగఁ దన కెంతయేని
మొనయుసంపత్తి ధనదున కెనయ యనఁగ
నేలె మును మహోదయాపుర మినుఁ డొకండు. ౨౪౪

క. పరఁగె నొగి మహోదయములు
పరమోదయుఁ డా పతిపరిపాలనమున న
ప్పురవరము మహోదయతా
గరిమముఁ జరితార్థ మెలమిఁ గావించు నెఱిన్. ౨౪౫

మ. అనఘుం డా దొర యొక్క నాఁడు మృగయావ్యాపార
మేపార నద్రిస్థలంబుల్ తవుపోటుబం క్తైలయు పేర్మిన్
వెంట రా ఘోరకాననముల్ దూఁకొని మేకొనం జలము
సన్నల్ పట్టి పాలార్చి పేర్చి నతిక్రూరములన్ వధార్హ
ములు నై చెన్నారువన్యమ్ములన్. ౨౮౬

ఆ. కూల్చు టట్టు లేరి కుప్పలు గూర్చుట
పఱచు మెకము నంటి చఱచుటయును
మొనయు నట్టివేఁటపని మొగమ్ములబడి
వారి కపుడు నడిమిపవల యయ్యె. ౨౮౭

ఆ. అంత నలసి సొలసి యాలలి నాలుక
పిడుచ గట్టి యడఁచి మడఁచు జాడ
కిగుచు మొగకొనుదగ న ట్టెట్టు లై సేరి
రోకఁడు కొలను వార లొక్క మొగిన. ౨౮౮

క. అరయక ముందున్ వెనుకయుఁ
బరికింపక పరిసరమ్ముపద్ధతులు ధరా
వరుఁ డాతఁడు డిగె భటులతో
సరసున నీర్ద్రావు టొకఁడ సరి యవు గుఱి గాన్. ౨౮౯

స్త్రీలు చంద్రకాంతుని సభటమ్ముగ నింతిని కమ్మని శపించుట

ఆ. ఆసరోవరమున నాస వివసనలై
జలవిహారపరత నలరునలరు

బోండ్లు కొందఱ అప్పుడు పొరి సిగ్గువఱువునం
దొట్రిలంగ నెలుంగు దొరకు ననిరి. ౨౧౦

క. అంగన లున్నెడకుం బో
వంగా వలనుపడదు మగవార లెనాండే
నిం గలుగుప్రసంగ మది పొ
సంగించుం గారవమ్ము సా మగుతెఱంగుల్. ౨౧౧

ఉ. అందును గట్టుపుట్టముల నట్టు ధరింపక యొంటి నున్న ప
ట్లుం దలిరాకుబోంట్ల వికలత్వము దారొకన నీక్షసేయు
మాట్లిం దవు లొందు మందులు మొగిం బడి యాఱడిం
దక్కవార లం చందురు పండితుల్ దెలిసి యమ్మొయి
యిమ్మొయి కొదు వే నృపా! ౨౧౨

ఆ. అనుచు నను చుపలుకు లను వొప్పం బలుకు ప్రీ
డావతుల పొలు మకడానిం బోలి
మేలిమెఱుంగు లీను మేనుతీవియం జొక్క
మైన తకు్కనవ నూనాళిం బొళి, ౨౧౩

ఆ. కాంచి కనులు వేలుగా ననల్ పనలును
వైవ నాస లన్నతీవియ లటు
ప్మోధవుండు చంద్రకాంతుం డత్తఱి నఱి
దాహ మొకరకము దాహ మొనసె. ౨౧౪

ఆ. పొంచి తలకిసి వేచి మించి మర్మములు గా
యమ్ము లొ నెటిఁ బుపుటమ్ము లెలమిఁ
గూర్చి యాతనుఁ డపుడు కుప్పనగూరలు
వైవ వికలుఁ డవుచు బడలె నృపుడు. ౨౪౫

వ. అప్పురుసున నప్పుడమితేఁడును పీడనితమకమ్ము ముమ్మ
రమ్మై తలకుఁ మిగుల నిలువర మ్మొలయక కట్లు
త్రెంచుకొని పాఱ నుంకించు నింద్రియవృత్తులపేరింటి
వారువమ్ముల నటికట్టి గాటం గట్టి యిదుకొలందికి
దూరమ్మై తోడిపరివారమ్మునకుం గాసారమ్మున నలు
వలంకులు జుట్టి డిగం దగు ననునెటి నెఱయించు కన్న
నన్న లెలయించుచు మించినకామునామయమ్మునం దవిలి
రానున్న సన్నిపాతమ్మున నవు నవుఁగాములు చింతించు
కొనువెర వటి కరేణువులపయిం గవియు మత్తకరీంద్ర
మ్మ వడువున నమ్మించుబోంట్లపయిం బడుపూనికి మేర
మీఱకి కొలనిం జొరఁబాఱె; నయ్యుద్ధతుల యయ్యుద్యోగ
మ్మపద్ధతు లవలోకించి, ౨౪౬

క. మునికాంతల యాకాంతలుఁ
బనుపడి పొనరువెఱ వడఁకఁ బాఱి కరువలిఁ
ననలీవ లట్టు లెచ్చై
యనువుపడం బొడముకినుక యరుణాంబకలై, ౨౪౭

క. శపియించి రత్యుదగ్రత
నపగతసదసద్విచారులారా! కృతపా
పపుగతి కను వవు గతి మీ
రిపుడే తరువు లవు తెరువు నెనయుఁ డటంచున్. ౨౧౮

సీ. అమరున న్నతి నున్నతము లయి బలిసిన
మేనులు మానుల మేలపు సూపఁ
గానకొని చెవులు లోచనవివరమ్ములు
వాతులు దొఱటలవలను దెలుపఁ
బొడవులై దలములపోఁడుము లెవ్వలయించు
బాహువుల్ కొమ్మలై పరఁగ నోపఁ
బేరిమిరతనాల వెలయుసొమ్ములు నాయు
ధమ్ములు నాకులయిమ్ము గొలుప
నిగిడి నింగికి సేలకు నెమ్మిఁ జుట్ట
తికము నెలయించు నూడలరకమున కయి
రహిఁ దలిర్పఁ దనూశిరోరుహము లెల్లఁ
జెట్ల లవ్వార లవ్వేలఁ జెట్టులైరి. ౨౧౯

తే. అన్నాటిన యేండ్లు బూం డ్లొకకొన్ని చన్న
యవల జగదనుగ్రహపరాయణాతఁ గొన్న
తీర్థసంసేవనవ్రత మర్థి మీవుల
నా నిజన్యాగను లొకకొంద తెనయు వేడ్క, ౨౨౦

వ ఆదారిం బోవుచుం జేరువ నమలినామృతసారంబై పద్మ షండమండితోదరపరిసరగభీరంబై విరళచ్ఛాయానిషేవణీయానేకానోకహమనోహరతీరంబై నలువారు నశ్వాసారమ్ముఁ గనుంగొని ప్రహృష్టమ్మంతరంగమ్మున నయ్యెడన విడిసి పీటముం బెట్టి దైవయోగమ్మునం బ్రాప్తించిన యాశ్వినమాసమ్ము ననమాన మ్మని పేనోళ్ళం గొని యాడుచు నమ్మాసమ్ము నయ్యెడన కడపుతలంపు నిండార నప్పుడ సంకల్పించి మాసస్నానమ్మునకుం గడంగిరి.

తే. అటులు స్నానమ్ము సంధ్యయు నఘము దొలంచు
మాస మాహాత్మ్యసంశ్రుతిమహితదీక్ష
రాజరాజేశ్వరీపదాంభోజపూజ
నిత్యవిధు లయ్యె నయ్యెడ నెటి మునులకు. ౨౬౨

వ. ఆపూర్ణిమనాఁటిప్రొద్దున, ౨౬౩

తే. సలిపి నియమానుసారమ్ము స్నాన, మాల
కించి మాసమాహాత్మ్య, మర్చించి మించు
భక్తి రమ, దీక్ష ముగియించి, పరమమునులు
వార లట సమాసీనులై వటలుతటిని, ౨౬౪

చంద్రకాంతాదులు స్వస్వరూపముల నొందుట

క. వారక చల్లనినీడలు
వారిక నమకూర్చి పేర్చు భాగ్యమ్మున కా

భూరుహ ము ష్వ కొనెం మ
వై రాజిలు తొంటిరూపు లనువు పడంగాన్. ౨౬౭

తే. అట్టుశాపమ యాను తెర నవలం ద్రోసి
పులు గడిగిన ముత్తెములపోల్పున వెలుంగు
రాజు భటులును మునుల కర్యోజ నెఱంగి
యుని రీటు లనుచుం బ్రశ్రయావనతు లగుచు. ౨౬౮

ఆ. తబిసిమిన్నలారా! ధర్మస్వరూపమ్ము
లార! మీరు రహించుకూరిమి మెయి
వేగం గడచితి మిటు వృజినార్ణవము దొంటి
ప్రభుత భటత యచ్చుపడంగం దొడంగ. ౨౬౯

క. చేతులమీరందుగం జలిపిన
చేంతఱికమ్ములకుం బోలు శిష్టగ మునికాం
తాతిలకమ్ములశాపము
లీతీరునం జేసె మమ్ము నెల్లర ప్రమానుల్. ౨౭౦

క. పారసిననియమమ్మున మీ
దారకొనిన యదోవ్రతమ్ముతోరపుగరిమం
బరుదార వీనులం బడు
పరు వమరం గానితి మిట్టి భాగ్యం జెలమిన్. ౨౭౧

క. అని సకోటగ్గోనునాదృతి
నను చుమతిం బునఃపునఃప్రణామమ్ములు వా

రనువుపడం బొనరిచి పని
వినిరి కొనిసమునులముదల వే నిజపురికిన్. ౨౭౦

వ. అమ్మునీంద్రులు నమ్మేయి సమ్ముఖమ్మునన ప్రత్యక్షమ్ముగం
గంటిరి కదా నామహి మమ్ము హీన మ్మని రూపు వారసి
మెఱసి నిలవైచి యడిగినట్లు లప్పట్టనం బుట్టిన యమ్మ
హాఘటనమ్ము ఘటనకుం గారణ మ్మవు సీపమాహాత్మ్య
శ్రవణావైభవమ్ము నెల్ల వేనోళ్ళం గీర్తించుచు మునికో
టిననియామమ్ము నిరంతరాయమ్ముగఁ గొనసాగించి యంచి
తులై యథేచ్ఛం జని; రట్లుకావున, ౨౭౧

క. పౌరి మెఱయు నవశ్యసమా
చరణీయత మాసముప సుస్నానమ్ము కృతా
దరమున మహాత్మ్యశ్రుతి
నరులకు భవబంధకృంతనపరులకుఁ గలిగెన్. ౨౭౨

ఆ. పొచ్చె మెడలి పొదలు నిచ్చ యచ్చమ్ముగ
నెచ్చ నిచ్చ లొకఁడయేని సామ
యేనిఁ బాదమాత్రమేఁ బురాణమ్ముశ్లో
కమ్ముఁ జనుఁ బఠించునిమ్ముఁ గొనఁగ. ౨౭౩

ఆ. అవల నలఁతిఁబోని దవు బత్తి యివు రెత్తి
రాణ మెఱయు నప్పురాణపుస్త
కమ్ము వాచకాగ్ర్యు నిమ్ముగా నుపచార
సరణి పూలపూజ సలుప నొప్పు. ౨౭౪

వ. పయస్వినియు సవత్సయు నగు నావును సుసమర్చితుండగు వ్యాసున కుల్లాసం బసదృశంబుగ సమర్పించి గీతవాద్య పురస్సరంబుగ సమ్మోహితు నిరవుం జేర్పవలయు; నస్త్రైరు పున నత్తఱి నమ్మెంద విడు నొక్కొక్కరుం డను గోక్షక వాజిమేధంబునకుం దీసిపోని ఫలమ్ము దాత కొనగూరుచు.

క. అత్తఱి గిరికొను పేరిమి
ముత్తోరతనమ్ములు పసుపుం గుంకుమముల్
చిత్త మెలర్పఁ గొని ముదా
యత్తతఁ బూజింపవలయు నాలం బౌళిక. ౧౭౬

తే. విని పురాణమ్ము వాచకు వేడ్కఁ గొలుచు
వనిఁ దదనుసరణమ్మున మనసు నిడని
జనుఁడు కాఁగలఁడు జన్మజన్మములకుఁ
జీకు మూఁగ దరిద్రుఁడు చెవిటి కుంటి. ౧౭౭

వ. ఆరడపటి దినమ్మున, ౧౭౮

తే. చుట్టపక్కాలఁ గన్నెలఁ జూడ వచ్చు
వారల సువాసినుల నల వ్యాసు హితుల
నాప్తులం గూడి వలయుఁ బాయసము నార
గింప, నయ్యదె వ్రతసిద్ధి కెల్లగాఁగ. ౧౭౯

క. ఇమ్మెయి నిమ్మామహిమ
మ్మిమ్ముకొను మహానిరూఢి యొనయుఁగ విను భా

గ్యమున్ గలాఁడు జగమ్ముల
యుష్మత్కృపకు భాజనమ్మ యఁవున్నట్టిఁడు సూ. ౨౮౦

ఆ. అనుచు ననుచువాక్కులన లెసక మెసంగ
వినుము యనుచు వినుచు విధియనుంగు
కొడుకుఁ గాంచి పుడమియొడయుండు పృథు విట్టు
లనియె భక్తిభావ మెనయునట్టు. ౨౮౧

మ. మునిచంద్రా! నెరసుల్ దొలంగ జగముల్ పూజ్యస్థితిం
బ్రాజ్యతేజ మొనయంగా నగు భంగి మేకొన సతమ్ముం
బావితమ్ముల్ పొనర్చునెఱిం గ్రుమ్మరు యోగిచంద్ర
ముఁడ విచ్చేచ్చి నిల్చి నీ విట్టి మచ్చున నెచ్చం గృప
బోధసేసితి రమాశుంభత్సపర్యావిధుల్. ౨౮౨

తే. పొనరుబుద్ధి మఁప్రొద్దుల ముప్పాలముల
వారికేనియుఁ బూజ్యులు పరమభాగ
వతుల మేలికత ల్వినువాసిఁ గొంటి
నఘము లడు గంటి భవముఁ బ్రోయంగ నుంటి. ౨౮౩

మ. అని నెక్కొల్గొను భక్తిభావము తిరమ్మై చక్కికిం గాఁ
బునఃపునరష్టాంగయుతప్రణామశతకమ్ముల్ సర్చిలిం జల్పి
పొల్చిన యప్పార్థివవంశభూషణు శుభాశీర్వాదసంపత్తి ధ
న్యుసిఁ గావించి విధాత్రసూతి మెలపుల్ నూఁగ్గో యథే
చ్ఛం జనెన్. ౨౮౪

క. అను రోమహర్షసంజా
తు సతులధిషణాసమేతు దక్షేయపురా
ణనికరరసనిష్ణాతుఁ
ఘను సూతుం గాంచి శౌనకమునిప్రముఖుల్. ౨౮౧

తే. ఓ మహాభాగ! తెల్పితి వుత్తమోత్త
మమ్ము చిత్కలాప్రీతింకరమ్ము భవహ
రమ్ము నిషముమహామహిమమ్ము మమ్ము
నావరించిన మాయాగ్రహమ్ము వాయ. ౨౮౨

క. ఇన్నేటఁ దప్పం బోవని
సన్నన తనరారు నెనరు జాల్కొను మేల్మిన్
మన్ననఁ గను తక్కిన నెల
ల న్నెగడుమహిమము వినుచులాగుసఁ దగవో? ౨౮౩

తే. తెప్పవై యొప్పి తీవ యేచొప్పున నటు
కడవ నేరని కలికాలకలుష మన్న
కడలిఁ బడి కొట్టుమిట్టాడు జడమతులకు
మాకు నుం బురాణవివృతిమహిత! సూత! ౨౮౪

క. అని ప్రాంజలులై ప్రార్థిం
చిన నర్థి సమర్థుఁ డతఁడు చెనసి ప్రమోద
మ్మను పద మొదఁ గుమరుకొనన్
మునిమానసపూర్తికపుడు పొలిచె సుముఖతన్. ౨౮౫

స్రగ్విణి— అస్తినాస్తిస్వరూపాగమప్రోక్తిసం
శస్తమార్గానులక్ష్యప్రమాణక్రమా!
స్వస్తికృత్స్వస్తిమద్భావసంభావితా!
వస్తుతస్సిద్ధసద్వస్తుతానిస్తులా! ౨౯౦

మ. సమయాచారవిచారసారపదవీసంరూఢసంఖ్యావదీ
ప్రముఖసంక్లప్తమహోపచారపరితుష్టశ్రీమహారాజ్ఞికా
సుముఖాంభోజవిలోకనాకలితసుస్థాస్త్రైరహస్యాంకుర
స్తిమితోత్సాహరసప్రసారరచితాశేషప్రపంచోచ్చయా!

విద్యు— ఉద్యద్విద్యోతోరుస్ఫూర్తీ! సద్యోజాతాంచల్లాలాటా!
విద్యున్మాలాప్రేంఖత్కేశా! విద్యావిద్యావేద్యావేద్యా!

శా. శ్రీసత్యాఖ్యవిలాసినీతిలకహృల్లీసముస్ఫూర్తత్త్వానువల్లీసంప
త్ప్రసఫుల్లసత్ఫలసుపాలీలాలనాలోల సద్భావ్యసాంగుండల
రంగరాజమణిదా వంశంబు భవ్యంబుమేల్వాసిందామర
తంపరై వెలయుంత్రోవం గూర్పుమాశీస్సులన్. ౨౯౩

గద్య— ఇది శ్రీ శ్రీవత్ససగోత్రపవిత్ర, చిదంబరపాత్రి
వాగభూషణసుధీవరపుత్త్రి, శ్రీబాలాత్రిపురసున్దరీ
గర్భశుక్తిముక్తాఫలాయమాన, ప్రభాకర, లక్ష్మీ
నరసింహశాస్త్రిసమాఖ్యానప్రణీతంబైన
కాలభాగవతమున సప్తమస్కంధమున
నాశ్వీనమాహాత్మ్యము
పంచమాశ్వాసము
సమాప్తము.

# తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 1 | నెందు | నెంతు |
| 52 | 3 | వర్తిలఁ | వర్తిల్లఁ |
| 53 | 7 | మర | మరల |
| 54 | 15 | కితమ్ముగా | కితముగా |
| 96 | 14 | దయువారు | దయివాగు |
| 103 | 20 | వల్లిగం | వల్లింగం |
| 104 | 4 | గొడు | గొడ్డు |
| 105 | 13 | గుతుకమ్మువ | గుతుకమ్మున |
| 185 | 1 | లయిదుఁ | లయియుఁ |
| ,, | 21 | యడే | యిడే |
| 186 | 10 | పాల్గొ | పాల్గొ |
| 196 | 19 | మొకండె | మొకఁడె |
| 204 | 5 | సద్బుద్ధి | సద్బుద్ధి |
| 244 | 8 | గొనియో | గొనియొ |
| 247 | 17 | వేడిన చేఁదుక | వేఁడిన వేదుక |
| 250 | 5 | తీర్చి | తీర్చి పేర్చి |
| 260 | 2 | ముపాంగలిత | ముపాంగలలిత |
| 298 | 1 | జింత | చింత |
| 303 | 2 | నపు | నవు |
| 316 | 16 | పట్టుఁ | పట్టు |
| 325 | 18 | ధర్మ్మవు, నలఘు | ధర్మ్మవునలఘు |
| 331 | 15 | మరియు | మఱియు |
| ,, | 21 | నవ్వి హాంగమ | నవ్విహాంగమ |
| 337 | 10 | కులు జొట్టి | కులుఁ జొట్టి |

| | | | |
|---|---|---|---|
| 340 | 7 | ఓరా! | ఓరి! |
| 341 | 9 | యథేచ్ఛం | యథేచ్ఛం |
| ,, | 12 | మహాత్మ్య | మాహాత్మ్య |
| ,, | 21 | పూలపూజ. సలుప నొప్పు. | పూజ సేయఁ జనును బువుల. |
| 343 | 7 | నెరసుల్ | నెఱసుల్ |
| ,, | 12 | బోధ | బోధ |
| ,, | 13 | ముప్రాద్దుల | ముప్రొద్దుల |
| 344 | 18 | సమర్థుఁ | సమర్థుఁ |